WRITTEN ACCORDING TO NEW EASY METHOD

# అశోక
# ఆంగ్లేయబోధిని


గ్రంథకర్త:

విద్వాన్ A. సుబ్బరాయగుప్త, M. A., B. O. L., B. Ed.

*(Retired Lecturer and Research Scholar)*






పబ్లిషర్సు:

బాలసరస్వతీ బుక్ డిపో.

(రిజిష్టర్డు) విద్యావిషయక ప్రచారకులు

6, సుంకురామశెట్టి వీథి, మద్రాసు - 1.

P. B. No. 3, కర్నూలు.

1968


 [వె [illegible] -00

WRITTEN ACCORDING TO NEW EASY METHOD

# అశోక
# ఆంగ్లేయ బోధిని

ఇందు సులభ శైలిలో ఇంగ్లీషుకు - తెలుగు అర్థములు, తెలుగుకు-ఇంగ్లీషు అర్థములు, ఉచ్చారణ (Pronunciation), లెటరు రైటింగు, గ్రామర్, వ్యాసములు (Essays), సామెతలు (Proverbs) మొదలగు విషయములు యివ్వబడినవి. పిన్నలు, పెద్దలు సులభముగా ఆంగ్లమును నేర్చుకొనుట కుపయుక్తమగు కల్పతరువు.


గ్రంథకర్త :

విద్వాన్ A. సుబ్బరాయగుప్త, M. A., B. O. L., B. Ed.

*(Retired Lecturer and Research Scholar)*






పబ్లిషర్సు :

బాలసరస్వతీ బుక్ డిపో,

(రిజిష్టర్డు) విద్యావిషయక ప్రచారకులు

6, సుంకురామ శెట్టి వీధి, మద్రాసు - 1.

P. B. No. 3, కర్నూలు.





1968

[వెల : రు. 6_00

# పీ ఠి క

మా 'అశోక ఆంగ్లేయబోధిని' గొప్ప అనుభవశాలురగు విద్వాన్ A. సుబ్బరాయగుప్త, M. A., B. O. L., B. Ed. గారిచే వ్రాయించి ప్రకటించితిమి. ఆంగ్ల నిరక్షరాస్యులకు సులభముగా కొలదికాలములోనే నేర్చుకొని, ఆంగ్లము వ్రాయుటకును, మాట లాడుటకును మిక్కిలి ఉపయోగపడును. ఇందులో సులభశైలిలో ఇంగ్లీషుకు - తెలుగు అర్థములు, తెలుగుకు - ఇంగ్లీషు అర్థములు ఉచ్చారణ, పత్రలేఖనము, వ్యాకరణము, వ్యాసములు, సామెతలు మొదలగు అనేక విషయములు చేర్చబడినవి. ఇయ్యది పిన్నలు, పెద్దలు సులభముగా ఆంగ్లము నేర్చుకొనుట కుపయుక్తమగు కల్పతరువు. ఇందులో కొన్ని నాయకుల జీవితచరిత్రలు చిత్ర పటములతో ప్రచురించితిమి. మా సంస్థ యెల్లరకు ఉపయుక్తమగు యిట్టి గొప్ప గ్రంథమును ప్రచురించినందులకు సంతోషమగు చున్నది.

ఇట్లు,

ప్రకాశకులు.

# INDEX - విషయసూచిక

శ్రీ అశోక

# ఆంగ్లేయ బోధిని

## 1. Alphabet

## ఇంగ్లీషు అక్షరమాల

ఇంగ్లీషు భాషయందు 26 అక్షరములు కలవు. వాని పేర్లు క్రింద ఇవ్వబడినవి.

ఎ, బి, సి, డి, ఇ, ఎఫ్, జి, హెచ్, ఐ, జె,

కె, ఎల్, ఎమ్, ఎన్, ఒ, పి, క్యు, ఆర్,

ఎస్, టి, యు, వి, డబ్ల్యు, ఎక్స్, వై, జెడ్.

తెలుగు భాషయందు వ్రాయుటకు, అచ్చు చేయుటకు ఒకే విధమయిన అక్షరములను ఉపయోగించుదుము. ఇంగ్లీషు భాషలో అట్లుకాక వ్రాయుటకు, అచ్చు చేయుటకు వేరు వేరు అక్షరములు కలవు. అవి ఏవన :

1. Script letters : (స్క్రిప్టు లెటర్సు) :—
వ్రాత అక్షరములు.

## 2. Print letters : (ప్రింట్ లెటర్సు) :— అచ్చు అక్షరములు.

ఈ రెండు రకములలోను, ఒక్కొక్క దానియందు మరల రెండు రకములు కలవు.

అనగా వ్రాత అక్షరములలో—

(1) పెద్దవి (2) చిన్నవి

అని రెండు రకములును;

అచ్చు అక్షరములలో—

(1) పెద్దవి (2) చిన్నవి

అని రెండు విధములును కలవు.

ఈ విధముగా ఇంగ్లీషు భాషలో మొత్తము మీదనాలుగు రకముల అక్షరములు క్రింద కనుపరచిన విధమున ఉన్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. | వ్రాత పెద్ద అక్షరములు | = | 26 |
| 2. | వ్రాత చిన్న అక్షరములు | = | 26 |
| 3. | అచ్చు పెద్ద అక్షరములు | = | 26 |
| 4. | అచ్చు చిన్న అక్షరములు | = | 26 |
| | మొత్తము వాడుకలోనుండు అక్షరములు | = | 104 |

ఈ అక్షరములు అన్నియు పేర్లతో ఇవ్వబడినవి. గమనించుకొనుము.

# అచ్చు అక్షరములు

## 1. పెద్దవి

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఎ | బి | సి | డి | ఇ | ఎఫ్ | జి | హెచ్ | ఐ | జె |
| A | B | C | D | E | F | G | H | I | J |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కె | ఎల్ | ఎమ్ | ఎన్ | ఒ | పి | క్యు | ఆర్ |
| K | L | M | N | O | P | Q | R |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఎస్ | టి | యు | వి | డబ్ల్యు | ఎక్స్ | వై | జెడ్ |
| S | T | U | V | W | X | Y | Z |

## 2. చిన్నవి

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఎ | బి | సి | డి | ఇ | ఎఫ్ | జి | హెచ్ | ఐ | జె |
| a | b | c | d | e | f | g | h | i | j |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కె | ఎల్ | ఎమ్ | ఎన్ | ఒ | పి | క్యు | ఆర్ |
| k | l | m | n | o | p | q | r |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఎస్ | టి | యు | వి | డబ్ల్యు | ఎక్స్ | వై | జెడ్ |
| s | t | u | v | w | x | y | z |

# వ్రాత అక్షరములు

## 1. పెద్ద అక్షరములు

ఎ బి సి డి ఇ ఎఫ్ జి
*A B C D E F G*
హెచ్ ఐ జె కె ఎల్ ఎమ్ ఎన్
*H I J K L M N*
ఒ పి క్యు ఆర్ ఎస్ టి యు
*O P Q R S T U*
వి డబ్ల్యు ఎక్స్ వై జెడ్
*V W X Y Z*

## 2. చిన్న అక్షరములు

ఎ బి సి డి ఇ ఎఫ్ జి హెచ్ ఐ జె కె
*a b c d e f g h i j k*
ఎల్ ఎమ్ ఎన్ ఒ పి క్యు ఆర్ ఎస్ టి
*l m n o p q r s t*
యు వి డబ్ల్యు ఎక్స్ వై జెడ్
*u v w x y z*

## Exercise No. 1

(ఎక్సర్‌సైజ్ నెం. 1)

అ భ్యా స ము 1.

1. క్రింది అక్షరములను పోల్చుకొని చదువుము :

(i) K G L M T X W D R H F Z A V N

(ii) q t d b e g a m y c

(iii) *D M O R W E A T I K H.*

(iv) *d f h p q s r t k t l y a m*

2. ఈ క్రిందివానికి సమానమయిన ఇంగ్లీషు అక్షరములను, నాల్గు రకములను వ్రాయుటకు నేర్చుకొనుము.

ఎం ఎక్సె పి బి టి డి ఆర్ జెడ్ హెచ్ ఎల్ కె ఎస్ క్యు సి ఐ ఎన్



# 2. Vowels and Consonents

## వొవల్స్ అండ్ కాన్సొనెన్ట్స్

## అచ్చులు - హల్లులు

ఇంగ్లీషుకు 26 అక్షరములు కదా! వీనిలో ఐదు మాత్రము Vowels: వొవల్స్ = అచ్చులు; పందొమ్మిది అక్షరములు Consonents: కాన్సొనెన్ట్స్ = హల్లులు. మిగిలిన రెండు ఉభయాక్షరములు.

ఉభయాక్షరములు అనగా, అచ్చులుగా, హల్లులుగా ఉపయోగపడు అక్షరములని అర్థము.

ఈ క్రింది ఐదును అచ్చులు:

a = ఎ

e = ఇ

i = ఐ

o = ఒ

u = యు

ఈ క్రింది 19 అక్షరములును హల్లులు :

బి, సి, డి, ఎఫ్, జి, హెచ్, జె, కె, ఎల్, ఎమ్,

b, c, d, f, g, h, j, k, l, m,

ఎన్, పి, క్యు, ఆర్, ఎస్, టి, వి, ఎక్స్, జెడ్.

n, p, q, r, s, t, v, x, z.

u = యు. మరియు y = వై అను అక్షరములు పదములకు మొదట వచ్చిన హల్లులుగను, కడపట వచ్చిన అచ్చులుగను పనిచేయును.

హల్లులను ప్రత్యేకముగా పలుకుటకు వీలులేదు. అవి అచ్చులతో కలిసినప్పుడే పలుకుటకు వీలగును.



# 3. Words (వర్డ్స్)

## ఇంగ్లీషు - తెలుగు - వర్ణమాల

[పటమును చూచి పదములను నేర్చుకొనుము]

| | | | |
|---|---|---|---|
| A<br>ఎ | Ant<br>ఆంట్ |  | చీమ |
| B<br>బి | Bag<br>బ్యాగ్ |  | సంచి |
| C<br>సి | Cat<br>క్యాట్ |  | పిల్లి |
| D<br>డి | Dog<br>డాగ్ |  | కుక్క |
| E<br>ఇ | Egg<br>ఎగ్ |  | కోడిగ్రుడ్డు |
| F<br>ఎఫ్ | Fan<br>ఫ్యాన్ |  | విసనకర్ర |

| | | | |
|---|---|---|---|
| G<br>జి | Goat<br>గోట్ |  | గొఱ్ఱె |
| H<br>హెచ్ | Hen<br>హెన్ |  | కోడిపెట్ట |
| I<br>ఐ | Ink<br>ఇంక్ |  | సిరా |
| J<br>జె | Jar<br>జార్ |  | కూజా |
| K<br>కె | Kite<br>కైట్ |  | గాలిపడగ |
| L<br>ఎల్ | Leg<br>లెగ్ |  | కాలు |
| M<br>ఎమ్ | Mat<br>మ్యాట్ |  | చాప |

N Net
ఎన్ నెట్



వల

O Ox
ఓ ఆక్స్



ఎద్దు

P Pen
పి పెన్



కలము

Q Queen
క్యు క్వీన్



రాణి

R Rat
ఆర్ ర్యాట్



ఎలుక

S Saw
ఎస్ సా



ఱంపమ

T Tub
టి టబ్



తొట్టి

U Umbrella
యు అంబ్రెల్ల



గొడుగు

V Van
వి వ్యాన్



మోటారు

W Web
డబ్ల్యు వెబ్



సాలెగూడు

X Xebec
యక్స్ జిబెక్



పడవ

Y Yak
వై యాక్



జడల బఱ్ఱె

Z Zebra
జడ్ జీబ్రా



కంచెరగాడిద

# 4. Sounds of English Letters

(సౌండ్స్ ఆఫ్ ఇంగ్లీష్ లెటర్స్)

## ఇంగ్లీషు అక్షరముల ధ్వనులు

### (1) Vowels - అచ్చులు

A, E, I, O, U, అనునవి అచ్చులుకదా! ఇవి కలిగించు ధ్వని (పలుకవలసిన విధానము) ఈ క్రింది పట్టికలో చూపబడినది. శ్రద్ధగా గమనింపుము.

| అచ్చు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| 1. A | నాలుగు విధములైన ధ్వనులు కలవు. | ఆ | Man = మ్యాన్ = మనుష్యుడు<br>Hand = హ్యాండ్ = చెయ్యి. (ఈ ధ్వని ఆ + ఏ కలిపి పలికినట్లు ఉండును) |
| | | ఆ | All = ఆల్ = అన్ని<br>Garden = గార్డన్ = తోట<br>Father = ఫాదర్ = తండ్రి |
| | | ఎ | Any = ఎని = ఏదైనను |
| | | ఏ | Gate = గేట్ = సింహద్వారము<br>Wages = వేజస్ = కూలీ<br>Make = మేక్ = చేయుట |

| అచ్చు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| 2. E | ముఖ్యముగా నాలుగు రకములైన ఉచ్చారణలు కలవు. | ఇ | Me = మి = నన్ను<br>The = ది = ఆ |
| | | ఈ | Teeth = టీత్ = పండ్లు<br>Leaf = లీఫ్ = ఆకు |
| | | ఎ | Egg = ఎగ్ = కోడిగ్రుడ్డు<br>Bed = బెడ్ = పడక<br>Well = వెల్ = బావి |
| | | అ | Her = హర్ = ఆమెయొక్క<br>Were = వర్ = ఉండినవి |
| 3. I | మూడు విధములైన ధ్వనులు కలవు. | అ | Dirt = డర్ట్ = మురికి |
| | | ఇ | Pin = పిన్ = గుండుసూది<br>Sin = సిన్ = పాపము<br>Tin = టిన్ = డబ్బా |
| | | ఐ | Fine = ఫైన్ = జరిమానా<br>Shine = షైన్ = ప్రకాశించు<br>Kite = కైట్ = గాలిపటము |
| 4. O | నాలుగు విధములైన ధ్వనులు కలవు. | ఆ | Cot = కాట్ = మంచము<br>Ox = ఆక్స్ = ఎద్దు<br>Fox = ఫాక్స్ = నక్క |

| అచ్చు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| | | ఉ | Book = బుక్ = పుస్తకము<br>Good = గుడ్ = మంచి |
| | | ఊ | Move = మూవ్ = కదలించుట<br>Tool = టూల్ = పనిముట్టు |
| | | ఓ | Nose = నోస్ = ముక్కు<br>Crow = క్రో = కాకి<br>Grow = గ్రో = పెరుగుట |
| 5. U | నాలుగు విధములైన ధ్వనులు కలవు. | అ | Cup = కప్ = గిన్నె<br>Bud = బడ్ = మొగ్గ |
| | | ఉ | Bull = బుల్ = ఎద్దు |
| | | యు | Unite = యునైట్ = ఒకటిగా కలిసి యుండుట |
| | | యూ | Universe = యూనివర్స్ = ప్రపంచము. |



## (2) Consonants - హల్లులు

హల్లులు పందొమ్మిది కదా: వాని ఉచ్చారణా విధానము క్రింది పట్టికలో విశదీకరింపబడినది. గమనింపుము.

| హల్లు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| B | 1 | బ్ | Baby=బేబీ=పాప<br>Body=బాడీ=శరీరము |
| C | 6 | స్ | City=సిటీ=నగరము<br>Century=సెంచరీ=శతాబ్దము |
| | | క్ | Cat=క్యాట్=పిల్లి<br>Cot=కాట్=మంచము<br>Cook=కుక్=వంటచేయుట |
| | | చ్ | Chair=చేర్=కుర్చీ<br>Chain=చైన్=గొలుసు<br>Catch=క్యాచ్=పట్టుకొనుట |
| | | క్ | Christ=క్రైస్ట్=క్రీస్తు<br>Chord=కార్డ్=త్రాడు |
| | | ష్ | Chaise=షెయ్‌స్=రెండు చక్రాల గుఱ్ఱపు బండి<br>Chivalry=షివల్రీ=పరాక్రమము |

| హల్లు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| D | 1 | డ్ | Day=డే=దినము<br>Dog=డాగ్=కుక్క<br>Door=డోర్=తలుపు |
| F | 1 | ఎఫ్ | Fish=ఫిష్=చేప<br>Finger=ఫింగర్=వ్రేలు (ఈ అక్షరమును పూత్కారముచేయు నప్పుడు నోటితో ఊపిరి వదలు విధముగా పలుకవలయును) |
| G | 2 | గ్ | Go=గో=పోవుట<br>God=గాడ్=దేవుడు<br>Game=గేమ్=ఆట |
| | | జ్ | Gentle=జెంటిల్=నెమ్మది<br>Ginger=జింజర్=అల్లము<br>Gender=జెండర్=లింగము. (a, o, u అను అక్షరములకు G ముందు వచ్చినప్పుడు 'గ్' అను ధ్వని పలుకును. e, y, i అను అక్షరములకు ముందు ఉండిన 'జ్' అను ధ్వనినిచ్చును). |

| హల్లు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| H | 1 | హ్ | Heap=హీప్=రాశి<br>House=హౌస్=ఇల్లు |
| J | 1 | జ్ | Just=జస్ట్=న్యాయమైన<br>Jasmine=జాస్‌మిన్=మల్లె పువ్వు |
| K | 1 | క్ | Kitten=కిటన్=పిల్లికూన<br>King=కింగ్=రాజు |
| L | 1 | ల్ | Lane=లేన్=చిన్న సందు<br>Leg=లెగ్=కాలు |
| M | 1 | మ్ | Milk=మిల్క్=పాలు<br>Map=మ్యాప్=దేశపటము<br>Mouth=మౌత్=నోరు |
| N | 1 | న్ | Name=నేమ్=పేరు<br>Net=నెట్=వల |
| P | 1 | ప్ | Pocket=పాకెట్=జేబు<br>Packet=ప్యాకెట్=కట్ట |
| Q | 1 | క్వ | Queen=క్వీన్=రాణి<br>Quick=క్విక్=తొందరగ |

| హల్లు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| R | 1 | ర్ | Bray=బ్రే=ఓండ్రపెట్టుట<br>Ring=రింగ్=ఉంగరము |
| S | 2 | స్ | Sing=సింగ్=పాటపాడుట<br>Son=సన్=కుమారుడు |
| | | ష్ | Ship=షిప్=ఓడ<br>Show=షో=చూపుట<br>(H తో కలసి వచ్చినప్పుడు మాత్రము 'ష్' ధ్వని పలుకును) |
| T | 2 | ట్ | Tree=ట్రీ=చెట్టు<br>Time=టైమ్=కాలము |
| | | ద్ | This=దిస్=ఇది<br>Then=దెన్=అప్పుడు<br>(H తో కలసి వచ్చినపుడు 'ద' కారము పలుకును) |
| V | 1 | వ్ | Vain=వెయిన్=వ్యర్థమైన<br>Van=వ్యాన్=తొట్టి |
| W | 1 | వ్ | Wake=వేక్=నిద్రలేచుట<br>Wall=వాల్=గోడ |

| హల్లు | ధ్వనుల సంఖ్య | ధ్వని | ఉదాహరణములు |
|---|---|---|---|
| X | 2 | క్స్ | Wax=వ్యాక్స్=మైనము |
| | | | Next=నెక్స్ట్=తరువాతి |
| | | జ్ | Xebec=జిబెక్=పడవ (పదములకు మొదట x వచ్చిన 'జ్' అను శబ్దము పలుకును) |
| Y | 2 | య్ | Yarn=యార్న్=నూలు |
| | | ఇ | Mercy=మెర్సీ=దయ |
| Z | 1 | జ్ | Zoo=జూ=జంతుప్రదర్శనశాల |
| | | | Zebra=జీబ్రా=అడవిగాడిద |



# 5. Peculiar Pronunciations

(పెక్యూలియర్ ప్రొనన్సియేషన్స్)

విచిత్రమైన ఉచ్చారణలు

ఇంగ్లీషు భాషయందు ఏ యే అక్షరములు ఎట్టి ధ్వనిని కలిగించునది స్థూలముగ తెలిసికొంటివి. కాని ఇంగ్లీషుభాషలో ఈ అక్షరము ఇట్టి ధ్వని ఇచ్చును అను నియమము ఏర్పాటు చేయుటకు లేదు. కొన్ని అక్షరముల కలయిక ప్రత్యేక సందర్భముల యందు, విచిత్రమయిన ఉచ్చారణలు కలిగించును. ఈ క్రింది వానిని గమనింపుము.

1. Through = త్రు = గుండా (ద్వారా)
2. Rough = రఫ్ = గఱుకైన
3. Plough = ప్లౌ = దున్ను

ఈ పదములలో ough ఒక్కొక్క పదములో ఒక్కొక్క విధముగ పలుకుటను గమనింపుము.

ఈ క్రింది పదములలో 'tion' 'షన్' అను ధ్వనిని అనగా 'sion' వంటి శబ్దమును ఇచ్చుటను గమనింపుము.

1. Station = స్టేషన్ = స్టేషను
2. Examination = ఎగ్జామినేషన్ = పరీక్ష
3. Admission = అడ్మిషన్ = ప్రవేశము
4. Cultivation = కల్టివేషన్ = సేద్యము

క్రింది ఉదాహరణములలో 'd' 'జ' కార ధ్వని నిచ్చును.

1. Education = ఎజుకేషన్ = విద్య
2. Soldiers = సోల్జర్స్ = సైనికులు

## 6. Silent Letters (సైలెంట్ లెటర్స్)

### ఉచ్చారణ లేని అక్షరములు

ఏ యే అక్షరము ఏ ధ్వనిని ఇచ్చునది తెలిసికొంటివి. కాని కొన్ని పదములందు కొన్ని అక్షరములు, ధ్వనిని కలిగించక ఉండును. అట్టి అక్షరములకు Silent Letters అనిపేరు.

ఏ అక్షరములు ఏ పదములందు ధ్వనిని కలిగించవో ఈ క్రింది పట్టికనుండి గ్రహింపుము.

(1) **B** లోపించిన పదములు

1. Debt=డెట్=అప్పు
2. Debtor=డెటర్=అప్పుదారుడు
3. Doubt=డౌట్=సందేహము

(2) C లోపించిన పదము

Scent=సెంట్=వాసన

(3) E లోపించిన పదములు

1. Name=నేమ్=పేరు
2. Fame=ఫేమ్=కీర్తి
3. Game=గేమ్=ఆట
4. Caste=క్యాస్ట్=కులము

5. Foe = ఫో = విరోధి
6. Argue = ఆర్గ్యు = వాదించుట
7. Mine = మైన్ = గని
8. Grape = గ్రేప్ = ద్రాక్ష

(4) G లోపించిన పదములు

1. Thought = థాట్ = ఆలోచన
2. Fight = ఫైట్ = పోరాటము
3. Eight = ఎయిట్ = ఎనిమిది
4. Reign = రెయిన్ = పరిపాలించుట
5. Daughter = డాటర్ = కుమార్తె

(5) H పలుకని పదములు

1. Heir = ఏర్ = వారసుడు
2. Hour = అవర్ = గంట
3. Honesty = ఆనెస్టీ = విశ్వాసము ; నమ్మకము
4. Honour = ఆనర్ = మర్యాద

(6) K లోపించిన పదములు

1. Know = నో = తెలిసికొనుట
2. Knife = నైఫ్ = చాకు
3. Knowledge = నాలెడ్జ్ = తెలివి

## (7) L లోపించిన పదములు

1. Walk=వాక్=నడచుట
2. Talk=టాక్=మాటలాడుట
3. Folk=ఫోక్=సామాన్యజనులు
4. Palm=పామ్=అరచేయి
5. Half=హాఫ్=అర్ధము
6. Calf=కాఫ్=ఆవుదూడ
7. Could=కుడ్=శక్తి కలిగెను
8. Would=వుడ్=వలయును
9. Should=షుడ్=వలెను
10. Calm=కామ్=నెమ్మదైన
11. Chalk=ఛాక్=సీమసున్నము

## (8) N లోపించిన పదములు

1. Hymn=హిమ్=మంత్రము
2. Column=కాలమ్=వరుస

## (9) P లోపించిన పదములు

1. Psalm=సామ్=పద్యపు కథ
2. Psychology=సైకాలజీ=మానసికశాస్త్రము

## (10) R లోపించిన పదములు

1. Warm=వామ్=వెచ్చనైన
2. Harm=హామ్=కీడు

### (11) S లోపించిన పదములు

1. Isle=ఐల్=ద్వీపము
2. Island=ఐలాండ్=ద్వీపము

### (12) T లోపించిన పదములు

1. Catch=క్యాచ్=పట్టుకొనుట
2. Watch=వాచ్=గడియారము
3. Fetch=ఫెచ్=తీసికొనివచ్చుట
4. Hatch=హ్యాచ్=పొదుగుట
5. Listen=లిసెన్=వినుట
6. Castle=క్యాజిల్=కోట

### (13) U లోపించిన పదములు

1. Tongue=టంగ్=నాలుక
2. Catalogue=క్యాటలాగ్=ధరల పట్టీ
3. Rogue=రోగ్=దుర్మార్గుడు

### (14) W లోపించిన పదములు

1. Wrong=రాంగ్=తప్పు
2. Wrap=ర్యాప్=మడచుట
3. Write=రైట్=వ్రాయుట



# 7. Words of Common usage

(వర్డ్స్ ఆఫ్ కామన్ యూసేజ్)

సాధారణముగ ఉపయోగపడు పదములు

ఈ క్రింద రెండక్షరముల పదములు, మూడక్షరములు గల పదములు, నాలుగు అక్షరములు కలవి విడివిడిగా ఇవ్వబడినవి. వానిని నేర్చుకొనుము.

## (1) Words of two Letters (వర్డ్స్ ఆఫ్ టు లెటర్స్)

### రెండక్షరముల మాటలు

Am = ఎ. యం = యామ్ = ఉన్నాను

An = ఎ, యన్ = యాన్ = ఒక

As = ఎ, యస్ = యాజ్ = వలె

At = ఎ. టి = యట్ = వైపు

Be = బి, ఇ = బి = ఉండుట

Do = డి, ఒ = డు = చేయుట

Go = జి, ఒ = గో = పోవుట

He = హెచ్, ఇ = హి = అతడు, వాడు

If = ఐ, యఫ్ = ఇఫ్ = అయితే

In = ఐ, యన్ = ఇన్ = లో, లోపల

Is = ఐ, యస్ = ఈజ్ = ఉన్నది

It = ఐ, టి = ఇట్ = ఇది, అది

Me = యం, ఇ = మి = నన్ను

My=యం, వై=మై=నాయొక్క
No=యన్, ఒ=నో=లేదు, కాదు
On=ఓ, యన్=ఆన్=పైన
Or=ఓ, ఆర్=ఆర్=లేక
Ox=ఓ, యక్స్=ఆక్స్=ఎద్దు
So=యస్, ఒ=సొ=అట్లు
To=టి, ఒ=టు=కి, కు
Us=యు, యస్=అజ్=మమ్ములను
Up=యు, పి=అప్=పైకి, మీదకు
We=డబ్ల్యు, ఇ=వుయ్=మనము, మేము

## (2) Words of three Letters (వర్డ్స్ ఆఫ్ త్రీ లెటర్స్)

### మూడక్షరముల పదములు

Ant=ఎ, యన్, టి=యాంట్=చీమ
Ass=ఎ, యస్, యస్=యాస్=గాడిద
Ape=ఎ, పి, ఇ=ఏప్=కోతి
Bag=బి, ఎ, జి=బ్యాగ్=సంచి
Bat=బి, ఎ, టి=బ్యాట్=బ్యాటు
Bed=బి, ఇ, డి=బెడ్=పరుపు
Box=బి, ఒ, యక్స్=బాక్స్=పెట్టె
Boy=బి, ఒ, వై=బాయ్=బాలుడు

Cap=సి, ఎ, పి=క్యాప్=టోపి
Car=సి, ఎ, ఆర్=కార్=రథము
Cat=సి, ఎ, టి=క్యాట్=పిల్లి
Day=డి, ఎ, వై=డే=దినము
Dog=డి, ఒ, జి=డాగ్=కుక్క
Dig=డి, ఐ, జి=డిగ్=త్రవ్వుట
Dim=డి, ఐ, యం=డిమ్=మొబ్బు
Eat=ఈ, ఎ, టి=ఈట్=తినుట
Egg=ఈ, జి, జి=ఎగ్గ్=కోడిగ్రుడ్డు
Fan=యఫ్, ఎ, యన్=ఫ్యాన్=విసనకఱ్ఱ
Far=యఫ్, ఎ, ఆర్=ఫార్=దూరము
Fat=యఫ్, ఎ, టి=ఫ్యాట్=బలసిన
For=యఫ్, ఒ. ఆర్=ఫార్=కొరకు
God=జి, ఒ, డి=గాడ్=దేవుడు
Hat=హెచ్, ఎ, టి=హ్యాట్=దొరటోపి
Hog=హెచ్, ఒ, జి=హాగ్=పంది
Ink=ఐ, యన్, కె=ఇంక్=సిరా
Inn=ఐ, యన్, యన్=ఇన్=సత్రము
Jar=జె, ఎ, ఆర్=జార్=కూజా
Kid=కె, ఐ, డి=కిడ్=మేకపిల్ల
Log=యల్, ఒ, జి=లాగ్=దూలము, మొద్దు
Man=యమ్, ఎ, యన్=మ్యాన్=మనుష్యుడు

Mat=యమ్, ఎ. టి=మ్యాట్=చాప
Nib=యన్, ఐ, బి=నిబ్=కలముపాళి
Not=యన్, ఒ. టి=నాట్=కాదు
Pot=పి, ఒ, టి=పాట్=కుండ
Pen=పి, ఇ, యన్=పెన్=కలము
Rat=ఆర్, ఎ, టి=ర్యాట్=ఎలుక
Sin=యస్, ఐ, యన్=సిన్=పాపము
Son=యస్, ఒ, యన్=సన్=కుమారుడు
Sun=యస్, యు, యన్=సన్=సూర్యుడు
Top=టి, ఒ, పి=టాప్=బొంగరము
Vat=వి, ఎ, టి=వ్యాట్=తొట్టి
Van=వి, ఎ, యన్=వ్యాన్=మోటారు

## (3) Words of four Letters (వర్డ్స్ ఆఫ్ ఫోర్ లెటర్స్)

### నాలుగక్షరముల పదములు

Anna=ఎ, యన్, యన్, ఏ=అణా=అణా
Ball=బి, ఎ, యల్, యల్=బాల్=బంతి
Wall=డబ్ల్యు, ఎ, యల్, యల్=వాల్=గోడ
Hall=హెచ్, ఎ, యల్, యల్=హాల్=పెద్దగది
Bell=బి, ఇ, యల్. యల్=బెల్=గంట
Well=డబ్ల్యు, ఇ, యల్, యల్=వెల్=బావి

Hill = హెచ్, ఐ, యల్, యల్ = హిల్ = కొండ
Kill = కె, ఐ, యల్, యల్ = కిల్ = చంపుట
Book = బి, ఒ, ఒ, కె = బుక్ = పుస్తకము
Cook = సి, ఒ, ఒ, కె = కుక్ = వంటచేయువాడు
Moon = యమ్, ఒ, ఒ, యన్ = మూన్ = చంద్రుడు
Noon = యన్, ఒ, ఒ, యన్ = నూన్ = మధ్యాహ్నము
Roof = ఆర్, ఒ, ఒ, యఫ్ = రూఫ్ = ఇంటికప్పు
Door = డి, ఒ, ఒ, ఆర్ = డోర్ = తలుపు
Song = యస్, ఒ, యన్, జి = సాంగ్ = పాట
Horn = హెచ్, ఒ, ఆర్, యన్ = హార్న్ = కొమ్ము
Hole = హెచ్, ఒ, యల్, ఇ = హోల్ = రంధ్రము
Hare = హెచ్, ఎ, ఆర్, ఇ = హేర్ = కుందేలు
Hair = హెచ్, ఎ, ఐ, ఆర్ = హైర్ = వెంట్రుకలు
Nail = యన్, ఎ, ఐ, యల్ = నెయ్‌ల్ = మేకు
Tail = టి, ఎ, ఐ, యల్ = టెయిల్ = తోక
Rain = ఆర్, ఎ, ఐ, యన్ = రెయిన్ = వాన
Boat = బి, ఒ, ఎ, టి = బోట్ = పడవ
Coat = సి, ఒ, ఎ, టి = కోట్ = కోటు
Goat = జి, ఒ, ఎ, టి = గోట్ = గొఱ్ఱె
Soap = యస్, ఒ, ఎ, పి = సోప్ = సబ్బు

Rose=ఆర్, ఒ, యస్, ఇ=రోజ్=రోజాపువ్వు

Rope=ఆర్, ఒ, పి, ఇ=రోప్=త్రాడు

Rice=ఆర్, ఐ, సి, ఇ=రైస్=బియ్యము

Kite=కె, ఐ, టి, ఇ=కైట్=గాలిపడగ

Meal=యమ్, ఇ, ఎ, యల్=మీల్=భోజనము

Meat=యమ్, ఇ, ఎ, టి=మీట్=మాంసము

Heat=హెచ్, ఇ, ఎ, టి=హీట్=వేడిమి

King=కె, ఐ, యన్, జి=కింగ్=రాజు

Ring=ఆర్, ఐ, యన్, జి=రింగ్=ఉంగరము

Sing=యస్, ఐ, యన్, జి=సింగ్=పాట పాడుట

Week=డబ్ల్యు, ఇ, ఇ, కె=వీక్=వారము

## (4) Small Numbers (స్మాల్ నంబర్స్)

## చిన్న చిన్న అంకెలు

One=ఒ, యన్, ఇ=వన్=ఒకటి=1

Two=టి, డబ్ల్యు, ఒ=టు=రెండు=2

Three=టి, హెచ్, ఆర్, ఇ, ఇ=త్రీ=మూడు=3

Four=యఫ్, ఒ, యు, ఆర్=ఫోర్=నాలుగు=4

Five=యఫ్, ఐ, వి, ఇ=ఫైవ్=ఐదు=5

Six=యస్, ఐ, యక్స్=సిక్స్=ఆరు=6.

Seven = యస్. ఇ. వి. ఇ. యన్ = సెవన్ = ఏడు = 7
Eight = ఇ. ఐ. జి. హెచ్. టి = ఎయిట్ = ఎనిమిది = 8
Nine = యన్. ఐ. యన్. ఇ = నైన్ = తొమ్మిది = 9
Ten = టి. ఇ. యన్ = టెన్ = పది = 10

(5) Days of the week (డేస్ ఆఫ్ ది వీక్)

## వారముల పేర్లు

Sunday = యస్, యు, యన్, డి, ఎ, వై = సన్‌డే = ఆదివారము

Monday = యం, ఒ, యన్, డి, ఎ, వై = మన్‌డే = సోమవారము

Tuesday = టి, యు, ఇ, యస్, డి, ఎ, వై = ట్యూస్‌డే = మంగళవారము

Wednesday = డబ్ల్యు, ఇ, డి, యన్, ఇ, ఎస్, డి, ఎ, వై = వెడ్‌నస్‌డే = బుధవారము

Thursday = టి, హెచ్, యు, ఆర్, యస్, డి, ఎ, వై = థర్స్‌డే = గురువారము

Friday = యఫ్, ఆర్, ఐ, డి, ఎ, వై = ఫ్రైడే = శుక్రవారము

Saturday = యస్, ఎ, టి, యు, ఆర్, డి, ఎ, వై = శాటర్‌డే = శనివారము



# 8. Combination of Words
(కాంబినేషన్ ఆఫ్ వర్డ్స్)
పదముల కలయిక

## Articles : ఆర్టికల్స్‌తో కలయిక

ఇంగ్లీషు భాషలో a, an, the అను ఈ మూడు పదములకు Articles అని పేరు. వీని ఉపయోగము నిప్పుడు తెలిసికొందము.

క్రొత్తమాటలు :

A = ఎ = ఒక

An = ఎ, యన్ = యాన్ = ఒక

The = టి, హెచ్. ఇ = ది = ఆ

A man = ఎ, యమ్, ఎ, యన్ = ఏ మ్యాన్ = ఒక మనుష్యుడు
A song = ఎ, యస్, ఒ, యన్, జి = ఎ సాంగ్ = ఒక పాట
A mango = ఎ, యం, ఎ, యన్, జి, ఒ = ఎ మ్యాంగో = ఒక మామిడి పండు
A lock = ఎ, యల్, ఒ, సి, కె = ఎ లాక్ = ఒక బీగము
A hen = ఎ, హెచ్, ఇ, యన్ = ఎ హెన్ = ఒక కోడిపెట్ట
A cock = ఎ, సి, ఒ, సి, కె = ఎ కాక్ = ఒక కోడిపుంజు
A girl = ఎ, జి, ఐ, ఆర్, యల్ = ఎ గర్ల్ = ఒక బాలిక
A door = ఎ, డి, ఒ, ఒ, ఆర్ = ఎ డోర్ = ఒక తలుపు

A pencil = ఎ, పి, ఇ, యన్, సి, ఐ, యల్ = ఎ పెన్సిల్ = ఒక పెనసలు

A cot = ఎ, సి, ఒ, టి = ఎ కాట్ = ఒక మంచెము

An ant = ఎ, యన్, ఎ, యన్, టి = యాన్ యాంట్ = ఒకచీమ

An egg = ఎ, యన్, ఇ, జి, జి = యాన్ ఎగ్ = ఒక కోడి గ్రుడ్డు

An eye = ఏ, యన్, ఇ, వై, ఇ = యాన్ ఐ = ఒక కన్ను

An inn = ఏ, యన్, ఐ, యన్, యన్ = యాన్ ఇన్ = ఒక సత్రము

An owl = ఏ, యన్, ఒ, డబ్ల్యు, యల్ = యాన్ ఔల్ = ఒక గ్రుడ్లగూబ

An umbrella = ఏ, యన్, యు, యం, బి, ఆర్, ఇ, యల్, యల్, ఎ = యాన్ అంబ్రల్లా = ఒక గొడుగు

సూచన:—(1) a, e, i, o, u / ఎ, ఇ, ఐ, ఒ, యు — ఈ అక్షరములు మొదటగల పదములకు An చేర్చిన ఒక అను అర్థము వచ్చును.

(2) మిగత అక్షరములు మొదటగల పదములకు A చేర్చిన ఒక అను అర్థము వచ్చును.

(3) The యొక్క ఉపయోగము రాబోవు పాఠములలో విశదముగ నేర్చుకొందము.

సూచన I:—ఇంగ్లీషుభాషయందలి అక్షరములు సాధారణముగ ఇచ్చు శబ్దములను గుఱించి తెలిసికొంటివి. ఈ క్రింది సంగ్రహ గుణింతమును గమనించుము. దీని సహాయమున, తెలుఁగు పదములను, పేర్లను ఇంగ్లీషులోని కిని, ఇంగ్లీషులోని క్రొత్తపదములను సులభముగ పలుకుటకును నేర్చుకొనగలవు.

# 9. Spelling (స్పెల్లింగ్) సంగ్రహ గుణింతము

| | అ,ఆ<br>a | ఇ<br>i | ఈ<br>ee | ఉ<br>u | ఊ<br>oo | ఎ,ఏ<br>e | ఐ<br>ai | ఒ,ఓ<br>o | ఔ<br>au | అం<br>am | అః<br>ah | విశేషము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్<br>K | క,కా<br>ka | కి<br>ki | కీ<br>kee | కు<br>ku | కూ<br>koo | కె,కే<br>ke | కై<br>kai | కొ,కో<br>ko | కౌ<br>kau | కం<br>kam | కః<br>kah | |
| గ్<br>G | గ,గా<br>ga | గి<br>gi | గీ<br>gee | గు<br>gu | గూ<br>goo | గె,గే<br>ge | గై<br>gai | గొ,గో<br>go | గౌ<br>gau | గం<br>gam | గః<br>gah | |
| చ్<br>Ch | చ,చా<br>cha | చి<br>chi | చీ<br>chee | చు<br>chu | చూ<br>choo | చె,చే<br>che | చై<br>chai | చొ,చో<br>cho | చౌ<br>chau | చం<br>cham | చః<br>chah | |
| జ్<br>J | జ,జా<br>ja | జి<br>ji | జీ<br>jee | జు<br>ju | జూ<br>joo | జె,జే<br>je | జై<br>jai | జొ,జో<br>jo | జౌ<br>jau | జం<br>jam | జః<br>jah | |
| ట్<br>T | ట,టా<br>ta | టి<br>ti | టీ<br>tee | టు<br>tu | టూ<br>too | టె,టే<br>te | టై<br>tai | టొ,టో<br>to | టౌ<br>tau | టం<br>tam | టః<br>tah | ఈ అక్షరములే త,థా లనుకూడ పలుకును. |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| డ్ | డ,డా | డి | డీ | డు | డూ | డె,డే | డై | డొ,డో | డౌ | డం | డః | ద, దా లకు కూడ ఇదే గుణింతము. |
| D | da | di | dee | du | doo | de | dai | do | dau | dam | dah | |
| న్ | న,నా | ని | నీ | ను | నూ | నె,నే | నై | నొ,నో | నౌ | నం | నః | ఇదే గుణింతము ణ,ణా లకు కూడ వర్తించును. |
| N | na | ni | nee | nu | noo | ne | nai | no | nau | nam | nah | |
| ప్ | ప,పా | పి | పీ | పు | పూ | పె,పే | పై | పొ,పో | పౌ | పం | పః | |
| P | pa | pi | pee | pu | poo | pe | pai | po | pau | pam | pah | |
| బ్ | బ,బా | బి | బీ | బు | బూ | బె,బే | బై | బొ,బో | బౌ | బం | బః | |
| B | ba | bi | bee | bu | boo | be | bai | bo | bau | bam | bah | |
| మ్ | మ,మా | మి | మీ | ము | మూ | మె,మే | మై | మొ,మో | మౌ | మం | మః | |
| M | ma | mi | mee | mu | moo | me | mai | mo | mau | mam | mah | |
| య్ | య,యా | యి | యీ | యు | యూ | యె,యే | యై | యొ,యో | యౌ | యం | యః | |
| Y | ya | yi | yee | yu | yoo | ye | yai | yo | yau | yam | yah | |
| ర్ | ర,రా | రి | రీ | రు | రూ | రె,రే | రై | రొ,రో | రౌ | రం | రః | |
| R | ra | ri | ree | ru | roo | re | rai | ro | rau | ram | rah | |
| ల్ | ల,లా | లి | లీ | లు | లూ | లె,లే | లై | లొ,లో | లౌ | లం | లః | |
| L | la | li | lee | lu | loo | le | lai | lo | lau | lam | lah | |

| | అ,ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఎ,ఏ | ఐ | ఒ,ఓ | ఔ | అం | అః | విశేషము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | a | i | ee | u | oo | e | ai | o | au | am | ah | |
| వ్ | వ,వా | వి | వీ | వు | వూ | వె,వే | వై | వొ,వో | వౌ | వం | వః | |
| V | va | vi | vee | vu | voo | ve | vai | vo | vau | vam | vah | |
| ష్ | ష,షా | షి | షీ | షు | షూ | షె,షే | షై | షొ,షో | షౌ | షం | షః | |
| Sh | sha | shi | shee | shu | shoo | she | shai | sho | shau | sham | shah | |
| స్ | స,సా | సి | సీ | సు | సూ | సె,సే | సై | సొ,సో | సౌ | సం | సః | |
| S | sa | si | see | su | soo | se | sai | so | sau | sam | sah | |
| హ్ | హ,హా | హి | హీ | హు | హూ | హె,హే | హై | హొ,హో | హౌ | హం | హః | |
| H | ha | hi | hee | hu | hoo | he | hai | ho | hau | ham | hah | |
| క్ష్ | క్ష,క్షా | క్షి | క్షీ | క్షు | క్షూ | క్షె,క్షే | క్షై | క్షొ,క్షో | క్షౌ | క్షం | క్షః | |
| Ksh | ksha | kshi | kshee | kshu | kshoo | kshe | kshai | ksho | kshau | ksham | kshah | |

సూచన 2 :—ద్విత్వాక్షరములను వ్రాయుటకు అదే హల్లును రెండుమారులు వ్రాయవలయును.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్క్ | క్క,క్కా | క్కి | క్కీ | క్కు | క్కూ | క్కె,క్కే | క్కై | క్కొ,క్కో | క్కౌ | క్కం | క్కః |
| Kk | kka | kki | kkee | kku | kkoo | kke | kkai | kko | kkau | kkam | kkah |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ట్ట | ట్ట,ట్టా | ట్టి | ట్టీ | ట్టు | ట్టూ | ట్టె,ట్టే | ట్టై | ట్టొ,ట్టో | ట్టౌ | ట్టం | ట్టః |
| Tt | tta | tti | ttee | ttu | ttoo | tte | ttai | tto | ttau | ttam | ttah |
| న్న | న్న,న్నా | న్ని | న్నీ | న్ను | న్నూ | న్నె,న్నే | న్నై | న్నొ,న్నో | న్నౌ | న్నం | న్నః |
| Nn | nna | nni | nnee | nnu | nnoo | nne | nnai | nno | nnau | nnam | nnah |
| ప్ప | ప్ప,ప్పా | ప్పి | ప్పీ | ప్పు | ప్పూ | ప్పె,ప్పే | ప్పై | ప్పొ,ప్పో | ప్పౌ | ప్పం | ప్పః |
| Pp | ppa | ppi | ppee | ppu | ppoo | ppe | ppai | ppo | ppau | ppam | ppah |
| ఱ్ఱ | ఱ్ఱ,ఱ్ఱా | ఱ్ఱి | ఱ్ఱీ | ఱ్ఱు | ఱ్ఱూ | ఱ్ఱె | ఱ్ఱై | ఱ్ఱొ,ఱ్ఱో | ఱ్ఱౌ | ఱ్ఱం | ఱ్ఱః |
| Rr | rra | rri | rree | rru | rroo | rre | rrai | rro | rrau | rram | rrah |
| ల్ల | ల్ల,ల్లా | ల్లి | ల్లీ | ల్లు | ల్లూ | ల్లె | ల్లై | ల్లొ,ల్లో | ల్లౌ | ల్లం | ల్లః |
| Ll | lla | lli | llee | llu | lloo | lle | llai | llo | llau | llam | llah |
| వ్వ | వ్వ,వ్వా | వ్వి | వ్వీ | వ్వు | వ్వూ | వ్వె | వ్వై | వ్వొ,వ్వో | వ్వౌ | వ్వం | వ్వః |
| Vv | vva | vvi | vvee | vvu | vvoo | vve | vvai | vvo | vvau | vvam | vvah |
| స్స | స్స,స్సా | స్సి | స్సీ | స్సు | స్సూ | స్సె | స్సై | స్సొ,స్సో | స్సౌ | స్సం | స్సః |
| Ss | ssa | ssi | ssee | ssu | ssoo | sse | ssai | sso | ssau | ssam | ssah |

ఇదే విధముగ మిగిలిన ద్విత్వాక్షరములను గ్రహించవలయును.

## సంయుక్తాక్షరములు.

సంయుక్తాక్షరములు అనగా ఒత్తు అక్షరములు లేక రెండు మూడు హల్లులు కలసిన అక్షరములు. ఇట్టి సందర్భములలో ఆ రెండు హల్లులను వ్రాసి, తరువాత 'అచ్చునకు' తగిన అక్షరములను చేర్చి వ్రాయవలయును. ఈ క్రింది వానిని గమనించి మిగిలిన వానిని గ్రహించుము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| క్ర క్రా | Kra | గ్ల గ్లా | Gla | ర్వ ర్వా | Rva | ట్మ ట్మా | Tma |
| క్రి | Kri | గ్లి | Gli | ర్వి | Rvi | ట్మి | Tmi |
| క్రీ | Kree | గ్లీ | Glee | ర్వీ | Rvee | ట్మీ | Tmee |
| క్రు | Kru | గ్లు | Glu | ర్వు | Rvu | ట్ము | Tmu |
| క్రూ | Kroo | గ్లూ | Gloo | ర్వూ | Rvoo | ట్మూ | Tmoo |
| క్రె క్రే | Kre | గ్లె గ్లే | Gle | ర్వె ర్వే | Rve | ట్మె ట్మే | Tme |
| క్రై | Krai | గ్లై | Glai | ర్వై | Rvai | ట్మై | Tmai |
| క్రొ క్రో | Kro | గ్లొ గ్లో | Glo | ర్వొ ర్వో | Rvo | ట్మొ ట్మో | Tmo |
| క్రౌ | Krau | గ్లౌ | Glau | ర్వౌ | Rvau | ట్మౌ | Tmau |
| క్రం | Kram | గ్లం | Glam | ర్వం | Rvam | ట్మం | Tmam |
| క్రః | Krah | గ్లః | Glah | ర్వః | Rvah | ట్మః | Tmah |

## పొల్లు గల అక్షరములు.

తెలుఁగులోను, సంస్కృతములోను ఠ, ఢ, ఫ, భ మొదలగు పొల్లు, లేక పొక్కిలి గల అక్షరములున్నవి. వీనిని వ్రాయ వలసిన పద్ధతిని గమనింపుము.

| ఛ | ఝ | ఠ | ఢ | థ | ధ | ఫ | భ |
|---|---|---|---|---|---|---|---|
| Cha | Jha | Tha | Dha | Tha | Dha | Pha | Bha. |

వీనికి గుణింతమును ఇది వఱకు చూపిన విధముగ వ్రాసికొనవలయును.

## పేర్లను వ్రాయుట.

క్రింద వ్రాయఁబడిన పేర్లను గమనింపుము.

1. Sa tya na ra ya na
   స త్య నా రా య ణ

   Satyanarayana
   సత్యనారాయణ

2. Ba la sa ra swa thi
   బా ల స ర స్వ తి

   Balasaraswathi
   బాలసరస్వతి

3. Vi zia na ga ram
   వి జయ న గ రం

   Vizianagaram
   విజయనగరం

4. Ra ma chan dra Rau
   రా మ చం ద్ర రావు

   Rama chandra Rau
   రామ చంద్ర రావు

5. Bha va bhoo ti
భ వ భూ తి

Bhavabhooti
భవభూతి

6. Hy da ra bad
హై ద రా బాద్

Hydarabad
హైదరాబాద్

7. Sree sai lam
శ్రీ శై లం

Sreesailam
శ్రీశైలం

8. Sri kan taha Sas try
శ్రీ కం ఠ శా స్త్రి

Sri kantaha Sastry
శ్రీ కంఠ శాస్త్రి

9. Da sa ra
ద స ర

Dasara
దసర

10. Dee pa va li
దీ పా వ ళి

Deepavali
దీపావళి



## 10. Phrases (ఫ్రేసెస్)

## సంగ్రహా వాక్యములు

రెండు లేదా అంతకంటె ఎక్కువ పదముల కలయికకు Phrase (ఫ్రేస్) అని పేరు. దీని అర్థము అందులో నుండు పదముల అర్థం కంటె వేరుగా నుండును. వానిని ఉపయోగించు విధానము క్రింది ఉదాహరణములను గమనించిన తెలిసికొన నగును.

1. ఎబొవ్ ఆల్ Above all = అన్నిటికంటె ముఖ్యముగ.

కృష్ణదేవరాయ వాస్ ఎ గ్రేట్ రూలర్,
Krishnadevaraya was a great ruler,
వారియర్ అండ్ ఎబొవ్ ఆల్ ఎ గ్రేట్ పొయెట్.
warrior and above all a great poet.

కృష్ణదేవరాయలు గొప్ప పాలకుఁడు, వీరుడు మరియు అన్నిటికంటె ముఖ్యముగ గొప్ప కవియునై యుండెను.

2. ఎకార్డింగ్ టు According to = అనుసరించి.

మై ఫ్రెండ్ హెల్ప్‌డ్ మి ఇన్ టైమ్
My friend helped me in time
ఎకార్డింగ్ టు హిస్ ప్రామిస్.
according to his promise.

నా స్నేహితుఁడు తన వాగ్దానము ననుసరించి నాకు సకాలములో సహాయము చేసెను.

3. ఆఫ్టర్ ఆల్ After all=చివరకు.

ది హార్స్ రాన్ ది రేస్ వెల్ బట్ ఆఫ్టర్
The horse ran the race well but after
ఆల్ ఇట్ కుడ్ నాట్ విన్.
all it could not win.

ఆ గుఱ్ఱము పందెములో బాగుగనే పరుగెత్తెను కాని చివరకు పందెము గెలువలేదు.

4. ఆల్ ఇన్ ఆల్ All in all=సర్వాధికారము కలిగి యుండుట.

ది కలెక్టర్ ఇస్ రియలీ ఆల్ ఇన్ ఆల్ ఇన్
The Collector is really all in all in
ది డిస్ట్రిక్ట్.
the District.

జిల్లాయందు కలెక్టరు నిజముగా సర్వాధికారమును కలిగి యుండును.

5. ఆస్ ఇఫ్ As if=అట్లుగా.

ది బిగ్ ట్రీ ఆన్ ది రోడ్‌సైడ్ లుక్డ్
The big tree on the roadside looked
ఆస్ ఇఫ్ ఇట్ వెర్ ఎ డెవిల్ ఇన్ డార్క్‌నెస్.
as if it were a devil in darkness.

దారిప్రక్కనుండు పెద్ద చెట్టు చీకటిలో భూతమయి నట్లుగా అగుపించెను.

6. ఆస్ సూన్ ఆస్ As soon as = వెంటనే.

ఐ విల్ షో మై సర్టిఫికెట్ టు మై
I will show my certificate to my
ఫాదర్ ఆస్ సూన్ ఆస్ ఐ గో హోమ్
father as soon as I go home.

నేను ఇంటికి పోయిన వెంటనే మా తండ్రికి నా సర్టిఫికేటును చూపింతును.

7. ఎట్ ఏ స్ట్రెచ్ At a stretch = విడువకుండ.

ది బాయ్ రెడ్ ది స్టోరీ-బుక్ ఫార్ టు
The boy read the story-book for two
అవర్స్ ఎట్ ఏ స్ట్రెచ్
hours at a stretch.

ఆ బాలుడు కథల పుస్తకమును విడువకుండ రెండు గంటలు చదివెను.

8. అట్ ఫస్ట్ సైటు At first sight = తొలిచూపులోనే.

దుష్యంత ఫెల్ ఇన్ లవ్ విత్ శకుంతల
Dushyanta fell in love with Sakuntala
అట్ ఫస్ట్ సైట్
at first sight.

తొలిచూపులోనే దుష్యంతుడు శకుంతలను ప్రేమించెను.

9. అట్ లాస్ట్ At last=కడపటికి.

హి ట్రయిడ్ అండ్ ట్రయిట్ అండ్ అట్ లాస్ట్ గాట్
He tried and tried and at last got
ది ఫస్ట్ ప్రైజ్
the first prize.

అతఁడు ప్రయత్నించి ప్రయత్నించి కడపటికి మొదటి బహుమతిని పొందెను.

10. అట్ వన్స్ At once=తక్షణమే.

ది ఫాధర్ సా హిస్ సన్ స్మోకింగ్ అండ్
The father saw his son smoking and
అట్ వన్స్ పనిష్డ్ హిమ్.
at once punished him.

కొడుకు పొగత్రాగుచుండగా చూచి తండ్రి అతనిని వెంటనే శిక్షించెను.

11. ఎట్ ప్రెజంట్ At present=ఇప్పుడు.

ఐ ఆమ్ ఎట్ ప్రెజంట్ పుట్ అప్ ఇన్ ఎ
I am at present put up in a
హోటెల్.
hotel.

నేను ఇప్పుడు ఒక హోటలులో ఉన్నాను.

12. అట్ ది మెర్సీ ఆఫ్ At the mercy of=
ఒకరి దయపై ఆధారపడుట.

ది లైఫ్ ఆఫ్ కర్ణ వాస్ అట్ ది మెర్సీ
The life of Karna was at the mercy
ఆఫ్ అర్జున.
of Arjuna.

కర్ణుని ప్రాణము అర్జునుని దయపై ఆధారపడియుండెను.

13. బికాస్ ఆఫ్ Because of=కారణముగా.

బికాస్ ఆఫ్ రెయిన్ వి కుడ్ నాట్ ప్లే
Because of rain we could not play
ఎస్టర్ డే.
Yesterday.

వాన కారణముగ నిన్న మేము ఆడుకొన లేదు.

14. బ్రేక్ డౌన్ Break down=నిలుపుదల అగుట.

లాస్ట్ నైట్ దేర్ వాస్ ఏ సడన్ బ్రేక్
Last night there was a sudden break
డౌన్ ఇన్ ది సప్లై ఆఫ్ వాటర్ ఇన్ ది
down in the supply of water in the
టౌన్.
town.

నిన్నటి రాత్రి పట్టణములోని నీటి సరఫరా అకస్మాత్తుగా నిలుపుదల అయినది.

15. బై నౌ By now = ఇప్పటికి.

ది సినిమా వుడ్ హేవ్ బీన్ ఓవర్
The Cinema would have been over
బై నౌ.
by now.

సినిమా యిప్పటికి ముగిసి యుండును.

16. బై ది సైడ్ ఆఫ్ By the side of = ప్రక్కన.

ది ప్యాడీ ఫీల్డ్ ఇస్ బై ది సైడ్ ఆఫ్
The paddy field is by the side of
ది కేనల్.
the canal.

వరిపొలము కాలువప్రక్కన ఉన్నది.

17. బ్రింగ్ అప్ Bring up = పెంచుట.

శకుంతల వాస్ బ్రాట్ అప్ బై ది బర్డ్స్.
Sakuntala was brought up by the birds.

శకుంతల పక్షులచేత పెంచబడెను.

18. బ్రింగ్ ఫోర్త్ Bring forth = కను.

దేవకీ దేవి బ్రాట్ ఫోరు శ్రీ
Devaki Devi brought forth Sri
కృష్ణ.
Krishna.

దేవకీ దేవి శ్రీ కృష్ణుని కనెను.

19. బై మీన్స్ ఆఫ్ By means of=సాధనము వల్ల.

నౌ ఏ డేస్ వి కెన్ లెర్న్ మచ్
Now a days we can learn much
బై మీన్స్ ఆఫ్ రీడింగ్ న్యూస్ పేపర్స్
by means of reading Newspapers.

ఈ దినములలో మనము వార్తా పత్రికలను చదువుట వలన ఎంతో విషయమును నేర్చుకొనగలము.

20. బ్రేక్ ఓపెన్ Break open=పగులగొట్టుట

ది థీఫ్ బ్రోక్ ఓపన్ ది అయిరన్ సేఫ్
The thief broke open the iron safe
అండ్ స్టోల్ ది జ్యూయల్స్.
and stole the Jewels.

దొంగ ఇనుపపెట్టెను పగులగొట్టి ఆభరణములను దొంగలించెను.

21. బై ఛాన్స్ By chance=అకస్మాత్తుగ.

టుడే ఐ మెట్ మై బాయ్‌హుడ్ ఫ్రెండ్ బై
Today I met my boyhood friend by
ఛాన్స్
chance.

నేను ఈ దినము నా బాల్య స్నేహితుని అకస్మాత్తుగ కలిసి కొంటిని.

22. బ్యాక్ అప్ Back up=సమర్థించుట.

ది వకిల్ బ్యాక్‌డ్ అప్ ది విట్నెస్ బై
The vakil backed up the witness by
హిస్ అర్గ్యుమెంట్స్.
his arguments.

వకీలు తనవాదనలతో సాక్షిని సమర్థించెను.

23. కాల్ అఫ్ Call off=ఉప సంహరించుట-విరమించుట.

ది వర్కర్స్ కాల్డ్ అఫ్ ది స్ట్రైక్
The workers called off the strike
యిమ్మీడియేట్లీ ది ప్రొప్రయిటర్ ప్రామిస్డ్
immediately the proprietor promised
బెటర్ వేజస్
better wages.

యజమాని ఎక్కువకూలీ విషయమై వాగ్దానముచేసిన వెంటనే వర్కర్లు సమ్మె విరమించిరి.

24. క్యారీ అవుట్ Carry out=అమలుచేయు.

ది ఆర్డర్స్ ఆఫ్ ది కలెక్టర్ టు బిల్డ్
The orders of the Collector to build
ది బ్రిడ్జ్ వెర్ క్యారీడ్ అవుట్ అట్ వన్స్
the bridge were carried out at once.

వంతెన కట్టుటకై కలెక్టరు యిచ్చిన ఉత్తర్వులు వెంటనే అమలు చేయబడెను.

25. క్యాచ్ ది ట్రెయిన్ Catch the train=రైలు అందుకొనుట.

బికాస్ ఐ రాన్ టు ది స్టేషన్, ఆస్
Because I ran to the station, as
ఫాస్ట్ ఆస్ ఐ కుడ్, ఐ వాస్ ఏబుల్ టు క్యాచ్
fast as I could, I was able to catch
ది ట్రెయిన్ ఇన్ టైమ్.
the train in time.

నేను నాకు సాధ్యమయినంత వేగముగ స్టేషనుకు పరుగెత్తితిని కనుక రైలును సకాలములో అందుకొన గలిగితిని.

26. క్యాచ్ ఫైర్ Catch fire=నిప్పంటుకొనుట.

ఆస్ షి వాస్ కుకింగ్, హర్ సారీ కాట్
As she was cooking, her sari caught
ఫైర్ సడన్లీ.
fire suddenly.

ఆమె వంట చేయుచుండగా ఆమె చీరకు అకస్మాత్తుగా నిప్పంటు కొనినది.

27. కమ్ ఆఫ్ Come off=ప్రారంభమగు.

ది సమ్మర్ హాలీడేస్ ఆర్ కమింగ్
The summer holidays àre coming
ఆఫ్ నెక్స్ట్ మంత్.
off next month.

ఎండాకాలవు సెలవులు వచ్చేనెల ప్రారంభ మగును.

28. కమ్ యింటు ఫోర్స్ Come into force=అమలు లోనికి వచ్చు.

ది ప్రొహిబిషన్ ఆక్ట్ ఫస్ట్ కేమ్ ఇంటు
The Prohibition Act first came into
ఫోర్స్ యిన్ ది యియర్ 1939.
force in the year 1939.

మద్యనిషేధచట్టము మొట్టమొదట 1939 లో అమలు లోనికి వచ్చెను.

29. డ్రాప్ బై డ్రాప్ Drop by drop=ఒక్కొక్క బిందువు వంతున.

ది మెడిసన్ వాస్ పుట్ యింటు ది ఐ
The medicine was put into the eye
డ్రాప్ బై డ్రాప్.
drop by drop.

కంటిలోనికి మందు ఒక్కొక్క బిందువు వంతున వేయబడెను.

30. డిపెండ్ అపాన్ Depend upon=ఆధారపడి యుండుట.

లెట్ అస్ నాట్ డిపెండ్ అపాన్ అదర్స్ ఫార్
Let us not depend upon others for
వాట్ వి కెన్ డు.
what we can do.

మనము చేయగలిగిన దానికి గాను ఇతరులపై ఆధారపడ కుందుముగాక!

31. ఫార్ ఎండ్ నియర్ Far and near=అన్ని ప్రాంతములనుండి.

పీపుల్ కమ్ టు శ్రీశైలం ఫ్రమ్
People come to SriSailam from
ఫార్ ఎండ్ నియర్.
far and near.

శ్రీశైలమునకు ప్రజలు అన్ని ప్రాంతముల నుండి వత్తురు.

32. ఫార్ ది సేక్ ఆఫ్ For the sake of=కొఱకు.

త్రూఅవుట్ హిస్ లైఫ్ మహాత్మా
Throughout his life Mahatma
గాంధి వర్క్డ్ ఫార్ ది సేక్ ఆఫ్
Gandhi worked for the sake of
హిస్ మదర్‌లాండ్.
his Mother-land.

మహాత్మా గాంధీ తన జీవితమంతయు, మాతృభూమి కొఱకై పనిచేసెను.

33. ఫాండ్ ఆఫ్ Fond of=ఇష్టము కలిగియుండుట.

చిల్డ్రెన్ ఆర్ ఫాండ్ ఆఫ్ స్వీట్స్.
Children are fond of sweets.

పిల్లలు మిఠాయిలపై యిష్టము కలిగి యుందురు.

34. ఫ్రీ ఆఫ్ కాస్ట్ Free of cost=ఉచితముగా.

ఐ గాట్ దిస్ పెన్ ఫ్రీ ఆఫ్ కాస్ట్ వెన్
I got this pen free of cost when
ఐ బాట్ దట్ బుక్ ఫార్ రుపీస్ 50.
I bought that book for Rs. 50.

నేనా పుస్తకమును రూ. 50 కు కొన్నప్పుడు ఈ కలమును ఉచితముగ పొందితిని.

35. ఫ్రీ ఫ్రమ్ Free from=లేకుండ ఉండు.

ఇఫ్ వి క్లీన్ అవర్ హవుసస్ వెల్, దే
If we clean our houses well, they
విల్ బి ఫ్రీ ఫ్రమ్ ఫ్లయిస్ ఎండ్
will be free from flies and
మస్కిృట్టోస్.
mosquitoes.

మనము మన యిండ్లను బాగుగా శుభ్రము చేసిన యెడల అవి ఈగలు, దోమలు లేకుండ ఉండును.

36. ఫయిండ్ ఫాల్ట్ విత్ Find fault with=తప్పుపట్టుట.

ది ఆఫీసర్ ఫవుండ్ ఫాల్ట్ విత్ ది
The Officer found fault with the
ప్యూన్ ఫార్ నాట్ హావింగ్ క్లీన్డ్ ది టేబిల్.
peon for not having cleaned the table.

బల్లను శుభ్రము చేయనందులకు, ఆఫీసరు జవానును తప్పు పట్టెను.

37. గెట్ ఆన్ విత్ Get on with=జరుపుకొనిపోవు.

ది ఫాదర్ ఆస్క్డ్ ది బాయ్ ఇఫ్ హి
The father asked the boy if he
కుడ్ గెట్ ఆన్ విత్ ది ఓల్డ్ పెన్ ఫార్
could get on with the old pen for
ది ఇయర్.
the year.

పాతకలముతో ఆ సంవత్సరము జరుపుకొన గలడేమో నని తండ్రి బాలుని అడిగెను.

38. గెట్ రిడ్ ఆఫ్ Get rid of=వదలించుకొను.

అవర్ నెయిబర్స్ ఆర్ నాట్ గుడ్ పీపుల్.
Our neighbours are not good people.
వి ఆర్ ట్రయింగ్ టు గెట్ రిడ్ ఆఫ్ దెమ్.
We are trying to get rid of them.

మా పొరుగువారు మంచివారు కారు. మేము వారిని వదలించు కొనుటకు ప్రయత్నించుచున్నాము.

39. గెట్ త్రూ Get through=పరీక్షలో విజయము పొందు.

మై బ్రదర్ స్టడీడ్ హార్డ్ ఎండ్ సో గాట్
My brother studied hard and so got
త్రూ ది ఎక్సామినేషన్ యీజిలీ.
through the examination easily.

నా తమ్ముడు కష్టపడి చదివెను కనుక పరీక్షలో సులభముగ విజయమును పొందెను.

40. గివ్ అప్ Give up=విడచి పెట్టు

వి మస్ట్ గివ్ అప్ బాడ్ హాబిట్స్.
We must give up bad habits.

మనము చెడు అలవాట్లను విడచిపెట్ట వలయును.

41. హేండ్-టు-మౌత్ Hand to mouth=చాలీ చాలని.

ఆల్మోస్ట్ ఆల్ ది టీచర్స్ లీడ్ వన్లీ
Almost all the teachers lead only
ఎ హేండ్ టు మౌత్ లివింగ్.
a hand to mouth living.

ఇంచు మించు ఉపాధ్యాయులందఱు చాలీ చాలని రాబడితో జీవించుచుందురు.

42. ఇన్ ఫాక్ట్ In fact=నిజముగ.

క్లోత్స్ హావ్ ఇన్ ఫాక్ట్ బికమ్ కాస్ట్లియర్
Clothes have in fact become costlier
నౌ.
now.

గుడ్డలు నిజముగ మునుపటి కంటె ఎక్కువ ఖరీదయినవి.

43. ఇన్ ఆర్డర్ టు In order to=నిమిత్తమై.

ది మర్చెంట్ వెంట్ టు బోంబే ఇన్
The merchant went to Bombay in
ఆర్డర్ టు బయ్ ఏ మోటర్ కార్.
order to buy a Motor Car.

వర్తకుడు మోటారు కారును కొనుటకు బొంబాయికి పోయెను.

44. ఇన్ బ్లాక్ అండ్ వైట్ In black and white= వ్రాత మూలకముగ.

ది హెడ్మాస్టర్ ఆస్క్డ్ ది స్టూడెంట్స్
The Headmaster asked the students
టు ఎక్స్ప్రెస్ దేర్ గ్రీవన్సస్ ఇన్ బ్లాక్
to express their grievances in black
అండ్ వైట్.
and white.

తమ కష్టములను వ్రాత మూలకముగ తెలుపుకొనుడని హెడ్మాష్టరు విద్యార్థులను కోరెను.

45. ఇన్ ఫుల్ స్వింగ్ In full swing=ముమ్మరముగ జరుగుచుండుట.

ఎక్సామినేషన్స్ ఆర్ నౌ ఇన్ ఫుల్ స్వింగ్.
Examinations are now in full swing.

పరీక్షలిప్పుడు ముమ్మరముగ జరుగుచున్నవి.

46. ఇన్ ది ఏర్ In the air=నిర్ణయముకాక నిలిచి యుండుట.

ది ప్రపోజల్ ఫార్ ది కన్‌స్ట్రక్షన్
The proposal for the construction
ఆఫ్ ఎ న్యూ బిల్డింగ్ ఇస్ స్టిల్ హాంగింగ్ ఇన్
of a new building is still hanging in
ది ఏర్.
the air.

క్రొత్త భవనము నిర్మించు ఆలోచన యింకను నిర్ణయము కాక నిలిచి యున్నది.

47. నో నో బౌండ్స్ Know no bounds=అమితమైన-మేర లేని.

వెన్ హి హర్డ్ దట్ ఫోర్ సన్స్ వెర్
When he heard that four sons were
బార్న్ టు హిమ్ దశరథాస్ జాయ్ న్యు
born to him Dasaratha's joy knew
నో బౌండ్స్.
no bounds.

తనకు నలుగురు కుమారులు పుట్టిరని వినినప్పుడు దశరథుని ఆనందమునకు మేర లేకుండెను.

48. కీప్ అప్ Keep up=నిలబెట్టుట.

వి మస్ట్ కీప్ అప్ ది రెప్యుటేషన్ ఆఫ్
We must keep up the reputation of
అవర్ కంట్రీ.
our Country.

మనము మనదేశ ప్రతిష్ఠను నిలబెట్ట వలయును.

49. లే అవుట్ Lay out=పెట్టుబడి పెట్టు.

హి హాస్ లెయిడ్ అవుట్ క్రోర్స్ ఆఫ్ రుపీస్
He has laid out crores of rupees
ఇన్ ది పేపర్ ఇండస్ట్రీ.
in the paper industry.

కాగితపు పరిశ్రమలో అతడు కోట్ల కొలది రూపాయలు పెట్టుబడి పెట్టెను.

50. లెంగ్త్ అండ్ బ్రెడ్త్ Length and breadth=దేశమందంతటను.

బుద్ధాస్ మెసేజ్ ఆఫ్ అహింసా స్ప్రెడ్
Buddha's message of Ahimsa spread
త్రూ అవుట్ ది లెంగ్త్ అండ్ బ్రెడ్త్
throughout the length and breadth
ఆఫ్ ఇండియా.
of India.

బుద్ధుని అహింసా ప్రబోధము భారతదేశము నందంతటను వ్యాపించెను.

51. లుక్ ఆఫ్టర్ Look after=కనిపెట్టి యుండు.

ది గర్ల్ లుక్స్ ఆఫ్టర్ ది బేబీ వెన్
The girl looks after the baby when
హర్ మదర్ ఇస్ అవుట్.
her mother is out.

ఆమె తల్లి బయటకు పోయినపుడు, ఆ బాలిక శిశువును కనిపెట్టి యుండును.

52. లూస్ హార్ట్ Lose heart=అధైర్యపడు.

వి మస్ట్ నాట్ లూస్ హార్ట్ ఇన్ టైమ్స్
We must not lose heart in times
ఆఫ్ డేంజర్.
of danger.

అపాయ సమయములందు మనము అధైర్య పడరాదు.

53. లుక్ డౌన్ అపాన్ Look down upon=అలక్ష్యముగ చూచుట.

జెనరలీ రిచ్ పీపుల్ లుక్ డౌన్
Generally rich people look down
అపాన్ ది పూర్.
upon the poor.

సాధారణముగ ధనవంతులు పేదవారిని అలక్ష్యముగ చూతురు.

54. మేక్ అవుట్ Make out=గ్రహించు.

ఐ కుడ్ ఈజిలీ మేక్ అవుట్ ది మీనింగ్
I could easily make out the meaning
ఆఫ్ ది రిడిల్.
of the riddle.

ఆ పొడుపు కథ యొక్క అర్థమును నేను సులభముగ గ్రహింపఁ గలిగితిని.

55. మేక్ ఫార్ Make for=కలిగించు.

కంటెంట్మెంట్ మేక్స్ మచ్ ఫార్
Contentment makes much for
హాపినెస్.
happiness.

సంతృప్తియే సంతోషమును ఎక్కువగా కలిగించును.

56. మేక్ అప్ వన్స్ మైండ్ Make up one's mind= నిశ్చయించుకొనుట.

హి మేడ్ అప్ హిస్ మైండ్ టు గో టు
He made up his mind to go to
ఇంగ్లాండు ఫార్ హైయర్ స్టడీస్.
England for higher Studies.

ఉన్నత విద్యకై ఇంగ్లాండు పోవుటకు అతడు నిశ్చయించుకొనెను.

57. నూక్ అండ్ కార్నర్ Nook and corner=మూల మూలకు-అంతటను.

ఐ సర్చ్డ్ ఫార్ ది మిస్సింగ్ బుక్ ఇన్
I searched for the missing book in
ఎవ్వేరి నూక్ అండ్ కార్నర్ ఆఫ్ ది హవుస్.
every nook and corner of the house.

కనపడని పుస్తకమునకై నేను యింటిలో మూల మూలకు వెదకితిని.

58. నల్ ఎండ్ వాయిడ్ Null and void=విలువలేనిదిగ.

ది హై కోర్ట్ డిక్లేర్ ది
The High Court declared the
అగ్రిమెంట్ నల్ అండ్ వాయిడ్.
agreement null and void.

ఆ ఖరారు నామా విలువలేనిదని (చెల్లదని) హైకోర్టు వారు తీర్పు యిచ్చిరి.

59. ఆన్ ది అలర్ట్ On the alert=జాగ్రత్తగ నుండు.

ది వాచ్‌మన్ వాస్ ఆన్ ది అలర్ట్ లెస్ట్
The watchman was on the alert lest
మంకీస్ మే ఎంటర్ ది హవుస్.
monkeys may enter the house.

కోతులు ఇంటిలో దూరునేమో యని కావలి వాఁడు జాగ్రత్తగా నుండెను.

60. ఒన్ అండ్ ఆల్ One and all=అందఱునూ.

వార్ ఇస్ డిస్లయిక్డ్ బై ఒన్ ఎండ్ ఆల్.

War is disliked by <u>one and all</u>.

యుద్ధమును అందఱునూ నిరసించెదరు.

61. అవుట్ ఎండ్ అవుట్ Out and out=పరిపూర్ణముగ.

అశోక వాస్ ఆన్ అవుట్ అండ్ అవుట్ బుద్ధిస్ట్.

Asoka was an <u>out and out</u> Buddhist.

అశోకుఁడు పరిపూర్ణముగ బౌద్ధ మతమునకు చెందిన వాడు.

62. పుట్ ఆన్ Put on=ధరించుట.

పీపుల్ పుట్ ఆన్ న్యూ క్లోత్స్ ఆన్ ది

People <u>put on</u> new clothes on the

దీపావళి డే.

Deepavali day.

దీపావళి నాడు ప్రజలు క్రొత్త గుడ్డలు ధరింతురు.

63. (i) పుట్ అప్ Put up=ఏర్పాటుచేయుట.

ది వీవర్స్ పుట్ అప్ టూ లూమ్స్

The weavers <u>put up</u> two looms

ఇన్ ది ఎక్జిబిషన్ గ్రౌండ్స్.

in the Exhibition grounds.

వస్తు ప్రదర్శనా స్థలములో నేతగాండ్రు రెండు మగ్గములను ఏర్పాటు చేసిరి.

(ii) పుట్ అప్ Put up=బస చేయుట.

ది కలెక్టర్ ఇస్ పుట్ అప్ ఇన్ ది
The Collector is put up in the
ట్రావెలర్స్ బంగలో.
traveller's bungalow.

కలెక్టరు ప్రయాణీకుల బంగళా యందు బసచేసి యున్నాడు.

64. పుట్ అఫ్ Put off=వాయిదా వేయు.

వి మస్ట్ నాట్ పుట్ అఫ్ టిల్ టుమారో
We must not put off till to-morrow
వాట్ వి కెన్ డు టుడే.
what we can do to-day.

ఈ దినము చేయగలిగిన దానిని మనము రేపటికి వాయిదా వేయరాదు.

65. రేంక్ అండ్ ఫయిల్ Rank and file=అబాల గోపాలము—(అందఱును)

ది రేంక్ అండ్ ఫయిల్ ఆఫ్ ది విలేజ్
The rank and file of the village
టర్న్డ్ అప్ టు సీ ది ప్రొసెషన్.
turned up to see the procession.

గ్రామమందలి అబాల గోపాలము ఉత్సవమును చూచుటకు వచ్చెను.

66. రన్ ఆఫ్టర్ Run after=వెంటబడు.

ది క్యాట్ రాన్ ఆఫ్టర్ ది మౌస్.

The cat ran after the mouse.

పిల్లి చిట్టెలుక వెంటఁబడెను.

67. రన్ డౌన్ Run down=నీరసముగా నుండుట.

హి ఇస్ వెరీ మచ్ రన్ డౌన్ డ్యూ టు

He is very much run down due to

ఓవర్ వర్క్.

over work.

అధికమైన పని వలన అతడు చాల నీరసస్థితిలో ఉన్నాడు.

68. సెట్ అప్ Set up=ఏర్పాటు చేసికొను.

ప్రకాశం పంతులు సెట్ అప్ ప్రాక్టీస్

Prakasam Pantulu set up practice

ఇన్ మెడ్రాస్ ఆస్ బారట్‌లా.

in Madras as Bar-at-law.

ప్రకాశంపంతులుగారు మదరాసులో బారిష్టరుగా నేర్పడెను.

69. సెట్ అవుట్ Set out=బయలుదేరు.

మై బ్రదర్ విల్ సెట్ అవుట్ ఫార్

My brother will set out for

హైదరాబాద్ ఇన్ టూ డేస్.

Hyderabad in two days.

మా అన్న హైదరాబాదుకు రెండుదినములలో బయలు దేరును.

70. సెట్ ఎపార్ట్ Set apart=ప్రత్యేకింపబడుట.

హాఫ్ ఆఫ్ ది సినిమా హాల్ ఇస్ సెట్ ఎపార్ట్
Half of the Cinema hall is set apart
ఫార్ లేడీస్.
for ladies.

సినిమాహాలులో అర్ధభాగము స్త్రీలకు ప్రత్యేకింపబడినది.

71. సెండ్ ఫార్ Send for=పిలిపించుట.

ది హెడ్మాస్టర్ సెంట్ ఫార్ ది ప్యూన్.
The Headmaster sent for the peon.

హెడ్మాష్టరు జవానును పిలిపించెను.

72. సెండ్ ఆఫ్ Send off=వీడ్కోలు యిచ్చుట.

ది మినిష్టర్స్ గేవ్ ఏ గ్రాండ్ సెండాఫ్
The Ministers gave a grand send off
టు ది అవుట్‌గోయింగ్ గవర్నర్.
to the outgoing Governor.

పదవీ విరమణ చేయుచున్న గవర్నరుకు మంత్రులు ఘనమైన వీడ్కోలు యిచ్చిరి.

73. సెట్ ఇన్ Set in=ఆరంభమగు.

ది స్ప్రింగ్ సీజన్ సెట్స్ ఇన్ ఇన్ ది
The Spring season sets in in the
మంత్ ఆఫ్ చైత్రమ్.
month of chaitram.

వసంత ఋతువు చైత్ర మాసములో ప్రారంభ మగును.

74. సెట్ ఎసైడ్ Set aside=నిరాకరించు (త్రోసిపుచ్చు).

ది సుప్రీమ్ కోర్ట్ హాస్ సెట్ ఎసైడ్
The Supreme Court has set aside
ది ఆర్డర్స్ ఆఫ్ ది హై కోర్ట్.
the orders of the High Court.

హైకోర్టువారి ఉత్తరువులను సుప్రీముకోర్టువారు త్రోసిపుచ్చిరి.

75. టేక్ టు Take to=అలవాటుపడు.

హి ఇస్ ఆఫ్ లేట్ టేకన్ టు డ్రింక్.
He is of late taken to drink.

అతడు ఇటీవల త్రాగుడుకు అలవాటుపడి యున్నాడు.

76. త్రూ ఎండ్ త్రూ Through and through=పూర్తిగ.

హి ఇస్ త్రూ ఎండ్ త్రూ ఏ బర్గ్లర్.
He is through and through a burglar.

అతడు పూర్తిగా గజదొంగ.

77. టిట్ ఫార్ టాట్ Tit for tat=బదులుకు బదులు.

హి అబ్యూస్డ్ మి ఎండ్ ఐ గేవ్ హిమ్
He abused me and I gave him
టిట్ ఫార్ టాట్.
tit for tat.

అతడు నన్ను నిందించగా నేనాతనికి బదులుకు బదులు చెల్లించితిని.

78. టు ది ట్యూన్ అఫ్ To the tune of=వరకు.

లాస్ట్ ఇయర్ హి లాస్ట్ టు ది ట్యూన్ ఆఫ్
Last year he lost to the tune of
టూ తవుజండ్ రుపీస్.
two thousand rupees.

పోయిన సంవత్సరము అతడు రెండువేల రూపాయల వరకు నష్టపడెను.

79. అన్‌కాల్డ్ ఫార్ Uncalled for=అనవసరమైనది.

ది వార్నింగ్ గివన్ బై ది పోలీస్ టు
The warning given by the police to
ది పబ్లిక్ ఇస్ అన్‌కాల్డ్ ఫార్.
the public is uncalled for.

ప్రజలకు పోలీసువారు యిచ్చిన హెచ్చరిక అనవసరమైనది.

80. అన్‌వర్ది ఆఫ్ Unworthy of=తగనిది (అనుచితమైనది).

సచ్ కైండ్ ఆఫ్ బిహేవియర్ ఇస్ అన్వర్ది
Such kind of behaviour is unworthy
ఆఫ్ ఏ రెస్పెక్టబుల్ వుమెన్.
of a respectable woman.

అట్టిరకమైన ప్రవర్తన మర్యాదగల స్త్రీకి తగనిది.

81. వెక్స్డ్ విత్ Vexed with=విసుగుచెందిన.

ది మదర్ వాస్ వెక్స్డ్ విత్ ది
The mother was vexed with the
వీపింగ్ చైల్డ్.
weeping child.

ఏడ్చుచున్న శిశువును గుఱించి తల్లి విసుగు చెందెను.

82. అండర్ వన్స్ నోస్ Under one's nose=సమక్షములో.

ది టీచర్ పనిష్డ్ ది బాయ్ అండర్
The teacher punished the boy under
ది నోస్ ఆఫ్ హిస్ ఫాదర్.
the nose of his father.

ఉపాధ్యాయుఁడా బాలుని తండ్రి సమక్షములో శిక్షించెను.

83. వాంటింగ్ ఇన్ Wanting in=లోపముండుట.

కమలా ఇస్ వాంటింగ్ ఇన్ ఇండస్ట్రీ.
Kamala is wanting in industry.

కమలయందు కృషిలోపమున్నది.

84. వేర్ ఎండ్ టేర్ Wear and tear=అరుగుదల.

ది కంపెనీ హేవ్ ప్రొవయిడెడ్ టూ
The company have provided two
థవుజండ్ రుపీస్ పెర్ ఇయర్ ఫార్ ది
thousand rupees per year for the

వేర్ అండ్ టేర్ ఆఫ్ ది మెషినరీ.
wear and tear of the Machinery.
యంత్రముల అరుగుదలను భర్తీ చేయుటకుగాను కంపెనీవారు సంవత్సరమునకు రెండువేల రూపాయలను మంజూరు చేసినారు.

85. విత్ ఫ్లయింగ్ కలర్స్ With flying colours= జయప్రదముగ.

ది హార్స్ కేమ్ అవుట్ ఆఫ్ ది రేస్
The horse came out of the race
విత్ ఫ్లయింగ్ కలర్స్.
with flying colours.
గుఱ్ఱము పందెములో గొప్ప విజయమును పొందెను.

86. ర్రాంగ్ ఆఫ్ Wrong of=తప్పు.

ఇట్ ఇస్ ర్రాంగ్ అఫ్ యు టు టాక్ లైక్ దట్
It is wrong of you to talk like that
ఎబవుట్ ది గర్ల్.
about the girl.
ఆ బాలికను గురించి అట్లు మాట్లాడుట నీది తప్పు.

87. ఇన్ నీడ్ ఆఫ్ In need of=అవసరములో నుండుట.

ది సర్వెంట్ మెయిడ్ ఇస్ బ్యాడ్లీ ఇన్ నీడ్ ఆఫ్
The servant maid is badly in need of
క్లోత్స్.
clothes.
పని మనిషి మిక్కిలి గుడ్డల అవసరములో ఉన్నది.

88. టాక్ ఇల్ ఆఫ్ Talk ill of=చెడుగా మాట్లాడుట.

వి షుడ్ నాట్ టాక్ ఇల్ ఆఫ్ అదర్స్.
We should not talk ill of others.
ఇతరులనుగురించి మనము చెడుగా మాటలాడుకొనకూడదు.

89. గుడ్ అట్ Good at=నేర్పు కలిగియుండుట.

ది బెగ్గర్ గర్ల్ ఇస్ గుడ్ అట్ సింగింగ్
The beggar girl is good at singing
సినిమా సాంగ్స్.
Cinema songs.
ఆ బిచ్చమెత్తే బాలిక సినిమా పాటలు పాడుటలో నేర్పు కలిగియున్నది.

90. హేండ్ ఇన్ హేండ్ Hand in hand=కలసి మెలసి (ఒకటిగా).

హెల్త్ అండ్ వెల్త్ రేర్లీ గో హేండ్
Health and Wealth rarely go hand
ఇన్ హేండ్.
in hand.
ఆరోగ్యము, ఐశ్వర్యము చాల అరుదుగ కలసియుండును.

91. ఆన్ అకౌంట్ ఆఫ్ On account of=కారణముగా.

ది వర్క్ వాస్ సస్పెండెడ్ ఆన్ అకౌంట్
The work was suspended on account
ఆఫ్ హెవీ రెయిన్స్.
of heavy rains.

బలమైన వర్షములు కారణముగా పని నిలుపుదలచేయబడెను.

92. విత్ హెవీ హార్ట్ With heavy heart=హృదయ భారముతో.

 ది బ్రైడ్ లెఫ్ట్ హర్ ఫాదర్స్ హవుస్
The bride left her father's house
 విత్ హెవీ హార్ట్.
with heavy heart.

వధువు హృదయభారముతో తనతండ్రియింటిని విడిచివెళ్లెను.

93. ఇన్ ది లైట్ ఆఫ్ In the light of=దృష్టిలో ఉంచుకొని.

 ఇన్ ది లైట్ ఆఫ్ ది రిమార్క్స్ ఆఫ్ ది
In the light of the remarks of the
 మేనేజర్ ది కేండిడేట్ వాస్
Manager the candidate was
 అపాయింటెడ్,
appointed.

మేనేజరు అభిప్రాయములను దృష్టిలో నుంచుకొని ఆ అభ్యర్థికి ఉద్యోగ మీయబడెను.

94. ఇన్ ల్యూ ఆఫ్ In lieu of=బదులుగ.

 హి టుక్ నోట్ బుక్స్ ఇన్ ల్యూ ఆఫ్ వైట్
He took note books in lieu of white
 పేపర్.
paper.

వ్యాపార ఉత్తరము :

పుస్తకములు పంపగోరుచు వ్రాయు ఉత్తరము

ఇన్నీసు పేట,

రాజమండ్రి.

28-10-1961.

మెసర్సు బాలసరస్వతీ బుక్కు డిపో,

విద్యావిషయ ప్రచారకులు,

తపాలు పెట్టె నెం. 3,

కర్నూలు.

అయ్యా,

ఈ క్రింది పుస్తకములను రైల్వే పార్సలు ద్వారా పంప కోరిక. పార్సెలును ప్యాసెంజరు రైలుమీదపంపి, దానికి సంబంధించిన రైల్వేరశీదు (R. R.) ను బ్యాంకుద్వారా పంప ప్రార్థన.

(1) గానకళా బోధిని 20 ప్రతులు

(2) ఇంగ్లీషు తెలుగు ప్రైమర్ 100 ప్రతులు

(3) భగవద్గీత 100 ప్రతులు

ఇట్లు, విధేయుడు.

యస్. వి. రంగప్రసాదరావు,

పుస్తక విక్రేత.

## Reply from the Company

KURNOOL,
2nd November '61.

To

Sri S. V. Rangaprasada Rao,
Book-Seller,
Innispet, Rajahmundry.

Dear Sir,

With reference to your esteemed order of 28th October, we beg to advise the despatch of the books by Railway Parcel. The relative R/R has been sent through the Andhra Bank Ltd, Rajahmundry. Please honour it on presentation.

Thanking you,

Yours faithfully,
For Balasaraswathi Book Depot,
T. Balanagiah Chetty,
Proprietor.

కంపెనీనుండి జవాబు

కర్నూలు,

2-11-1961.

To

శ్రీ యస్. వి. రంగాప్రసాదరావు,

పుస్తక వర్తకులు,

ఇన్నీసుపేట,

రాజమహేంద్రవరము.

అయ్యా,

అక్టోబరు 28 వ తేదీ మీరుపంపిన ఆర్డరు మేరకు, పుస్తకములను రైల్వేపార్సలుద్వారా పంపియున్నాము. రైల్వే రశీదు ఆంధ్రబ్యాంకువారిద్వారా పంపియున్నాము. అందిన వెంటనే దానిని తీసుకొన ప్రార్థన.

మీ విశ్వాసపాత్రుడు,

టి బాలనాగయ్య శెట్టి,

బాలసరస్వతీ బుక్కుడిపో,

కర్నూలు,

# Letter to a Customer

Jai Hind Press,
KURNOOL,
10th March, 1961.

To
Messrs. K. V. Reddy & Co,
Book-Sellers,
Mahaboobnagar.

Dear Sirs,

We beg to draw your kind attention to our Bill No. 210 of 10th January 1951 for Rs. 356/- The payment of this amount has been long over due. You have not given us any reply inspite of our many reminders. Please settle the account without any further delay, failing which, we shall be obliged to take necessary legal action to recover the amount.

Yours faithfully,
T. Venkateswarlu Chetty,
Proprietor.

# Official Letters

## Application for an appointment :

### ఉద్యోగమునకు అర్జీ

ఉద్యోగమునకు అర్జీని లేక దరఖాస్తును వ్రాయునపుడు మిక్కిలి జాగ్రత్తగా నుండవలయును. దరఖాస్తులో ఈ క్రింది విషయములను ప్రస్తావించవలయును :—

1. ఉద్యోగమును గురించి తెలిసికొనిన విషయము :— పత్రికా ప్రకటన మూలమున తెలిసికొనినది, లేక వినికిడి మూలమున తెలిసికొన్నది.

2. ఆ ఉద్యోగమునకు తానెట్లు తగియున్నది:—చదివిన చదువు, ప్యాసయిన పరీక్షలు, అనుభవము మొదలగునవి.

3. జీతము విషయము : మొదలగు ఇతర విషయములు.

# Model of an Application

To

The Proprietor,
Jai Hind Power Press,
Hospital Road,
KURNOOL.

Sir,

Having been informed that there are vacancies of proof-readers in your press, I beg to offer myself as a Candidate for one of the same.

I have passed my S.S.L.C. Examination in the year 1950. I have also appeared for the Lower Grade Examination in Typewriting in the year 1953. So I am confident that I will be a good proof-reader in two languages i.e. Telugu and English.

In case I am employed, I beg to promise, that I shall spare no pains to do my duty to your entire satisfaction.

Petah,
KURNOOL,
28-10-1961.

Yours faithfully,
R. Venkoba Rao.

Application to the Superintendent of Post Offices for opening a Post Office in your Village :—

To

The Superintendent of Post Offices
III Circle,
KURNOOL.

Sir,

We, the undersigned residents of Tharthur village of Nandikotkur taluk respectfully submit the following facts for your early and favourable consideration.

Our village Tharthur is considerably a big village. There are about three thousand families residing here. The weekly shandy takes place here on every Monday. People of all neighbouring villages buy and sell things here on that day. Every week we get some two to three hundred letters. All these are now distributed only once in a week. This is causing us a lot of inconvenience.

So we humbly request that a branch Post Office may kindly be opened in our village. As our village is situated within two miles from the Kurnool—Sri-Sailam main road, there will not be much difficulty in opening a branch Post Office here.

Thanking you,

We beg to remain,

Sir,

(1) K. Ramaswamy.

(2) C. Ranga Reddy.

(3) C.V. Subbaih Chetty.

(4) R. Ranga Raju.

(5) Z. Suguna Devi.

Tharthur,
Nandikotkur Tq.,
25-10-1961.

To the District Agricultural Officer for the supply of good paddy seeds:—

To

The District Agricultural Officer,
Medak.

Sir,

I am a native of Medak. I am a cultivator owning lands to the extent of 30 acres. Out of this, I am bringing 5 acres under wet cultivation this year. I have dug a well with Government subsidy. The proposed 5 acres of land is to be watered by this well.

However, I have not been able to secure the proper variety of paddy seeds for sowing purposes. So I request you to supply me 15 measures of good paddy-seeds of Akkullu or Delhi Bhogalu variety and oblige.

Thanking you,

*Medak,*
*20th October, 1961.*

Yours faithfully,
D. K. Mohan Rao.

# SALE DEED

Know all men by these presents that I, Annaswami Naidu of Perambur, Madras, for and in consideration of the sum of Rupees fifteen thousand in hand, paid at and before the sealing and delivery hereof, by Fakruddin of Mylapore, Madras, the receipt where of, I do hereby acknowledge have bargained and sold, and by these presents do bargain and sell, unto the said Fakruddin, all the goods, household stuff, electric fixtures and household implements and all other things whatsoever mentioned in the schedule hereunto annexed now remaining and being—To have and to hold all and singular the goods, household stuff, electric fixtures and household implements and every one of them, by the presents bargained and sold unto the said Fakruddin, his executors, administrators and assigns for ever. And I, the said Annaswami Naidu for myself, my executors and administrators' all and singular of the said goods unto the said Fakruddin, his executors and administrators and assigns and against all and every other person and persons whatsoever, shall and will warrant and for ever defined by these presents of which goods, I, the said Annaswami Naidu have put the said Fakruddin in possession, by delivering him one silver seal, etc., on the sealing hereof. In witness where of, I have hereunto put my hand and seal this of 12th day of May, 1964.

ANNASWAMI NAIDU.

Signed, sealed and delivered in the presence of us } FAKRUDDIN.<br>RAJACHAR.

# విక్రయపత్రము

మదరాసు, పెరంబూరునందు నివాసముచేయుచున్న 'అన్నాస్వామి నాయుడు' అను పేరుగల నేను నగదు రూ. 15000/- లు (అక్షరాలా పదునైదువేల రూపాయలు) మాత్రము నాకు చెల్లించినందుకుగాను, సదరు మదరాసు, మైలాపూరు వాస్తవ్యుడైన ఫక్రుద్దీను అను వానికి నేను వ్రాసి యిచ్చిన విక్రయపత్రము—

ఇందుతో చేర్చబడిన షెడ్యూలులో చూపబడిన అన్ని వస్తువులు, యిండ్లకుసంబంధించిన ఇతరములైన అన్ని సామానులు, బేరమాడి విక్రయించి, పదునైదువేల రూపాయలు పుచ్చుకొన్నందులకు ఇది రసీదుగా నిచ్చుచున్నాను.

షెడ్యూలునందు సూచింపబడిన ఒక్కొక్కసామాను, ఇంటిసామానులను, సకలమైన వస్తువులును, పరికరములును పైన పేర్కొనబడిన ఫక్రుద్దీను అనువానికి, యిందుమూలమున విక్రయింపబడినందువలన, అతడుగాని, అతని ఉత్తరువుపొందిన ఎక్సిక్యూటర్లు, అడ్మినిస్ట్రేటరులు మొదలైనవారు యీ ఆస్తిపైన సర్వహక్కులతోటి సంపూర్ణాధికారము కల్గియుందురు. నాకును, నా ఎక్సిక్యూటర్లకు, అడ్మినిస్ట్రేటర్లకు, యీ ఆస్తిపైనగల హక్కులను, అధికారాలను అన్నిటిని, సంపూర్ణముగా సదరు ఫక్రుద్దీనుకే యిచ్చివేయుచూ, యీ విక్రయ దస్తావేజును నాస్వదస్తూరితో వ్రాయుచున్నాను. అన్నాస్వామి నాయుడు

ఈ దస్తావేజు మా సమక్షంలో వ్రాయబడి సంతకం చేయబడినది:---

1. ఫక్రుద్దీను
2. రాజాచారి

12-5-1964

# WILL

36, Poonamalli High Road,
Madras-7,
12th February, 1964.

This is the last Will and Testament of Shri Karempudi Narayana Rao, Kilpauk, Madras.

I hereby give and divide to my wife Sow. Rangamma, her heirs, executors and administrators, for her and their own use and benefit, absolutely and for ever, all my estate and effects both real and personal whatsoever and wheresoever and of what nature and quality soever, and I hereby appoint her, the said Rangamma, as the sole executrix of this, my Will.

In witness whereof I have hereunto set my hand, this 12th day of February, nineteen hundred and sixty four.

K. NARAYANA RAO.

Signed by said K. Narayana Rao in our presence and in the presence of each other at the same time subscribe our names as witness hereto.

*Witnesses :—*

1. T. NAMMALWAR.
2. D. SUBBA RAO.

# వీలునామా

36. పూనమల్లిహైరోడ్డు,
మదరాసు-7,
12-2-'64.

మదరాసు పూనమల్లిహైరోడ్డులో నివాసమున్న శ్రీ కారెంపూడి. నారాయణరావుగారి వీలునామా - ఇందుమూలముగా నా భార్యయైన సౌ॥ రంగమ్మకున్ను, ఆమె వారసులకున్నూ అడ్మినిస్ట్రేటర్లుకున్నూ సర్వకాలము సంపూర్ణమైన హక్కులతో నాకుచెందిన సకలవిధములైన స్థిరచరాస్తులపైన సర్వసంపూర్ణాధికారమీయఁబడినది. ఈ వీలునామాను అమలుపరచుటకు, పైనపేర్కొనబడిన నా భార్య రంగమ్మను సంపూర్ణమైన హక్కులతో ఎక్సిక్యూటరుగా నియమించుచున్నాను.

1964 వ సంవత్సరం ఫిబ్రవరి నెల 12-వ తేదీన నా స్వదస్తూరితో యీ నా వీలునామా వ్రాయుచున్నాను.

కే. నారాయణరావు

మా సమక్షమున యీ వీలునామా వ్రాయడమైనది.

సాక్షులు :—

1. టి. నమ్మాళ్వారు
2. డి. సుబ్బారావు

# PROMISSORY NOTE

## 1

Madras,

15—2—'65.

On demand, I promise to pay to Shri P. Ramiah Naidu, or order the sum of Rs. 1,500/- (Rupees one thousand and five hundred) only with interest thereon, at 9% per annum for value received in cash.

Rs. 1,500/-.

Stamp

Signature

## 2

Madras,

5—2—65.

On demand, we jointly and severally promise to pay to Shri S. Narayanaswami Chetty or order the sum of Rs 2,000/- (Rupees two Thousands) only with interest thereon, at the rate of 8% per annm for value received in cash.

Rs. 2,000/-.

Stamp

Signatures

# ప్రామిసరీ నోటు

మదరాసు.
15-2-'65

నా అవసరము నిమిత్తము, యీదినం శ్రీ పి. రామయ్య నాయుడుగారి యొద్దనుండి రూ. 1500/- (అక్షరాలా పదునైదు వందల రూపాయల)కు, వారికిగాని, వారి ఉత్తరవుపొందినవారికి గాని అడిగినవెంటనే, సంవత్సరానికి నూటికి రూ. 9/ల చొప్పున వడ్డీతోసహా యివ్వగలవాడను, అని నా మనస్పూర్తిగా వ్రాసి యిచ్చిన ప్రామిసరీ నోటు.

స్టాంపుమీద
దస్కతు.

2

మదరాసు,
6-2-'65.

మా అవసర నిమిత్తం, యీ 6-2-'65 తేదీనాడు, శ్రీ ఎస్. నారాయణస్వామి శ్రేష్ఠిగారను, మీయొద్ద తీసుకొన్న రూ. 2000/-లు. (అక్షరాలా రెండువేల రూపాయలు) మాత్రము మీకుగాని, మీ ఉత్తరువును పొందినవారికిగాని, నూటికి యేడాదికి 8 రూపాయల వంతున వడ్డీతోకలిపి, మా యిద్దరిలో యే ఒక్కరమైనా, లేదా, యిద్దరమైనను కలిసి, తప్పక, మీరు అడిగిన తక్షణం అసలు వడ్డీ యిచ్చివేయగలమని మనస్పూర్తిగా ఒప్పి వ్రాసియిచ్చిన ప్రామిసరీనోటు.

స్టాంపుమీద
దస్కతు.

# PARTITION DEED

We, the three sons of Nagaraja Sarma in view of the convenience of each other, agree to partition the ancestral properties both movable and immovable left by our deceased father Nagaraja Sharma as shown in the schedule hereunto annexed and accordingly divide our properties by *metes and bounds* assigning equal shares as shown in the above schedule.

Signatures.

# CERTIFICATE

This is to certify that Sri Guruswamy Pillai has been working in our factory, under my immediate supervision, as my personal clerk for the last five years, during which period, he performed his duty with a due sense of responsibility most promptly and efficiently. I have found him also to be upright and honest and of commendable conduct and character. He now leaves his present post under me, with a view to better his prospects. I recommend him to any employer in want of his services.

A. R. ACHAR,

12—2—'65.

# పారీకత్తులు

## (ఆస్తి పంపక పత్రము)

శ్రీ నాగరాజశర్మ అనువారి పుత్రులమైన మేము ముగ్గురము, మా మా సౌకర్యమునిమిత్తం, కీర్తిశేషులైన మాతండ్రి నాగరాజశర్మగారికి చెందిన యిందుతో చేర్పబడిన షెడ్యూలు నందు చూపబడిన స్థిరాస్తులను అన్నిటిని షెడ్యూలునందు చూపబడిన ప్రకారము మూడు సమానమైన భాగములుగా పంచుకొని సరిహద్దులు, పారీకత్తులు యిందుమూలముగా యేర్పరచుకోవడమైనది.

సంతకాలు.

# సర్టిఫికెట్టు

## (యోగ్యతా పత్రము)

శ్రీ గురుస్వామిపిళ్ళే అను నతడు మా ఫ్యాక్టరిలో గత అయిదు సంవత్సరములనుండి, నా పర్యవేక్షణక్రింద నా పర్సనల్ క్లార్కుగా ఉద్యోగముచేయుచున్నాడు. అతడు తన ఉద్యోగ కాలమందు తన పనిని బాధ్యతతో నిర్వహిస్తూ శ్రద్ధాసక్తుల తోడను, సక్రమముగాను చేయుచున్నాడు. ఇంతేగాక, అతడు మంచినడవడిగల సద్గుణసంపన్నుడు. తన భావికాలపు అభివృద్ధి నిమిత్తం, నాక్రింద యింతవరకు అతడు చేయుచూఉండిన ఉద్యోగం మానుకొనుచున్నాడు. అతనితో పనికావలసినవారు యేయజమానులైనా, అతనికి ఉద్యోగమీయవచ్చునని నే నిందు మూలమున సిఫారసు చేయుచున్నాను.

ఏ. ఆర్. ఆచారి,

12-2-'65.

# 48. Proverbs (ప్రోవెర్బ్స)

## సామెతలు

### A

1. ఏ బర్డ్ యిన్ ది హాండ్ ఇస్ వర్త్ టూ ఇన్ ది బుష్ -
**A bird in the hand is worth two in the bush**
చేలో ఉండే పందుం గింజలకన్న చేతిలో ఉండే పదిగింజలు మేలు.

2. ఏ బర్న్ట్ చైల్డ్ డ్రెడ్స్ ది ఫైర్ -
**A burnt child dreads the fire**
కాలిన బిడ్డ మంటచూస్తేనే భయపడుతుంది.

3. ఆల్ ఇస్ వెల్ దట్ ఎండ్స్ వెల్ -
**All is well that ends well**
అంతం బాగుంటే అన్ని బాగున్నట్లే.

4. అబండన్స్ లైక్ వాంట్ రూయిన్స్ మెనీ -
**Abundance like want ruins many**
అతివృష్టి, అనావృష్టి రెండూ అరిష్టాలే.

5. ఆల్ అర్ నాట్ సెయింట్స్ దట్ గో టు చర్చ -
**All are not saints that go to church**
తలలు బోడులైన తలపులు బోడులా !

6. ఆల్ ఇస్ నాట్ గోల్డ్ దట్ గ్లిటర్స్ -

**All is not gold that glitters**

మెరిసేదంతా బంగారం కాదు.

7. అప్పియరన్సెస్ ఆర్ డిసీట్‌ఫుల్ -

**Appearances are deceitful**

ఆకారపుష్టి నైవేద్యనష్టి.

8. అస్ యూ సో యూ విల్ రీప్ -

**As you sow you will reap**

పెట్టినందుకు పుట్టిందేగుర్తు(చోళ్లువిత్తితే, వడ్లుబండునా।)

9. ఆంగర్ పనిషస్ ఇట్‌సెల్ఫ్ -

**Anger punishes itself**

కోపం తాపదాయకం.

10. ఎ ఉల్ఫ్ ఇన్ షీప్స్ క్లోతింగ్ -

**A wolf in sheep's clothing**

మేకవన్నె పులి (తోడేలు).

11. అన్ ఐడిల్ బ్రెయిన్ ఇస్ ఎ డెవిల్స్ వర్క్‌షాప్ -

**An idle brain is a devil's workshop**

సోమరితల దయ్యాల కొంప.

12. ఆమ్స్ గివింగ్ నెవర్ మేడ్ ఎనీ మేన్ పూర్ -

**Alms giving never made any man poor**

దానం వల్ల దారిద్ర్యం రాదు.

13. ఎ లైట్ పర్స్ ఇస్ ఎ హెవీ కర్స్ -

A light purse is a heavy curse

కలదె దారిద్ర్యమును మించు కలుషమెందు ?

14. ఆఫ్టర్ స్టార్మ్ ఫాలోస్ ది కామ్ -

After storm follows the calm

వాన గురిసి వెలిసినట్లు.

15. ఎ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఇస్ ఎ ఫ్రెండ్ ఇన్‌డీడ్ -

A friend in need is a friend in deed

అక్కర కాదుకొన్నవాడె ఆప్త మిత్రుడు.

B

16. బార్కింగ్ డాగ్స్ సెల్డం బైట్ -

Barking dogs seldom bite

మొరిగే కుక్క కరవదు.

17. బేర్ వర్డ్స్ బయ్ నో బార్లీ -

Bare words buy no barley

మంత్రాలకు చింతకాయలు రాలునా ?

18. బెట్టర్ ఎ స్లిప్ ఆఫ్ ది ఫుట్ ద్యాన్ ఆఫ్ ది టంగ్ -

Better a slip of the foot than of the tongue

కాలుజారితే తీసికోవచ్చుకాని, నోరుజారితే తీసికోలేము.

19. బెట్టర్ హాఫ్ ఏ లోఫ్ ద్యాన్ నో బ్రెడ్ -
Better half a loaf than no bread
గుడ్డికన్న మెల్ల మేలు: లేవి బావకన్న గూనిబావైనా మేలే.

20. బర్డ్స్ ఆఫ్ ఎ ఫెదర్ ఫ్లాక్ టుగెదర్ -
Birds of a feather flock together
ఓగునోగుమెచ్చు.

21. బారోడ్ గార్మెంట్స్ నెవర్ ఫిట్ వెల్ -
Barrowed garments never fit well
ఎరువు సొమ్ము బరువుచేటు.

22. బ్లడ్ ఇజ్ తిక్కర్ దేన్ వాటర్ -
Blood is thicker than water
నీటికన్న నెత్తురు మందం.

23. బెస్ట్ టు బెండ్ ఇట్ వైల్ ట్విగ్ -
Best to bend it while twig
మొక్కై వంగంది మ్రానై వంగునా ?

24. బ్రోకన్ ఫ్రెండ్‌షిప్‌మేబి సోల్డర్డు, బట్ నెవర్ మేడ్ సౌండ్-
Broken friendship may be soldered but never made sound
ఇనుము విరిగెనేవి కరిగి అతకవచ్చుకాని మనసు విరిగె నేవి మరి అతుకనేర్చునా ?

25. బర్న్‌నాట్ యువర్ హౌస్ టు ఫ్రైటన్‌యవే ది మైస్ -
Burn not your house to frighten away the mice
ఎలుకలున్నాయని యింటి కగ్గిపెట్టకు.

C

26. కేర్ అండ్ డిలిజన్స్ బ్రింగ్ లక్ -
Care and diligence bring luck
కష్టే ఫలీ.

27. ఛారిటి బిగిన్స్ ఎట్ హోమ్ -
Charity begins at home
తనకుమాలిన ధర్మము మొదలుచెడ్డ బేరముకూడదు.

28. కెలామిటీ ఇజ్ టచ్‌స్టోన్ ఆఫ్ ఏ బ్రేవ్ మైండ్ -
Calamity is touchstone of a brave mind - ఆపదలందు ధైర్యము పురుషలక్షణము.

29. క్లెన్లినెస్ ఇజ్ నెక్స్ట్ టు గాడ్లినెస్ -
Cleanliness is next to Godliness -
పరిశుభ్రతకు వెనుకనే భగవద్భక్తి.

30. కమింగ్ ఈవెన్ట్స్ కాస్ట్ దేర్ షేడోస్ బిఫోర్ -
Coming events cast their shadows before - చెట్టుచెడుకాలానికి కుక్కమూతి పిందెలు గాచునట : వినాశకాలే విపరీతబుద్ధిః.

31. కన్టెన్ట్‌మెంట్ ఇజ్ కంటిన్యూవల్ ఫీస్ట్ -

Contentment is continual feast
తృప్తింబొందని మనుజుడు సప్తద్వీపములనైనచక్కం బడునే!

32. చేంజ్ అఫ్ ఫార్చ్యూన్ ఇజ్ లాట్ అఫ్ లైఫ్ -

Change of fortune is lot of life
కష్టసుఖాలు కావడికుండలు.

## D

33. డెత్ మీట్స్ ఎవెరివేర్ -

Death meets every where
ఎక్కడికి బోయినా చావుతప్పదు(జాతస్యమరణంధ్రువం)

34. డిలే ఇజ్ డేంజరస్ -

Delay is dangerous
ఆలస్యం అమృతం విషం.

35. డిలిజన్స్ ఇజ్ ది మదర్ అఫ్ గుడ్ ఫార్చ్యూన్ -

Diligence is the mother of good fortune - కష్టే ఫలీ.

36. డిస్టన్స్ లెండ్స్ ఎన్‌చాన్ట్‌మెంట్ టు ది వ్యూ -

Distance lends enchantment to the view - దూరపుకొండలు నునుపు.

37. డ్రాప్ బై డ్రాప్ ది లేక్ ఇజ్ డ్రెయిన్డ్-
Drop by drop the lake is drained
కూర్చునితింటే కొండలుకూడా కరగిపోతవి.

38. డోన్ కౌంట్ చికెన్స్ బిఫోర్ దె ఆర్ హేచ్డ్ -
Don't count chickens before they are hatched - అలూలేదు, చూలూలేదు, కొడుకు పేరు సోమలింగ మన్నట్లుంది.

39. డైమండ్ కట్స్ ది డైమండ్ -
Diamond cuts the diamond
వజ్రం వజ్రేన భిన్నయేత్.

E

40. ఈట్ టు లివ్ బట్ డునాట్ లివ్ టు యీట్ -
Eat to live but do not live to eat
తినడం జీవించటానికేగాని, జీవించడం తినడానికికాదు.

41. ఎమ్టీ వెసల్స్ మేక్ మచ్‌నాయిస్ -
Empty vessels make much noise
నిండుకుండ తొణకదు.

42. ఎవ్వరిబడీ ఇజ్ వైస్ ఆఫ్టర్ ది యివెన్ట్ -
Everybody is wise after the event
దొంగలు పడిన ఆరునెళ్ళకు కుక్కలు మొరిగినట్లు.

43. ఎవ్వరి వై హేస్ ఎ వయర్‌ఫోర్ -
Every why has a wherefore
కారణం లేకుండా కార్యంలేదు; నిప్పులేకుండా పొగలేదు.

44. ఎక్సాంపిల్ ఇజ్ బెటర్ దేన్ ప్రిసెప్ట్ -
Example is better than precept
చెప్పడం కంటె చేసిచూపుట ఉత్తమం.

45. ఎవెరి టైడ్ హాత్ ఇట్స్ఎబ్
Every tide hath its ebb
పెరుగుట విరుగుటకొరకే.

F

46. ఫాల్ట్స్ ఆర్ థిక్ వయర్ లవ్ ఇజ్ థిన్ -
Faults are thick where love is thin
ఇష్టంలేనిచోట కష్టా లెక్కువ.

47. ఫెయిల్యూర్స్ ఆర్ స్టెప్పింగ్ స్టోన్స్ టు సక్సెస్ -
Failures are stepping stones to success – తప్పటడుగులతోనే చక్కగానడిచేది నేర్చుకోవాలి.

48. ఫెటర్స్ దో మేడ్ ఆఫ్‌గోల్డ్ ఆర్ ఫెటర్స్ షిల్ -
Fetters, tho' made of gold, are fetters still– బంగారుసంకెళ్ళుగూడా, సంకెళ్ళే.

49. ఫిష్ ఎండ్ గస్ట్స్ స్మెల్ ఆస్ త్రీ డేస్ ఓల్డ్ -
Fish and guests smell as three days old - విందైనా, మందైనా మూడురోజులు మాత్రమే.

50. ఫాస్టర్ ఎ రేవన్ అండ్ ఇట్ విల్ పెక్ ఔట్ యువర్ ఐస్-
Foster a raven and it will peck out your eyes – పాముకు పాలుబోసి పెంచినా, కరవడం మానదు.

51. ఫ్రండ్‌షిప్ ఇజ్ స్ట్రాంగర్ దేన్ కిండ్రడ్ -
Friendship is stronger than kindred బంధుత్వమునకన్న మైత్రియే బలమైంది.

G

52. గెయిన్ గాట్ బై ఎ లై విల్ బర్న్ ఒన్స్ ఫింగర్స్ -
Gain got by a lie, will burn one's fingers – అన్యాయార్జిత విత్తంవలన అపాయమే కాని మేలులేదు.

53. గివ్ అండ్ స్పెండ్ అండ్ గాడ్ విల్ సెన్డ్ -
Give and spend and God will send– అచ్చెలమనీళ్ళు చల్లిన విచ్చలవిడి నూరుచుండు వినరా వేమా!

54. ఎ గుడ్ గార్డన్ మే హేవ్ సం వీడ్స్ -
A good garden may have some weeds - తులసి వనమున గంజాయి మొలచినట్లు.

55. గ్రేట్ హోస్ట్ స్మాల్ రోస్టు -

Great hoast, small roast
శుష్క ప్రియాలు, శూన్యహస్తాలు.

56. గ్రేట్ షిప్స్ ఆస్క్ డీప్ వాటర్స్ -

Great ships ask deep waters
ఎంత చెట్టు కంత గాలి.

H

57. హ్యాంగింగ్ ఎండ్ వైవింగ్ గో టుగెదర్ -

Hanging and wiving go together
నొసటన్ వ్రాసినవ్రాతకన్న కలదే నూరేండ్లుచింతించినన్.

58. హేస్ట్ మేక్స్ వేస్ట్ -

Haste makes waste - ఆత్రగానికి బుద్ధిమట్టు.

59. హెల్త్ ఇజ్ వెల్త్ -

Health is wealth - ఆరోగ్యమే మహాభాగ్యము.

60. హి హూ బార్న్స ఎ ఫూల్ విల్ నెవర్ బి క్యూర్డ్ -

He who borns a fool will never be cured - పుట్టుకతో పుట్టినబుద్ధి పుడకలతోగూడపోదు.

61. హి హేస్ గాట్ ది ఫిడిల్ బట్ నాట్ ది ఫిడిల్ -

He has got the fiddle, but not the fiddle - అన్నీ ఉన్నవి కాని అయిదవ తనము మాత్రమే లేదు.

62. హోనస్టీ ఇజ్ ది బెస్ట్ పాలిసీ -
Honesty is the best policy
సత్యమే దైవం.

63. హోప్ డెఫర్డ్ మేక్స్ ది హార్ట్ సిక్ -
Hope deferred makes the heart sick
ఆలస్యం అమృతం విషం.

64. హ్యూమిలిటి ఆఫెన్ గెయిన్స్ మోర్ దాన్ ప్రైడ్ -
Humility often gains more than pride – వినయమునను బడయుంబాత్రత!

65. హిపొక్రిటికల్ పైటి ఇజ్ డబుల్ ఇనిక్విటి -
Hypocritcal piety is double inequity – కపటభక్తి కడుంగడు అన్యాయం.

I

66. ఐడిల్‌నెస్ ఇజ్ ది కీ ఆఫ బెగ్గరీ -
Idleness is the key of beggary
బద్ధకానికి బాబు బటా చోరుతనం.

67. ఐడిల్‌నెస్ ఇజ్ ది పేరంట్ ఆఫ్ ఆల్ వైసెస్ -
Idleness is the parent of all vices
బద్ధకానికి బాబు బటా చోరుతనం.

68. ఇఫ్ ఆల్ విష్ టు కమాండ్ హు ఇజ్ టు ఒబే -
If all wish to command, who is to obey - అందరు అందలమెక్కేవారే అయితే మోసే వారెవరు?

69. ఇల్ డీడ్స్ గ్రో అపేస్ -
Ill deeds grow apace - చెడుకు చేవ ఎక్కువ.

70. ఇచ్ అండ్ యీస్ కేన్ నో మేన్ ప్లీస్ -
Itch and ease, can no man please
పుండుమీద కారంచల్లినట్లు.

71. ఇఫ్ విషస్ వెర్ హార్సస్ బెగ్గర్స్ వుడ్ రైడ్-
If wishes were horses beggars would ride - కోరికలు గుఱ్ఱాలైతే, కూలివాండ్లు గూడా గుఱ్ఱమెక్కాలంటారు.

72. ఇన్గ్రాటిట్యూడ్ ఇజ్ ది డాటర్ ఆఫ్ ప్రైడ్ -
Ingratitude is the daughter of pride
గర్వానికి బిడ్డే కృతఘ్నత.

## J

73. జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్ అండ్ మాస్టర్ ఆఫ్ నన్ -
Jack of all trades and master of none
అన్నితెలుసు కాని అంతా అసంపూర్తే.

74. జెలసి బిగెట్త్ రివెంజ్, రివెంజ్ నరిష్షెజెలసి -

Jealousy begetteth revenge, revenge nourisheth jealousy - అసూయ వలన ప్రతీకారబుద్ధి, ప్రతీకారబుద్ధివలన అసూయ జనించును.

75. జాయ్ అండ్ సారో ఆర్ నెక్స్ట్ డోర్ నెయిబర్స్ -

Joy and sorrow are next door neighbours - కష్టసుఖాలు కావడికుండలు.

76. జాయ్ సర్ఫీటెడ్ టర్న్స్ టు సారో

Joy surfeited turns to sorrow
అతి సర్వత్ర వర్జయేత్.

77. జాయ్‌ఫుల్‌నెస్ ఇజ్ ది మదర్ ఆఫ్ వర్ట్యూ -

Joyfulness is the mother of virtue
సంతోషమే సగంబలం.

78. జడ్జ్‌మెంట్ ఇజ్ ది థ్రోన్ ఆఫ్ ప్రూడన్స్ అండ్ సైలెన్స్ ఇజ్ ఇట్స్ సాంక్చుయరి -

Judgement is the throne of prudence and silence is its sanctuary
వివేకానికి శాంతమే శరణ్యం, న్యాయమే ఉన్నతాసనం.

## K

79. కీప్ యువర్ పర్స్ అండ్ యువర్ మౌత్ షట్ -
Keep your purse and your mouth shut - డబ్బుసంచి, నోరుమంచి వెలికిరానీకుము.

80. కిల్ నాట్ ది గూస్ దట్ లేస్ గోల్డన్ ఎగ్స్ -
Kill not the goose that lays golden eggs-బంగారుగ్రుడ్లు పెట్టుతుందని బాతును బలిపెట్టకు.

81. కైండ్‌నెస్ ఇజ్ ది నోబ్లస్ట్ వెపన్ టు కాంక్వర్ విత్ -
Kindness is the noblest weapon to conquer with - చంపదగినయట్టి శత్రుడు చిక్కినేని పొసగమేలుచేసి పొమ్మనుటే చాలు

82. నేవరీ మే సెర్వ్ ఫార్ ఎ టర్న్ బట్ హానస్టీ ఇజ్ బెస్ట్ ఇన్ ది లాంగ్ రన్.
Knavery may serve for a turn, but honesty is best in the long run
తప్పుడుతనం ఎప్పటికి పనికిరాదు.

83. నాలడ్జ్ ఇజ్ పవర్ -
Knowledge is power - విజ్ఞానమే బలము.

## L

84 లేబర్ బ్రింగ్స్ ప్లెజర్ ఇడిల్నెస్ పెయిన్ -
Labour brings pleasure, idleness pain - కృషితో నాస్తి దుర్భిక్షం.

85. లాంబ్ అట్ హోమ్ లయన్ అట్ చేజ్ -

Lamb at home, lion at chase

ఇంట్లో ఈగపులి, బయట పెద్దపులి.

86. లెట్ బైగాన్స్ బి బైగాన్స్ -

Let bygones be bygones - గడచినదానికి వగచు టేల ? గతజలసేతుబంధన మెందుకు ?

87. లెర్నింగ్ మేక్స్ ఎ గుడ్ మేన్ బెటర్ అండ్ ఎ బేడ్ మేన్ వర్స్ -

Learning makes a good man better and a bad man worse - చదువువలన సద్గుణుడు మరింత సద్గుణుడుగాను, దుర్గుణుడు మరింత దుర్గుణుడు నగును.

88. లైక్ మాస్టర్ లైక్ మేన్ -

Like master, like man

యధారాజా, తధాప్రజా.

89. లైక్ ప్రీస్ట్ లైక్ పీపుల్-

Like priest, like people

యధారాజా, తధాప్రజా.

90. లైఫ్ లెస్ ఫాల్ట్ లెస్ -

Life less fault less-చచ్చినవారి కండ్లు చారెడేసి.

91. లుక్ బిఫోర్ యు లీప్ -

Look before you leap

దుమికేముందు, ముందుచూచి దుముకు.

92. లౌ ఇజ్ బ్లైండ్ -

Love is blind - కామాతురాణాం, న భయం న లజ్జా,

తలతురా నిశలం దిశలెన్న ప్రేమికుల్.

M

93. మేక్ హే వైల్ ది సన్ షైన్స్ -

Make hay while the sun shines

దీప ముండగనే ఇల్లు చక్కబెట్టుకొనవలెను.

94. మేన్ ప్రొపోసెస్ గాడ్ డిస్పోసెస్ -

Man proposes, God disposes

తానొకటితలచితే, దైవము మరొకటి తలచినట్లు.

95. మేరీ ఇన్ హేస్ట్ అండ్ రిపెంట్ అట్ లీషర్ -

Marry in haste and repent at leisure

అలవిగాని ఆలిని కట్టుకొని, మురిగిచచ్చెరా ముండా కొడుకు.

96. మెనీ ఏ స్లిప్ ట్వెక్స్ట్ ది కప్ ఎండ్ ది లిప్.

Many a slip 'twixt the cup and the lip - చేతికందినది నోటికందనట్లు.

97. మిస్ఫార్ట్యూన్స్ నెవర్ కం సింగిల్.
Misfortunes never come single
కష్టా లొంటిగారావు.

98. మోడెస్టి యిజ్ ది హ్యాండ్ మెయిడ్ ఆఫ్ వర్ట్యూ -
Modesty is the hand maid of virtue
సకలసద్గుణాలకు వినయమే పట్టుగొమ్మ.

99. మోర్ అఫ్రెయిడ్ దేన్ హర్ట్.
More afraid than hurt
రజ్జు సర్పభ్రాంతి. త్రాడును చూచి పామని భయపడినట్లు.

## N

100. నెససిటీ ఇజ్ ది మదర్ ఆఫ్ ఇన్వెన్షన్.
Necessity is the mother of invention
వసుదేవునంతవాడె అవసరానికి గాడిదకాళ్ళు పట్టుకొన్నాడట.

101. నెససిటీ నోస్ నో లా -
Necessity knows no law - వసుదేవునంతవాడె అవసరానికి గాడిదకాళ్ళు పట్టుకొన్నాడట.

102. నో ఒన్ డైస్ ఆఫ్ త్రెట్స్ -
No one dies of threats -
పిల్లి శాపాలకు ఉట్లు తెగవు.

103. నో పెయిన్స్ నో గెయిన్స్-
No pains, no gains
కష్టపడకుండా కాలైన వంగదు.

104. నతింగ్ వెన్చర్ నతింగ్ హేవ్.
Nothing venture nothing have
వ్రేలు వంచందే వెన్నైనా రాదు.

105. నో స్మోక్ వితోట్ ఫైర్ -
No smoke without fire
నిప్పులేందే. పొగరాదు.

O

106. అబ్జర్వేషన్ ఇజ్ ది బెస్ట్ టీచర్ -
Observation is the best teacher
లోక పరిశీలనకుమించిన గురువు లేదు.

107. ఆయిల్ అండ్ ట్రూత్ విల్ గెట్ అప్పర్మోస్ట్ అట్లాస్ట్-
Oil and truth will get uppermost at last - నిజము దేవుడెఱుగు; నీరు పల్లమెఱుగు

108. ఓల్డ్ మెన్ అర్ ట్వైస్ చిల్డ్రెన్ -
Old men are twice children
వృద్ధాప్యము రెండవ బాల్యము.

109. ఒన్ డెవిల్ ఇజ్ లైక్ అనదర్ -
One devil is like another
దయ్యాలన్నీ ఒకటే.

110. ఒన్ లై మేక్స్ మెనీ -
One lie makes many
ఒక అబద్ధాన్ని ఒప్పించేటందుకు వంద అబద్ధాలాడాలి.

111. ఒన్ మేన్స్ మీట్ ఇజ్ అనదర్ మేన్స్ పాయిసన్ -
One man's meat is another man's poison
లోకో భిన్నరుచిః.

112. ఒపినియన్స్ డిఫర్ -
Opinions differ – లోకో భిన్నరుచిః.

113. ఒన్ ఫ్లవర్ మేక్స్ నో గార్లండ్ -
One flower makes no garland
పదుగు రాడుమాట పాటియైధరజెల్లు; ఒక్కడాడుమాట యెక్కదెందు.

114. ఒన్ స్వాలో మేక్స్ నో సమ్మర్ -
One swallow makes no summer
పదుగు రాడుమాట పాడియై ధరజెల్లు; ఒక్కడాడుమాట యెక్కదెందు.

115. ఒన్ డత్ ది బ్లేమ్ అనదర్ బేర్స్ ది షేమ్ -
One doth the blame, another bears the shame – తప్పొకరిదైతే, దండన మరొకనికి.

116. ఒన్ ఇల్ కాల్స్ అనదర్ -

One ill calls another
కష్టాలు కట్టకట్టుకొనే వస్తాయి.

117. ఒన్ వర్డ్ బ్రింగ్స్ అన్ అనదర్-

One word brings on another
మాటకు మాటతెగులు, నీటికి నాచు తెగులు.

118. ఓపెన్ రెబ్యూక్ యిజ్ బెట్టర్ ద్యాన్ సీక్రెట్ హేట్రెడ్-

Open rebuke is better than secret hatred
పరోక్షంగా ద్వేషించేదానికన్న ప్రత్యక్షంగా తిట్టేవి మేలు.

P

119. పెయిన్ ఇజ్ ఫర్గాటన్ వెన్ గెయిన్ కంస్ -

Pain is forgotten when gain comes
ఫలితముంటె, పాట్లు తెలియవు.

120. పార్డన్ ఇజ్ ది మోస్ట్ గ్లోరియస్ కైండ్ ఆఫ రివెంజ్ -

Pardon is the most glorious kind of revenge - చంపదగినయట్టి శత్రువు తనచేత చిక్కెనేని కీడు సేయరాదు పొసగమేలుచేసి పొమ్మనుటేచాలు.

121. పేషన్స్ ఇజ్ ఎ ప్లాస్టర్ ఫార్ ఆల్ సోర్స్ -

Patience is a plaster for all sores
శాంతమే సకలకష్టనివారణోపాయం.

122. పేషన్స్ ఇజ్ ది బెస్ట్ బక్లర్ అగెయ్‌న్‌స్ట్ అఫ్రాంట్స్ -
Patience is the best buckler against affronts – శాంతమును మించిన సౌఖ్యదాయిని లేదు.

123. ప్యాషన్ ఎవాపొరేట్స్ బై వర్డ్స్ అస్ గ్రీఫ్ డస్ బై టియర్స్ -
Passion evaporates by words as grief does by tears - మాటలతో మచ్చరం, కన్నీటితో కష్టం మాయమవుతవి.

124. పెన్ ఇజ్ మైటియర్ దేన్ స్వార్డ్ –
Pen is mightier than sword
ఖడ్గానికన్న కలమే బలమైంది.

125. పెన్నీ వైస్ పౌండ్ ఫూలిష్-
Penny wise, pound foolish – గుమ్మడికాయ పోయేదారి తెలియక ఆవగింజకు ఆరాటపడినట్లు.

126. ప్రాక్టీస్ ఇజ్ బెటర్ దేన్ ప్రిసెప్ట్ -
Practice is better than precept
చెప్పేదానికన్న చేసేది మేలు.

127. ప్రాక్టిస్ మేక్స్ పెర్ఫెక్ట్ -
Practice makes perfect – అభ్యాసంకూసువిద్య.

128. ప్రైడ్ గోస్ బిఫోర్ ఎ ఫాల్ -
Pride goes before a fall - గర్వం పతనహేతువు.

129. ప్రామిస్ లిటిల్ పెర్ఫార్మ్ మచ్ -
Promise little, perform much–ఇస్తానని వేయి మార్లు చెప్పేదానికన్న యిచ్చేది ఒక్కతూరైనా మేలు.

Q

130. క్వారల్స్ ఆర్ యీజిలీ బిగన్ బట్ విత్ డిఫికల్టీ ఎండెడ్-
Quarrels are easily begun, but with difficulty ended – కలహాలు సులభముగానే ఆరంభమైనా, యెంతో కష్టంమీదగాని ముగియవు.

131. క్వెంచ్ నాట్ హోప్, ఫార్ వెన్ హోప్ డైస్, ఆల్ డైస్-
Quench not hope, for when hope dies, all dies – ఆశతోనే మానవుడు జీవిస్తున్నాడు.

R

132. రెస్పెక్ట్ ఎ మేన్ హి విల్ డూ ది మోర్ -
Respect a man, he will do the more మనిషిని గౌరవించేకొలది, ఘనకార్యము లధికముగా చేస్తాడు.

133. రెలిజన్ ఇజ్ ది బెస్ట్ ఆర్మర్ బట్ ది వర్స్ట్ క్లోక్ -
Religion is the best armour, but the worst cloak – మతమంత మంచికవచం, మూర్ఖమైన ముసుగు మరొకటి లేదు.

134. రెస్టివ్ హార్సస్ మస్ట్ బి రఫ్లీ డెల్ట్‌విత్.
Restive horses must be roughly dealt with - తంటాలమారిగొడ్డుకు తాపులే తగలాలి.

135. రివెంజ్ ఇజ్ ది ఒన్లీ డెట్ విచ్ యిజ్ రాంగ్‌టు పే -
Revenge is the only debt which is wrong to pay - ప్రతీకారబుద్ధి కూడదు.

136. రోం వాస్ నాట్ బిల్ట్ ఇన్ ఎ డే -
Rome was not built in a day - ఎంత కష్ట పడినా, స్వల్పకాలంలో గొప్పపనులు కాజాలవు.

S

137. స్యాడ్నెస్ ఎండ్ గ్లాడ్‌నెస్ సక్సీడ్ ఈచ్ అదర్ -
Sadness and gladness succeed each other రాత్రివెనుక పగలు, పగలువెనుక రాత్రి.

138. సాస్ ఫార్ ది గూస్ ఇజ్ నాట్‌సాస్ ఫార్ ది గాండర్
Sauce for the goose is not sauce for the gander - లోకోభిన్నరుచిః.

139. సేయింగ్ అండ్ డూయింగ్ ఆర్ టూ థింగ్స్ -
Saying and doing are two things చెప్పేది, చేసేదివేర్వేరు. ఊరక చెప్పేదానికన్నా, చేసి చూపిస్తేనే గొప్ప.

140. సే వెల్ ఇజ్ గుడ్ బట్ డు వెల్ ఇజ్ బెటర్ -
Say well is good, but do well is better
చెప్పేది, చేసేది వేర్వేరు. ఊరక చెప్పేదానికన్న, చేసి చూపిస్తేనే గొప్ప.

141. సెట్ యువర్ సెయిల్ అకార్డింగ్ టు ది విండ్ -
Set your sail according to the wind
ఏ యెండ కా గొడుగు పట్టాలి.

142. స్పేర్ ది రాడ్ అండ్ స్పాయిల్ ది చైల్డ్ -
Spare the rod and spoil the child
కొట్టకుండా, చదువెట్లావస్తుంది? కోల ఆడకుండా, కోతి ఆడుతుందా?

143. స్పీచ్ ఇజ్ సిల్వర్ అండ్ సైలెన్స్ ఇజ్ గోల్డన్ -
Speech is silver, and silence is golden
వాగేదానికన్న ఊరకుండేదే మేలు.

144. స్ట్రైక్ వైల్ ది ఐరన్ ఇజ్ హాట్ -
Strike while the iron is hot
దీపముండగానే యిల్లు చక్కబెట్టాలి.

145. సస్పిషన్ ఆల్వేస్ హాంట్స్ ది గిల్టీ మైండ్ -
Suspicion always haunts the guilty mind - అనుమానం అనర్థహేతువు.

146. సస్పీషన్ హాస్ డబుల్ ఐస్ -
Suspicion has double eyes
అనుమానం అనర్థహేతువు.

147. సస్పీషన్ ఇజ్ ది పాయ్సన్ ఆఫ్ ఫ్రెండ్షిప్ -
Supicion is the poison of friendship
అనుమానం అనర్థహేతువు.

T

148. టేక్ కేర్ ఆఫ్ ది పెన్స్, ది పౌండ్స్ విల్ టేక్ కేర్ ఆఫ్ థెంసెల్వ్స్ -
Take care of the pence, the pounds will take care of themselves - దమ్మిడి, దమ్మిడి చేరిస్తేనే రూపాయి అవుతుంది.

149. టేక్ ఎ వైన్ ఆఫ్ ఎ గుడ్ సాయిల్ అండ్ ఎ డాటర్ ఆఫ్ ఎ గుడ్ మదర్ -
Take a vine of a good soil and a daughter of a good mother - పంటను చూచి పొలము, పాడినిచూచి బర్రెను, తల్లినిచూచి పిల్లను ఎన్నుకోవాలె.

150. టేక్ ది చెస్ట్నట్స్ ఔట్ ఆఫ్ ది ఫైర్ విత్ ఎ కేట్స్పా -
Take the chestnuts out of the fire, with a cat's paw - సవితిబిడ్డ చేతితో సంగటి కలియ బెట్టినట్లు.

151. ది ఆంగర్ ఆఫ్ ఎ గుడ్ మాన్ ఇజ్ ది హార్డస్ట్ టు బేర్ -
The anger of a good man is the hardest to bear – సాధుకోపము చాలా పెద్దది.

152. ది బెస్ట్ ఫిజిషియన్స్ ఆర్ డాక్టర్ డయట్, డాక్టర్ క్వయట్ అండ్ డాక్టర్ మెర్రీమేన్ -
The best physicians are Dr. Diet, Dr. Quiet and Dr. Merryman – మంచి ఆహారం, మనోశాంతి, మనోల్లాసాన్ని మించిన మందులు లేవు.

153. ది కేట్ ఇజ్ ఔట్ ఆఫ్ ది బ్యాగ్ -
The cat is out of the bag – నిజము దాగదు.

154. ది చాంబర్ ఆఫ్ సిక్‌నెస్ ఇజ్ ది చాపెల్ ఆఫ్ డివోషన్-
The chamber of sickness is the chapel of devotion – ఆపద మ్రొక్కులు; శ్మశాన వైరాగ్యము; ప్రసూతి వైరాగ్యము.

155. ది ఛైల్డ్ ఇజ్ ది ఫాదర్ ఆఫ్ ది మేన్ -
The child is the father of the man
పువ్వుమీది రంగులు పుట్టుకతోనే పొడసూపుతవి.

156. టు కాయిన్ మోస్ట్ ఇజ్ ఫ్లాటరీ -
To coin most is flattery - ముఖస్తుతికి ఎపుడు మోపంలేదు.

157. ది డేంజర్ పాస్ట్ అండ్ గాడ్ ఇజ్ ఫర్గాటన్ -
The danger past and God is forgotten
ఏరు దాటితే, తెప్ప తగలేసినట్లు.

158. ది డెవిల్ కోట్స్ ది స్క్రిప్చర్ -
The devil quotes the scripture
దయ్యం ధర్మపన్నాలు వల్లించినట్లు.

159. ది యెర్తన్ పాట్ మస్ట్ కీప్ క్లియర్ ఆఫ్ ది బ్రాస్ కెటిల్-
The earthen pot must keep clear of the brass kettle – ఉద్ధతులమధ్య పేదల కుండతరమె ?

160. ది ఫాల్ట్ ఆఫ్ ది ఆస్ మస్ట్ నాట్ బి లెయిడ్ ఆన్ ది పేక్ సాడిల్ -
The fault of the ass must not be laid on the pack saddle - ఆడలేనమ్మ మద్దెలమీది ఆడి పోసికొందట.

161. ది ఫూల్ ఇజ్ బిజీ విత్ ఎవ్వరిబడీస్ బిజినెస్ బట్ హిస్ ఓన్
The fool is busy with everybody's business but his own – పనిలేని మంగలి పిల్లితల గొరిగినాడట.

162 ది రాటన్ ఆపిల్ ఇన్జూర్స్ ఇట్స్ నెయిబర్స్ -
The rotten apple injures its neighbours
కూసేగాడిద పోయి మేసేగాడిదను చెరిచినట్లు.

163. ది సర్వెంట్ ఆఫ్ ఎ కింగ్ ఇజ్ ఎ కింగ్ -
The servant of a king is a king
దేవుడు వరమిచ్చినా, పూజారి పడనీయడు.

164. ది వైన్ ఇజ్ ది మాస్టర్స్, ది గుడ్‌నెస్ ఆఫ్ ఇట్ ఇజ్ ది బట్లర్స్ -
The wine is the master's, the goodness of it is the butler's
దేవుడు వరమిచ్చినా, పూజారి పడనీయడు.

165. ది టంగ్ టాక్స్ అట్ ది హెడ్స్ కాస్ట్ -
The tongue talks at the head's cost
వేయివరహాలుచేసే తల నాడించవచ్చుకాని, గవ్వచేయ లేని నాలుక నాడించరాదు.

166. టైమ్ అండ్ టైడ్ వెయిట్ ఫార్ నన్ -
Time and tide wait for none
అయ్యవచ్చేదాక అమావాస్య ఆగదు.

167. టిట్ ఫార్ టాట్ -
Tit for tat – బదులుకు బదులు;
కాలెత్తితే కర్రెత్తినట్లు.

168. టు యాడ్ ఫ్యూయల్ టు ది ఫైర్ -
To add fuel to the fire - అగ్నిమీద అజ్యము పోసినట్లు; అగ్నికి గాలి తోడైనట్లు.

169. టు బిల్డ్ క్యాసిల్స్ ఇన్ ది యేర్ -
To build castles in the air
గాలిమేడలు కట్టినట్లు.

170. టు డాన్స్ టు ఎవ్వరీ మేన్స్ పైప్ -
To dance to every man's pipe
ఎవరెట్లా ఆడిస్తే అట్లా ఆడడమే.

171. టు ఎర్ ఇజ్ హ్యూమన్, టు ఫర్గివ్ డివైన్ -
To err is human, to forgive divine
ప్రమాదో ధీమతామటి.

172. టు రాబ్ పీటర్, టు పే పాల్ -
To rob Peter, to pay Paul
కాకులనుగొట్టి గ్రద్దలకేసినట్లు.

173. టూ మెనీ కుక్స్ స్పాయిల్ ది బ్రాత్ -
Too many cooks spoil the broth
వంటవాండ్లు ఎక్కువైతే, వంటచెడుతుంది

174. టూ మచ్ ఫెమిలియారిటి బ్రీడ్స్ కంటెమ్ప్ట్ -
Too much familiarity breeds contempt
అతిపరిచయంకూడదు; సరసము విరసముకొరకే.

175. ట్రూత్ మే లాంగిష్ బట్ కేన్ నెవర్ పెరిష్ -
Truth may languish but can never perish - సత్యమెప్పటికి చావదు.

176. ట్రూత్ ఫైన్డ్స్ ఫోస్ వయర్ ఇట్ మేక్స్ నన్ -
Truth finds foes, where it makes none
నిజమాడితే నిష్ఠూరంతప్పదు; యథార్థవాది లోకవిరోధి.

177. టూ బ్లాక్స్ మేక్ నో వైట్ -
Two blacks make no white
రెండుతప్పులు ఒక ఒప్పుకావు.

178. ది వాయిస్ ఆఫ్ ది పీపిల్ ఇజ్ ది వాయిస్ ఆఫ్ గాడ్ -
The voice of the people is the voice of God - ప్రజలవాక్కు (బాలవాక్కు) బ్రహ్మవాక్కు.

U

179. అన్ఇన్వైటెడ్ గస్ట్స్ సిట్ ఆన్ థార్న్స్ -
Uninvited guests sit on thorns
పిలువని పేరంటానికి పోరాదు.

180. యూనియన్ ఇజ్ స్ట్రెన్గ్త్ -
Union is strength - కలసివుంటే కలదుసుఖము.

V

181. వౌవ్స్ మేడ్ ఇన్ స్టార్మ్స్ ఆర్ ఫర్గాటన్ ఇన్ కాంమ్స్-
Vows made in storms are forgotten in clams - ఏరుదాటి తెప్పతగలేసినట్లు.

## W

182. వేస్ట్‌నాట్ వాన్ట్‌నాట్ -
Waste not, want not
అదుపు పొదుపులేని మనిషికి అవసరానికి యేమిఉండదు.

183. వెల్‌కం ఇజ్ ది బెస్ట్ చీర్ -
Welcome is the best cheer
అన్నరసంకన్న, ఆదరణరసమే ఆనందదాయకం.

184. వాట్ కెనాట్ బి క్యూర్డ్ మస్ట్ బి ఎన్డ్యూర్డ్ -
What cannot be cured must be endured
బాగుగాని బాధ భరింపకతప్పదు.

185. వాట్ మైసర్స్ హేవ్‌హోర్డడ్ దివికెడ్ విల్ కన్స్యూమ్ -
What misers have hoarded the wicked will consume - చీమలు పెట్టినపుటలు, పాములకిర వైనయట్లు; పాసిపండ్లవాడు సంపాదిస్తే, బంగారుపండ్ల వాడు పాడుచేశాడట!

186. వెన్ బ్రెడ్ ఇజ్ వాన్టింగ్ ఓటన్ కేక్స్ ఆర్ ఎక్సలెంట్ -
When bread is wanting oaten cakes are excellent - గతిలేనమ్మకు గంజే పానకం.

187. వెన్ పావర్టీ కమ్స్ ఇన్ అట్ ది డోర్స్ లౌ లీప్స్ ఔట్ అట్ ది విండోస్ -
When poverty comes in at the doors, love leaps out at the windows -
లేమిడి యింట్లో చేరితే ప్రేముడి బయటికి పారుతుంది.

188. వాన్ట్ మేక్స్ స్ట్రైఫ్ ట్విక్స్ట్ మేన్ అండ్ వైఫ్ -

Want makes strife twixt man and wife
లేమివలన భార్యాభర్తలమధ్య ప్రేముడి నశిస్తుంది.

189. వెన్ వైన్‌సింక్స్ వర్డ్స్ స్విమ్ -

When wine sinks words swim
త్రాగుడు బోతుకు వాగుడు బోతుతన మెక్కువ.

190. వెన్ యు ఆర్ అన్ అన్విల్ హోల్డ్ యు స్టిల్. వెన్ యు ఆర్ ఎ హేమర్ స్ట్రైక్ యు ఫిల్ -

When you are an anvil hold you still, when you are a hammer strike you fill
ఎప్పటి కెయ్యదిప్రస్తుత, మప్పటికామాటలాడి, అన్యుల మనముల్ నొప్పింపక తానొవ్వక, తప్పించుక తిరుగు వాడు ధన్యుడు.

191. వెన్ యు ఆర్ ఇన్ రోం డు అస్ ఎ రోమన్ డస్ -

When you are in Rome do, as a Roman does – దేశకాలపాత్రోచితముగా ప్రవర్తించాలి.

192. వయర్ ఇగ్నోరెన్స్ ఇజ్ బ్లిస్ ఇట్ ఇజ్ ఫాలీ టు బివైస్-

Where ignorance is bliss it is folly to be wise - అనువుగానిచోట అధికుల మనరాదు.

193. వయర్ వెల్త్ ఇజ్, దేర్ ఫ్రండ్స్ ఫాలో -

Where wealth is, there friends follow
ఎప్పుడు సంపదగిలిగిన అప్పుడు బంధువులువత్తురు:
బెల్లమున్నచోటికి చీమలు చేరును.

194. వైల్ దేర్ ఇజ్ లైఫ్ దేర్ ఇజ్ హోప్.
While there is life there is hope
ప్రాణాలున్నంతవరకు ఆశతప్పదు.

195. విమెన్ లాఫ్ వెన్ దెకేన్ అండ్ వీప్ వెన్‌దెవిల్.
Women laugh when they can, and weep when they will – ఆడవాండ్లు 'ఆ' అంటే ఏడుస్తారు, 'ఊ' అంటే నవ్వుతారు.

196. వర్త్ విథౌట్ వెల్త్ ఇజ్ ఎ గుడ్ సెర్వంట్ ఔట్ ఆఫ్ ప్లేస్.
Worth without wealth is a good servant out of place–డబ్బులేనివాడు, దుబ్బుకుకొరగాడు; ధనములేని పూజ్యత, ఊరలేని పనిమనిషి ఒకటే.

Y

197. యు ఆర్ ఎ ఫూల్ టు స్టీల్ ఇఫ్ యు కాన్ట్ కన్సీల్.
You are a fool to steal if you can't conceal – చేతగాని దొంగతనం చేయవద్దు.

198. యు కాన్ట్ సెల్ ది కౌ అన్డ్ హేవ్ హర్ మిల్క్ టూ.
You can't sell the cow and have her milk too – అవ్వగావాలి, బువ్వాకావాలి అంటే ఎట్లా సాధ్యమౌతుంది?

199. యు మే నో బై ఎ హ్యాన్డ్‌ఫుల్ ది హోల్ సేక్ -
You may know by a handful the whole sack - మెతుకుబట్టి చూస్తే అన్నముడికింది లేనిది తెలుస్తుంది.

200. యు షౌట్ అండ్ ఐ షౌట్ హు షల్ కేరీ ది డర్ట్ ఔట్-
You shout and I shout who shall carry the dirt out - ఇద్దరం లేవలేనివాండ్లమే అయితే పనులెట్లా అవుతవి?

201. యన్గ్ మెన్ మే డై, ఓల్డ్‌మెన్ మస్ట్.
Young men may die, old men must
యువకులు చావవచ్చు, వృద్ధులు చావక తప్పదు.

202. యూత్ అండ్ ఏజ్ విల్ నెవర్ అగ్రీ -
Youth and age will never agree -
యువకులకు, వృద్ధులకు మధ్య యెప్పుడు పొసగదు.

203. యూత్ అండ్ వైట్ పేపర్ టేక్ ఎనీ ఇంప్రెషన్.
Youth and white paper take any impression - మొక్కై వంగంది మ్రానై వంగుతుందా।

Z

204. జీల్ విథౌట్ నాలెడ్జ్ ఇజ్ ఫైర్ విథౌట్ లైట్-
Zeal without knowledge is fire without light - ఉత్సాహము వెలుగులేని నిప్పు.



# 49. Grammar - గ్రామర్

## వ్యాకరణాంశములు

ప్రపంచమందలి అన్ని భాషలలోను, తప్పులు లేకుండా వ్రాయుటకు, సంభాషించుటకు కొన్ని నియమములు గలవు. ఇట్టి భాషానియమములను గురించి తెలుపు శాస్త్రమునకే వ్యాకరణశాస్త్రమని పేరు,

ప్రతిభాష పదముల సముదాయము. మనము మన మనసులోని భావములను యితరులకు తెలుపుటకు కొన్ని పదములను కలిపి మాట్లాడుదుము. అట్టి మనభావమును యితరులకు అర్థమగునట్లు తెలుపు పదసముదాయములేక పదముల కలయికకు వాక్యము అని మనము తెలుగులో అందుము. ఆంగ్ల భాషలో వాక్యమునకు 'Sentence' అని అందురు.

1. Boys go to school - బాలురు పాఠశాలకుపోదురు.

ఈ మాటల లేక పదముల సముదాయానికి వాక్యమని పేరు. ఈ వాక్యములో రెండు ముఖ్యమైన భాగములు గలవు. పై వాక్యము ఎవరినిగురించి చెప్పుచున్నదో, ఆ 'బాలురు' (Boys) అనునది మొదటి భాగము. వాక్యములోని యీ మొదటి భాగమునకు తెలుగులో 'కర్త' అని ఆంగ్లములో 'సబ్జెక్ట్' (Subject) అని పేరు.

ఈ కర్తయగు బాలురను గురించి వాక్యములోని "go to school" అను రెండవ భాగము తెలుపుచున్నది. ఈ భాగమునకు ఆంధ్రములో క్రియ అనియు, ఆంగ్లములో 'ప్రెడికేట్' (Predicate) అనియు అందురు.

| Subject (కర్త) | Predicate (క్రియ) |
|---|---|
| Sri Rama | married Sita. |
| శ్రీరాముడు | సీతను పెండ్లాడెను. |

ఈ పైవాక్యములో 'శ్రీరాము' అనునది Subject; 'married Sita' అనునది Predicate.

'ఈపైని' 'married Sita' అనే రెండు పదములలో 'married' అనుపదము క్రియా (Predicate) భాగములోని ముఖ్యమైనపదము. మిగిలిన 'Sita' అనే పదము 'married' అను క్రియా (Predicate) పదమునకు కర్మ అని తెలుగులో చెప్పబడును. దీనినే ఆంగ్లములో 'Object' అని అందురు.

## EXERCISE (ఎక్సర్సైజ్)

### 1-వ అభ్యాసము

I. ఈ క్రింది వాక్యములలో 'Subject, Predicate, Object' భాగములను విడదీసి వ్రాయుము :—

1. Sri Krishna killed Kamsa.
2. Balarama married Revati.
3. He gave a book.
4. Narasimham got a prize.
5. Sastri opened a shop.

II. ఈ క్రింది వాక్యములలో ఖాళీభాగములను పూర్తిచేసి అవి యే భాగములో గుర్తింపుము :—

1. ————works sums.
2. Women————food.
3. Men write———
4. Sri Krishna married———
5. The teacher———the boys.
6. ———gives milk.

III. నీకు తెలిసిన కొన్ని వాక్యములను వ్రాయుము.

# 50. The Parts of Speech

(ది పార్ట్స్ ఆఫ్ స్పీచ్)

## భాషాభాగములు

ఆంధ్రభాషలోవలె ఆంగ్లభాషలోకూడ వాక్యములోని ఒక్కొక్క పదమునకు, ఆ పదము ఆ వాక్యములో చేయు పనినిబట్టి, ఒక్కొక్క పేరు కలదు. వాటికే 'భాషాభాగములు' (Parts of speech) అని పేరు. అవి యెనిమిది :—

1. నౌన్ - Noun - నామవాచకము లేక విశేష్యము
2. ప్రొనౌన్ - Pronoun - సర్వనామము.
3. వెర్బ్ - Verb - క్రియ.
4. అడ్జెక్టివ్ - Adjective - విశేషణము.
5. అడ్వెర్బ్ - Adverb - క్రియావిశేషణము.
6. ప్రిపోసిషన్ - Preposition - విభక్తి అర్థమిచ్చే ఉపసర్గము.
7. కంజంక్షన్ - Conjunction - సంయోగపదము.
8. ఇంటర్జెక్షన్ - Interjection - ఆశ్చర్యార్థకము.

ఈ యెనిమిదేకాక A, An, The, అనే పదములు తఱుచు ఆంగ్లభాషలో వాడుకయందున్నవి. వీటికి 'ఆర్టికల్స్' (Articles) అని పేరు. వీటి నన్నిటిని గురించి విపులముగా యీ క్రింది పాఠములలో తెలియజేయబడును.

# 51. Noun (నౌన్)

## నామవాచకము (విశేష్యము)

ప్రపంచములోగల ప్రతి మనిషికి, ప్రతివస్తువుకు గల పేర్లన్నియు నామవాచకము (Noun) లే.

కృష్ణుడు - Krishna - ఒకమనిషి పేరు.
బాయ్ - Boy - బాయిని పిలిచే ఆంగ్లనామం.
కావేరి - Cauvery - ఒకనది పేరు
రివర్ - River - నదికి ఆంగ్లనామం.
మద్రాసు - Madras - ఒక నగరం పేరు.
సిటీ - City - నగరానికి ఆంగ్లనామం.
క్రౌడ్ - Crowd - ఎంతమందో కూడిన జనాలగుంపు పేరు.
గోల్డ్ - Gold - ఒకవస్తువు లేక పదార్థం పేరు.
స్ట్రెంగ్త్ - Strength - బలము అనే కంటికి కనబడని ఒక శక్తి లేక గుణము పేరు.

ఈ విధముగా ప్రపంచములోగల ప్రతి పదార్థమునకు, ప్రతి భాషలోను యేదో ఒక నామం ఉన్నది. కనుక నామం తెలిపే పదమునకు తెలుగులో 'నామవాచక'మని, ఆంగ్లములో 'Noun' - అని వ్యాకరణము పేరు.

### 2-వ అభ్యాసము

1. ఈ క్రింది పదాలలో Nouns ను ఎత్తి వ్రాయుము:
(Pick out nouns in the following words) :—

mother, beat, man, murder, Chair, Cup, Cat, slowly, teacher, school, go, girls, and, on, Ah, Rukmini, Kurnool, Cuddapah, Narayana, big, small, come, Curry, Cow.

## 52. Kinds of nouns (కైండ్స్ ఆఫ్ నౌన్స్)
## వివిధములైన విశేష్యములు

ఉమన్ - Woman - స్త్రీ.

కమలమ్మ - Kamalamma - ఆ స్త్రీ పేరు.

క్రౌడ్ - Crowd - గుంపు.

ఆంగర్ - Anger - కోపము.

ఐరన్ - Iron - ఇనుము.

ఈ పై పదములన్నియు నామవాచకములే. 'ఇందులో మొదటిపదము 'ఉమన్' (Woman) అంటే స్త్రీజనానికంతా సాధారణముగాచెల్లే నామం. కనుక అట్లు ఒకజాతికో, ఒక శాఖకో, సర్వసామాన్యంగా చెల్లేనామం 'సామాన్య లేక సాధారణ నామవాచకము'. దీనినే ఆంగ్లములో 'కామన్ నౌన్' (Common Noun) అని అందురు.

'కమలమ్మ' (Kamalamma) అనే రెండవపదం ఒక స్త్రీనామం. అది ఆ ఒక స్త్రీకే ప్రత్యేకముగా చెల్లెడు నామం. ఇట్లు ప్రత్యేకముగా, యే ఒక్కరికో చెందే నామమునకు ఆంధ్రములో 'సంజ్ఞానామవాచక' మని పేరు. దీనినే ఆంగ్లములో 'ప్రాపర్ నౌన్' (Proper Noun) అని అందురు.

'క్రౌడ్' (Crowd) అనే మూడవపదం కొంతమంది జనులగుంపు లేక సమూహమునకు నామం. అట్లే కొన్నిగొర్రెల గుంపు లేక సమూహానికి 'ఫ్లాక్' (Flock) అని అంటారు.

ఇట్లు సమూహార్థము తెలిపే నామవాచకాలకు ఆంగ్ల భాషలో 'కలెక్టివ్ నౌన్స్' (Collective Nouns) అని అందురు.

'ఆంగర్' (Anger) అనే నాల్గవపదము కంటికి కనబడని ఒకస్థితిని లేక గుణమును తెలుపును. అట్లనే చీకటి అనే అర్ధమిచ్చే డార్క్‌నెస్ (Darkness). ఆట, అని అర్ధమిచ్చే ప్లే (Play) మొదలగు కంటికగపడని, ఊహకుమాత్రమందే గుణ నామములన్నియు ఆంగ్లములో 'అబ్‌స్ట్రాక్ట్ నౌన్స్' (Abstract Nouns) అని అందురు.

'అయిరన్' (Iron) అనే అయిదవ పదము ఇనుము అనే పదార్థానికి ఆంగ్లనామము. ఇటువంటి పదార్థముల పేర్లే రైస్ (Rice), సాల్ట్ (Salt), గోల్డ్ (Gold), ఆయిల్ (Oil), టీ (Tea) మొదలగునవి. ఇట్లు పదార్థముల పేర్లన్నియు ఆంగ్లములో 'మెటీరియల్ నౌన్స్ (Material Nouns) అని అందురు.

ఇట్లు నౌనులు 1 కామన్‌నౌన్స్ (Common Nouns). 2. ప్రాపర్ నౌన్స్ (Proper Nouns). 3. కలెక్టివ్ నౌన్స్ (Collective Nouns). 4. అబ్‌స్ట్రాక్ట్ నౌన్స్ (Abstract

Nouns) ౫. మెటీరియల్ నౌన్స్ (Meterial Nouns) అవి అయిదు విధములు.

### ౩-వ అభ్యాసము

ఈ క్రింది నామవాచకము లేవేవి యేరకం నామవాచకములో తెలుపుము;—

Knowledge, Mountain, Mahanadi, Sita, Hills, Darkness, Dogs, Himalayas, Silver, Students, Cotton, Silk, Sanjiviah, Fleet, Flock, Cows, Asses, Herd, Glass.

# 53. Nouns and Number
(నౌన్స్ ఎండ్ నంబర్)

## నామవాచకములు - వచనము

ఆంధ్రములో ఒకవస్తువునుగురించి తెలుపు నామవాచకము 'ఏకవచనమ'ని. ఒకటికన్న ఎక్కువ సంఖ్యగల వస్తువులు తెలుపు నామవాచకము 'బహువచనమ'ని చెప్పునట్లు ఆంగ్లములో ఒక వస్తువుగురించి తెలుపు నామవాచకమునకు 'సింగ్యులర్ నంబర్' (Singular Number) అనియు, ఒకటికి మించిన వాటిని తెలిపే నామవాచకమునకు 'ప్లూరల్ నంబర్' (Plural Number) అనియు అందురు.

| Singular Number (ఏక వచనము) | | Plural Number (బహు వచనము) | |
|---|---|---|---|
| Boy - | బాలుడు | Boys - | బాలురు |
| Girl - | బాలిక | Girls - | బాలికలు |
| Man - | మనుష్యుడు | Men - | మనుష్యులు |
| Cap - | టోపి | Caps - | టోపీలు |
| Cat - | పిల్లి | Cats - | పిల్లులు |
| Dog - | కుక్క | Dogs - | కుక్కలు |
| Class - | తరగతి | Classes - | తరగతులు |
| Mango - | మామిడి పండు | Mangoes - | మామిడిపండ్లు |

| Singular Number (ఏక వచనము) | | Plural Number (బహు వచనము) | |
|---|---|---|---|
| Story - | కథ | Stories - | కథలు |
| Knife - | కత్తి | Knives - | కత్తులు |
| Thief - | దొంగ | Thieves - | దొంగలు |
| Roof - | ఇంటి పైకప్పు | Roofs - | ఇంటిపైకప్పులు |
| Foot - | పాదము | Feet - | పాదములు |
| Ox - | ఎద్దు | Oxen - | ఎద్దులు |
| Son-in-law - | అల్లుడు | Sons-in-law - | అల్లుండ్రు |

పై నామవాచకపదములలో మొదటి వరుసలోనివి ఏక వచనములు (Singular Number) గాను, రెండవ వరుస లోనివి బహువచనములు (Plural Number) గాను ఉన్నవి. సాధారణముగా 'Boy, Pen, Cat, Dog, Cap, Girl' మొదలగు అనేక ఏకవచన నామవాచకము (Nouns) లకు కడపట 'S' చేర్చుటవలన బహువచనము (Plural Number) ఏర్పడుచున్నది.

ఉదా Book-Books; Chair-Chairs; Table-Tables; State-States; Teacher-Teachers.

ఇట్లు సాధారణరీతిగా గాకుండ, యితర అసాధారణ రీతులలో ఏకవచన (Singular) నామవాచకములు బహు వచన (Plural) నామవాచకములు అగుట కూడా కలదు.

1. ఏకవచనములోని నామవాచకము (Singular Nouns) లకు కడపట S, Sh, Ch, X, Z, O, ఉండిన యెడల ('S' కు బదులు) 'es' చేర్చిన బహువచనమేర్పడును.

| | | Singular | Plural |
|---|---|---|---|
| ఉ॥ ఆస్ | - | Ass | Asses |
| క్లాస్ | - | Class | Classes |
| డిష్ | - | Dish | Dishes |
| బుష్ | - | Bush | Bushes |
| బెంచ్ | - | Bench | Benches |
| మ్యాచ్ | - | Match | Matches |
| ఫాక్స్ | - | Fox | Foxes |
| బాక్స్ | - | Box | Boxes |
| టోపాజ్ | - | Topaz | Tapazes |
| హీరో | - | Hero | Heroes |
| పొటేటో | - | Potato | Potatoes |

2. 'Y' చివరగల నామవాచకములలో ఆ Y కి ముందు అచ్చు (Vowel) ఉన్నయెడల సాధారణరీతిగా 'S' తోనూ, హల్లు (Consonant) ఉన్నయెడల మాట చివరగల 'Y' కు బదులు i వచ్చి ఆ 'i' తో 'es' చేరి బహువచనమేర్పడును.

| Singular | | Plural |
|---|---|---|
| ఉ॥ కీ Key | - తాళముచెవి | Keys |
| టాయ్ Toy | - బొమ్మ | Toys |
| రే Ray | - కిరణము | Rays |
| గయ్ Guy | - మోకు | Guys |
| డే Day | - దినము | Days |
| మంకీ Monkey | - కోతి | Monkeys |

(ఈపదములన్నిటిలోను చివరగల 'Y' కి ముందు అచ్చులుగలవు) - అందువలన ఆ 'Y' కి ప్రక్కన 'S' చేర్చితే Plural ఏర్పడుచున్నది.

| | | |
|---|---|---|
| బేబి Baby | - పాప | Babies |
| స్టోరి Story | - కథ | Stories |
| ఫ్లై Fly | - ఈగ | Flies |
| బాడీ Body | - దేహము | Bodies |
| ఆర్మీ Army | - సేన | Armies |
| కంట్రీ Country | - దేశము | Countries |

ఈ నామవాచకము లన్నిటికి కడపటగల 'Y' ముందు హల్లు ఉన్నది. అందువలన ఆ 'Y' కి బదులు Plural లో 'ies' వచ్చినది.

3. 'F' 'Fe' చివరగల ఆంగ్ల నామవాచక పదము (Noun) లకు ఆ 'F' 'Fe' కి బదులు 'V' వచ్చి దానితో 'es' చేరి బహువచనము (Plural) ఏర్పడును.

| Singular | Plural |
|---|---|
| లీఫ్ Leaf - ఆకు | లీవ్స్ Leaves - ఆకులు |
| షెల్ఫ్ Shelf - బీరువా | షెల్వ్స్ Shelves - బీరువాలు |
| థీఫ్ Thief - దొంగ | థీవ్స్ Thieves - దొంగలు |
| వైఫ్ Wife - భార్య | వైవ్స్ Wives - భార్యలు |
| లైఫ్ Life - ప్రాణము | లైవ్స్ Lives - ప్రాణములు |

సూచన:—ఈ పై 3 వ సూత్రం వర్తింపని నామవాచక పదములు కొన్ని ఆంగ్లభాషయందుగలవు. వాటిని బాగుగా గమనింపుడు. అవి యీక్రింద తెలుపబడినవి:—

| Singular | Plural |
|---|---|
| ఛీఫ్ Chief - ప్రముఖుడు | ఛీఫ్స్ Chiefs - ప్రముఖులు |
| సేఫ్ Safe - ఇనుపపెట్టె | సేఫ్స్ Safes – ఇనుపపెట్టెలు |
| సర్ఫ్ Serf - బానిస | సర్ఫ్స్ Serfs – బానిసలు |
| స్ట్రైఫ్ Strife - కలహము | స్ట్రైఫ్స్ Strifes – కలహములు |
| రూఫ్ Roof - పైకప్పు (ఇంటి) | రూఫ్స్ Roofs - పైకప్పులు |
| ప్రూఫ్ Proof - ఋజువు | ప్రూఫ్స్ - Proofs ఋజువులు |
| హూఫ్ Hoof - గిట్ట | హూఫ్స్ Hoofs - గిట్టలు |
| గల్ఫ్ Gulf - సింధుశాఖ | గల్ఫ్స్ Gulf - సింధుశాఖలు |
| డ్వార్ఫ్ Dwarf - పొట్టివాడు | డ్వార్ఫ్స్ Dwarfs - పొట్టివారు |

4. ఇంకను మరికొన్ని నామవాచకపదముల (Nouns) లోని అచ్చులమార్పువలనకూడా బహువచన పదములు ఏర్పడును :—

| Singular | Plural |
|---|---|
| మ్యాన్ Man - మనుష్యుడు | మెన్ Men-మనుష్యులు |
| ఉమన్ Woman-స్త్రీ | ఉమెన్ Women-స్త్రీలు |
| టూత్ Tooth - పన్ను | టీత్ Teeth-పండ్లు |
| గూస్ Goose-బాతు | గీస్ Geese-బాతులు |
| ఫుట్ Foot-పాదము | ఫీట్ Feet-పాదములు |
| లౌస్ Louse-పేను | లైస్ Lice-పేలు |
| మౌస్ Mouse-చిట్టెలుక | మైస్ Mice-చిట్టెలుకలు |
| ఒయాసిస్ Oasis - ఎడారిలో గల పచ్చని నేల | ఒయాసెస్ Oases - ఎడారిలో గల పచ్చని నేలలు |
| క్రైసిస్ Crisis - గండము | క్రైసెస్ Crises - గండములు |

5. Compound nouns (సంయుక్త లేక సమాన నామవాచకము) లలో ముఖ్యమైన పదమునకు బహువచన మేర్పడును :—

| Singular | Plural |
|---|---|
| స్టెప్‌బ్రదర్ Step-brother సవతి సోదరుడు | స్టెప్‌బ్రదర్స్ Step brothers-సవతిసోదరులు |
| స్టెప్‌సన్ Step-Son - సవతి కుమారుడు | స్టెప్‌సన్స్ Step-Sons - సవతికుమారులు |

| Singular | Plural |
|---|---|
| సిస్టర్-ఇన్-లా Sister-in-law - వదిన | సిస్టర్స్-ఇన్-లా Sisters-in-law - వదినలు |
| బ్రదర్-ఇన్-లా Brother-in-law - బావమరిది | బ్రదర్స్-ఇన్-లా Brothers-in-law-బావమరదులు |
| మ్యాన్ సర్వెంట్ Man-servant - మగసేవకుడు | మెన్-సర్వెంట్స్ Men-servants - మగ నౌకర్లు (సేవకులు) |
| మెయిడ్ సర్వెంట్ Maid-servant-ఆడనౌకరి(దాసి) | మెయిడ్ సర్వెంట్స్ Maid-servants-దాసీలు |
| ఫుట్మ్యాన్ Foot-man - సేవకుడు | ఫుట్-మెన్ Foot-men - సేవకులు |
| ఫుట్-బాయ్ Foot-boy - పిల్ల బంట్రోతు | ఫుట్-బాయ్స్ Foot-boys - పిల్లబంట్రోతులు |
| ఫుట్-మార్క్ Foot-mark- పాదచిహ్నము | ఫుట్-మార్క్స్ Foot-marks-పాదచిహ్నములు |
| లుకర్ ఆన్ Looker-on - చూచేవాడు | లుకర్స్-ఆన్ Lookers-on- చూచేవారు |
| కమాండర్-ఇన్-చీఫ్ Commander-in-chief - సేనానాయకుడు | కమాండర్స్-ఇన్-చీఫ్ Commanders-in-chief - సేనానాయకులు |
| గవర్నర్ జనరల్ - Governor-general | గవర్నర్స్-జనరల్ Governors-general |

6. ప్రాచీనాంగ్లేయ పద్ధతి ప్రకారము బహువచన మేర్పరుచుట కొఱకు ఏకవచన నామవాచకములకు 'en' చేర్చెడువారు. నేడుకూడ అట్లు చేర్పబడేవి కొన్ని ఉన్నవి :—

ఉదా:—1. Ox అక్స్-ఎద్దు-ఏకవచనము.
Oxen ఆక్సెన్-ఎద్దులు-బహువచనము.

2. Child చైల్డ్-బిడ్డ-ఏకవచనము.
Children చిల్డ్రెన్-బిడ్డలు-బహువచనము.

3 Brother బ్రదర్-సోదరుడు-ఏకవచనము.

Brethren బ్రదరెన్ - సోదరులు - బహువచనము. (అయితే యీ పదం యిపుడు ఏక జాతికో, ఏక వృత్తికో చెందినవారినిగురించి ఉపయోగింతురు).

Brothers బ్రదర్స్-సోదరులు-ఏకగర్భ సంజాతులైనవారియెడ ఉపయోగించే బహువచనశబ్దము.

7. కొన్ని నామవాచకములకు (Nouns) ఏకవచన, బహువచన (Singular and Plural) రూపములు రెండును ఒకేరీతిగా నుండును:—

Sheep (షీప్) గొర్రె-గొర్రెలు.

Deer (డీర్) జింక-జింకలు.

Fish (ఫిష్) చేప-చేపలు (Fishes అనికూడా కలదు).

ఇటువంటివే -Swine (స్వైన్). Cod (కాడ్), Score (స్కోర్). Species (స్పీషీ). Apparatus (అప్పారెటస్) మొదలగు నామవాచకములు.

8. అంకెలవెనుకను, తులామానంలోను వచ్చే యీక్రింది పదములు ఏకవచనములోను, బహువచనములోనుగూడా. ఒకే రూపములో నుండును :—

Pair, Dozen, Score, Gross, Hundred, Thousand, Stone, Hundred weight,

ఉదా:—One Hundred rupees (ఏక)

Three Hundred rupees (బహు)

1. ఈ క్రిందివి. నిత్యబహువచనములనగా. వీటికి యేకవచన ప్రయోగములేదు; కాని రూపము బహువచనముగా నున్నను. అర్థము యేకవచనమే :—

Mathematics (మేథమేటిక్స్) – గణితము.

News (న్యూస్) – వార్త.

Tidings (టైడింగ్స్) – సమాచారము.

Physics (ఫిజిక్స్) – భౌతికశాస్త్రము.

Politics (పోలిటిక్స్) – రాజనీతిశాస్త్రము.

Economics (ఎకనామిక్స్) – అర్థశాస్త్రము.

Mechanics (మెకానిక్స్) – యంత్రవిజ్ఞానశాస్త్రము.

Means (మీన్స్) – సాధనము; ఆస్తి.

Gallows (గ్యాలోస్) - గల్లు: ఉరి లేక ఉరికంబము.
Alms (ఆమ్స్) - దానము: భిక్షము.
Riches (రిచెస్) - సంపద: ధనము.
Odds (ఆడ్స్) - అసమత్వము.
Assets (అసెట్స్) - ఆస్తి.
Annals (అనల్స్) - చరిత్ర.
Bellows (బెల్లోస్) - కొలిమితిత్తి.
Breeches (బ్రీచెస్) - షరాయి: చల్లడము.
Billiards (బిల్లియర్డ్స్) - ఒకవిధమైన పాశ్చాత్యక్రీడ.
Chattels (ఛాటల్స్) - చరాస్తి.
Drawers (డ్రాయర్స్) - లాగు
Draughts (డ్రాట్ట్స్) - ఒకవిధమైన ఆట.
Environs (ఎన్విరాన్స్) - చుట్టుప్రక్కలు: పరిసరాలు.
Measles (మీసిల్స్) - ఆటలమ్మ: తట్టు
Mumps (మంప్స్) - గవదలు అనే ఒకవ్యాధి.
Nuptials (నప్షల్స్) - వివాహము.
Obsequies (అబ్సిక్వీస్) - అపరకర్మ.
Piles (పైల్స్) - మూలవ్యాధి.
Pincers (పిన్సర్స్) - చిన్నపటకారు (శ్రవణము).
Proceeds (ప్రొసీడ్స్) - అమ్మకమువలన వచ్చినడబ్బు.
Scissors (సిజర్స్) - కత్తెర.
Spectacles (స్పెక్టకల్స్) - కండ్లజోడు.

Tongs (టాంగ్స్) - పట్టుకారు.
Trousers (ట్రవుసర్స్) - విజారు। షరాయి.
Thanks (థాంక్స్) - వందనము.

10. ఈ క్రింది నామవాచకములు రూపములో యేక వచనపదములుగానున్నను. అర్థములో బహువచనములుగా వ్యవహారమం దున్నవి.

Cattle (క్యాటిల్) - పశువులు.
Gentry (జెంట్రి) } పెద్దమనుష్యులు. ప్రముఖులు.
Elite (ఎలైట్) } పెద్దలు.
People (పీపుల్) - జనులు; ప్రజలు.
Poultry (పౌల్ట్రి) - కోళ్ళు.
Vermin (వెర్మిన్) - కీటకములు.

11 సాధారణముగా. Abstract nouns (గుణవాచక విశేష్యము)లకు Material nouns (పదార్థ నామవాచకము) లకు బహువచనరూపములేదు. బహువచనరూపమగు 'S' చేర్చితే ఏకవచన అర్థానికి భిన్నమైన మరొక అర్థమిచ్చే Common noun (సాధారణ నామవాచకము) యేర్పడును:-

| Singular | Plural |
|---|---|
| ఉ॥ Tin (టిన్) - తగరము. | Tins (టిన్స్) - డబ్బాలు. |
| Wood (వుడ్) - కర్ర. | Woods (వుడ్స్) - అడవులు |
| Kindness (కైండ్నెస్) - దయ. | Kindnesses (కైండ్నెసెస్) - దయతో చేయబడిన పనులు. |

12. అంకెలకు, అక్షరాలకు పైన కామాతోటి 'S' చేర్చిన, బహువచనరూప మేర్పడును.

ఉదా There are three 3's in 333 (దేర్ ఆర్ త్రీ త్రీస్ ఇన్ త్రీహండ్రెడ్ అండ్ థర్టీత్రీ) - 333 లో మూడు 3 లు ఉన్నవి. —అంకెలకు ఉదాహరణము.

There are two O's in the word 'Room' (దేర్ ఆర్ టూ ఓస్ ఇన్ ది వర్డ్ 'రూమ్') 'రూమ్' (గది) అనేపదములో రెండు 'O' లు ఉన్నవి.

—అక్షరాలకు ఉదాహరణము.

## 4-వ అభ్యాసము

I. ఈ క్రింది నామవాచకముల (Nouns) లో ఏకవచనములు (Singular number) గా నున్నవాటికి బహువచన (Plural number) రూపములును, బహువచనములుగా నున్నవాటికి యేకవచనరూపములను వ్రాయుము :—

| | | |
|---|---|---|
| Army | Fishes | Negro |
| Ass | Fly | Oasis |
| Box | Gas | Ox |
| Buses | Girls | Proof |
| Calf | Galleries | Roof |
| Cities | Hero | Shelf |
| Children | Knife | Serf |
| Donkey | Lives | Stepson |
| Daughter-in-law | Leaves | Teeth |
| Echo | Looker-on | Tables |
| Fox | Mice | Zebra |

II. ఈ క్రింది నామవాచకములలోని తప్పులను సరి దిద్దుము :—

Wifes
Crises
Step-daughters
Daughter-in-laws
Calfs
Watchs
Foots
Ladys
Shelves
Birds
Mouses
Gooses

Lice
Oxes
Chieves
Safes
Commander-in-chiefs
Monkies
Sheeps
Shops
Houses
Louses
Deers

# 54. Noun - Gender

(నౌన్ - జెండర్)

## నామవాచకము, లింగము

1. Boy - బాలుడు — ఈ నామవాచకము పురుషసూచకము.
2. Girls - బాలికలు — ఈ పదము, స్త్రీవాచకము.
3. Pen - కలము — ఇది ఆడ, మగ అనే భేదములేనిది; ప్రాణము లేనిది.
4. Friend - స్నేహితుడు — మగస్నేహ మ్ముండవచ్చును. లేక ఆడస్నేహ ముండవచ్చును.

1. పై నామవాచకములలో మొదటిది 'Boy' బాలుడు పురుషసూచకము. ఇట్టి పురుషసూచకములైన నామవాచకములు తెలుగులో "పుంలింగ" మందురు. ఆంగ్లములో 'Masculine gender' (మ్యాస్కులైన్ జెండర్) అని అందురు.

2. పై మాటలలోని రెండవదగు 'Girls' స్త్రీ వాచక శబ్దము. అందువలన Girls ను 'స్త్రీలింగ'మని ఆంధ్రమందును, 'Feminine gender' (ఫెమినైన్ జెండర్) అని ఆంగ్ల మందును పేర్కొందురు.

3. 'Pen' శబ్దము ప్రాణములేని ఒక వస్తువునుగురించి తెలుపును. దీనికి ఆడ, మగ అనే భేదములేదు. కనుక యీ నామవాచకము ఆంధ్రములో 'నపుంసక లింగము' లో నున్న

దందురు. ఆంగ్లములో 'Neuter gender' (న్యూటర్ జెండర్) అని నపుంసకలింగమునకు పేరు.

4. మగవారికి, ఆడువారికిచెందేది పైనపేర్కొనబడిన 'Friend' శబ్దము. ఆడ, మగ జాతులు రెంటికిని సమానము (Common) గా అన్వయించును కనుక యిది 'Common gender' (కామన్ జెండర్) లో ఉన్నదందురు.

I. ఇట్టి Common gender లో ఉండే నామవాచకములివి :—

బేబీ Baby - పాప.

కాఫ్ Calf - కోడెదూడ లేక పెయ్యదూడ.

క్యామెల్ Camel - ఒంటె (మగ లేక ఆడ).

క్యాట్ Cat - పిల్లి ( .. ).

చైల్డ్ Child - బిడ్డ ( .. ).

కజిన్ Cousin - తల్లిలేక తండ్రితోడబుట్టినవారి సంతానము. (దాయాది : అన్నదమ్ములు లేదా అక్కచెల్లెండ్ర వరుస గల చుట్టము)

కబ్ Cub - కూన (మగ లేక ఆడ).

డీర్ Deer - జింక ( .. ).

ఎనిమీ Enemy - శత్రువు.

ఎలిఫెంట్ Elephant - ఏనుగు (మగ లేక ఆడ)

ఫో Foe - శత్రువు.

ఫ్రెండ్ Friend - మిత్రము (ఆడ లేక మగ)

ఫౌల్ Fowl - కోడి (పుంజు లేక పెట్ట).

గోట్ Goat - మేక (మగ లేక ఆడ).

ఇన్ఫెంట్ Infant - శిశువు (మగ లేక ఆడ).

ల్యాంబ్ Lamb - మేకపిల్ల (    ,,    ).

మొనర్క్ Monarch - రాజు లేక రాణి.

నెయ్బర్ Neighbour - పొరుగువారు (మగ లేక ఆడ).

ఆర్ఫన్ Orphan - తల్లిదండ్రులు లేని బిడ్డ (అనాధ).

ప్యారెంట్ Parent - తల్లి లేక తండ్రి

పర్సన్ Person - మనిషి (మగ లేక ఆడ).

పిగ్ Pig - పంది (మగ లేక ఆడ).

ప్యూపిల్ Pupil - విద్యార్థి లేక విద్యార్థిని.

రిలేషన్ Relation - బంధువు (మగ లేక ఆడ).

సర్వెంట్ Servant - నౌకరు (    ,,    ).

షీప్ Sheep - గొర్రె (మగ లేక ఆడ).

సావరెన్ Sovereign - చక్రవర్తి లేక చక్రవర్తిని (రాజు లేక రాణి).

స్టూడెంట్ Student - విద్యార్థి లేక విద్యార్థిని.

టీచర్ Teacher - పంతులు లేక పంతులమ్మ.

థీఫ్ Thief - దొంగ (మగ లేక ఆడ).

II. ఈ క్రింద కొన్ని పుంలింగ రూపములను వాటి కెదురుగా, ఆ పుంలింగ రూపములకు సరియైన స్త్రీలింగ రూపములును యీయబడినవి. నేర్చుకొనుము :—

A. నామవాచకముల (Nouns) కు ముందు వెనుకల క్రొత్త పదములు లేక క్రొత్త సంజ్ఞలు చేర్చుటవలన లింగభేదములు కల్గునవి :—

| పుంలింగము (Masculine) | స్త్రీలింగము (Feminine) |
|---|---|
| బుల్-కాఫ్ Bull-calf - కోడె దూడ | కౌ-కాఫ్ Cow-calf - పెయ్య దూడ |
| కాక్-స్పారో Cock-sparrow - మగపిచ్చుక | హెన్-స్పారో Hen-sparrow - ఆడపిచ్చుక |
| గ్రాండ్-ఫాదర్ Grand-father - తాత | గ్రాండ్ మదర్ Grand-mother - అవ్వ |
| గ్రేట్ - అంకుల్ Great-uncle - పెదతండ్రి | గ్రేట్ ఆంట్ Great-aunt- పెద్దమ్మ (పెదతల్లి) |
| గ్రేట్-గ్రాండ్‌సన్ Great-Grandson - మునిమనుమడు | గ్రేట్-గ్రాండ్-డాటర్ Great-grand - daughter - ముని మనుమరాలు |
| హి-బియర్ He-bear - మగ ఎలుగు | షి-బియర్ She-bear - ఆడ ఎలుగు |

| పుంలింగము (Masculine) | స్త్రీలింగము (Feminine) |
|---|---|
| హీ-గోట్ He-goat - మగ మేక | షీ-గోట్ She-goat - ఆడ మేక |
| జాక్-ఏస్ Jack-ass - మగ గాడిద | జెన్నీ-ఏస్ Jenny-ass - ఆడ గాడిద |
| లేండ్-లార్డ్ Land-lord - గృహస్థు | లేండ్ - లేడి Land-lady- గృహిణి |
| మేన్-సర్వెంట్ Man-servant - మగనౌకరు | మెయిడ్-సర్వెన్ట్ Maid - servant - ఆడనౌకరు |
| మెర్ మేన్ Merman - నాగ పురుషుడు | మెర్ మెయిడ్ Mermaid- నాగకన్య |
| మిల్క్-మేన్ Milk-man - పాలవాడు | మిల్క్ - మెయిడ్ Milk- maid - పాలస్త్రీ |
| పి-కాక్ Pea-cock - మగ నెమలి | పి - హెన్ Pea - hen-ఆడ నెమలి |
| వాషర్-మేన్ Washer- man - చాకలివాడు | వాషర్-వుమన్ Washer - woman - చాకలి స్త్రీ |
| బ్రైడ్-గ్రూమ్ Bride- groom-పెండ్లికుమారుడు | బ్రైడ్ Bride - పెండ్లి కూతురు |

III. పుంలింగ నామవాచకములకు (Nouns in Masculine gender) చివర 'ess', 'ine', 'trix' మొదలగు ఉపసర్గలు చేర్చుటచేత స్త్రీలింగరూపము లేర్పడునవి :

| పుంలింగం (Masculine) | స్త్రీలింగం (Feminine) |
| --- | --- |
| ఆక్టర్ Actor నటుడు | ఆక్ట్రెస్ Actress - నటి |
| అడ్మినిస్ట్రేటర్ Administrator - అధికారి | అడ్మినిస్ట్రేట్రిక్స్ Administratrix - అధికారిణి |
| ఆథర్ Author - గ్రంధకర్త | ఆథరెస్ Authoress - గ్రంధకర్త్రిణి |
| ఆబట్ Abbot - క్రైస్తవమతాధిపతి | ఆబెస్ Abbess - క్రైస్తవ మతాధికారిణి |
| బ్యారన్ Baron - జమీందారు | బ్యారొనెస్ Baroness - జమీందారిణి |
| బెనిఫాక్టర్ Benefactor - ఉపకారి | బెనిఫాక్ట్రెస్ Benefactress - ఉపకారిణి |
| కండక్టర్ Conductor - నడిపించువాడు | కండెక్ట్రెస్ Conductress నడిపించునట్టి స్త్రీ |
| డ్యూక్ Duke - ప్రభువు | డచెస్ Duchess - ప్రభ్వి |
| ఎడిటర్ Editor - సంపాదకుడు | ఎడిట్రెస్ Editress - సంపాదకురాలు |
| ఎంపరర్ Emperor - చక్రవర్తి | ఎంప్రెస్ Empress - చక్రవర్తిని |
| ఎంఛాంటర్ Enchanter - మాంత్రికుడు | ఎంఛాంట్రెస్ Enchantress - మాంత్రికురాలు |
| ఎక్సిక్యూటర్ Executor - కార్యనిర్వాహకుడు | ఎక్సిక్యూట్రెస్ Executress - కార్యనిర్వాహకురాలు |

ఫౌండర్ Founder - స్థాపించినవాడు
ఫాక్స్ Fox - గుంటనక్క
జయింట్ Giant - రాక్షసుడు
గాడ్ God - దేవుడు
హైర్ Heir - వారసుడు
హోస్ట్ Host - గృహాధికారి
హీరో Hero - నాయకుడు
హంటర్ Hunter - వేటకాడు
ఇన్స్ట్రక్టర్ Instructor - ఉపాధ్యాయుడు
జ్యూ Jew - యూదుడు
లయన్ Lion - సింహము
ల్యాడ్ Lad - బాలుడు
మిస్టర్ Mr - అయ్యా
మార్క్విస్ Marquis - ప్రభువు
మేనేజర్ Manager - నిర్వాహకుడు
మేయర్ Mayor - నగరాధ్యక్షుడు

ఫౌండ్రెస్ Foundress - స్థాపించిన ఆమె
విక్సెన్ Vixen - ఆడ గుంటనక్క
జయింటెస్ Giantess - రాక్షసి
గాడెస్ Goddess - దేవత
హైరెస్ Heiress - వారసురాలు
హోస్టెస్ Hostess - గృహాధికారిణి
హీరోయిన్ Heroine - నాయకి
హంట్రెస్ Huntress - వేటకత్తె
ఇన్స్ట్రక్ట్రెస్ Instructress - ఉపాధ్యాయిని
జ్యూయెస్ Jewess - యూదుస్త్రీ
లయనెస్ Lioness - ఆడుసింహము
ల్యాస్ Lass - బాలిక
మిసస్ Mrs - అమ్మా
మార్కినెస్ Marchioness - ప్రభ్వి
మేనేజరెస్ Manageress - నిర్వాహకురాలు
మేయరెస్ Mayoress - నగరాధ్యక్షురాలు

| పుంలింగం (Masculine) | స్త్రీలింగం (Feminine) |
|---|---|
| మాస్టర్ Master - యజమాని | మిస్ట్రెస్ Mistress - యజమానురాలు |
| మర్డరర్ Murderer - హంతకుడు | మర్డరెస్ Murderess - హంతకి |
| నీగ్రో Negro - నీగ్రోజాతివాడు | నీగ్రెస్ Negress - నీగ్రోజాతి స్త్రీ |
| పేట్రన్ Patron పోషకుడు | పేట్రనెస్ Patroness - పోషకురాలు |
| పీర్ Peer - సమానుడు | పీరెస్ Peeress - సమానురాలు |
| పొయెట్ Poet - కవి | పొయెటెస్ Poetess- కవయిత్రి |
| ప్రిసెప్టర్ Preceptor - పురోహితుడు | ప్రిసెప్ట్రెస్ Preceptress - పురోహితురాలు |
| ప్రీస్ట్ Priest - అర్చకుడు | ప్రీస్టెస్ Priestess – అర్చకురాలు |
| ప్రిన్స్ Prince - రాజపుత్రుడు | ప్రిన్సెస్ Princess - రాజపుత్రి |
| ప్రాఫెట్ Prophet - మతప్రవక్త | ప్రాఫెటెస్ Prophetess - మతప్రవక్తురాలు |
| పోర్టర్ Porter - మోతకూలి | పోర్ట్రెస్ Portress - మోతకూలిది |
| ప్రాసిక్యూటర్ Prosecutor - అభియోక్త | ప్రాసిక్యూట్రిక్స్ Prosecutrix - అభియోక్తురాలు |
| షెప్పర్డ్ Shepherd - గొల్లవాడు | షెప్పర్డెస్ Shepherdess - గొల్లది |
| సాంగ్స్టర్ Songster - గాయకుడు | సాంగ్స్ట్రెస్ Songstress - గాయకురాలు |

| | |
|---|---|
| టెస్టేటర్ Testator - మరణశాసనము వ్రాసిన వాడు | టెస్టేట్రిక్స్ Testatrix - మరణశాసనము వ్రాసిన ఆమె |
| టైగర్ Tiger - మగపులి | టైగ్రెస్ Tigress - ఆడపులి |
| ట్రెయిటర్ Traitor - ద్రోహి | ట్రెయిట్రెస్ Traitress - ద్రోహిణి |
| వెయిటర్ Waiter - వేచియుండువాడు | వెయిట్రెస్ Waitress - వేచియుండు ఆమె |

IV. ఈ క్రింది పుంలింగ నామవాచకములకు స్త్రీలింగ రూపములు పూర్తిగా క్రొత్తవి:—

| పుంలింగము (Masculine) | స్త్రీలింగము (Feminine) |
|---|---|
| బ్యాచిలర్ Bachelor - బ్రహ్మచారి | మెయిడ్ Maid – కన్య |
| బో Beau - అందగాడు | బెల్ Belle - అందకత్తె |
| బాయ్ Boy - బాలుడు | గర్ల్ Girl - బాలిక |
| బ్రదర్ Brother – సోదరుడు | సిస్టర్ Sister - సోదరి |
| బక్ Buck – పావురము (మగ) | డో Doe - ఆడపావురము |
| బోర్ Boar – మొగపంది | సో Sow - ఆడపంది |

| పుంలింగం (Masculine) | స్త్రీలింగం (Feminine) |
| --- | --- |
| బుల్ Bull – ఎద్దు | కౌ Cow - ఆవు |
| బుల్లక్ Bullock – కోడె | హెఫర్ Heifer - పెయ్య |
| కాక్ Cock – పుంజుకోడి | హెన్ Hen - పెట్టకోడి |
| కోల్ట్ Colt – మగ గుఱ్ఱపుపిల్ల | ఫిల్లీ Filly - ఆడగుఱ్ఱపు పిల్ల |
| డాగ్ Dog - మగకుక్క | బిచ్ Bitch - ఆడకుక్క |
| డ్రేక్ Drake - మగబాతు | డక్ Duck - ఆడబాతు |
| డ్రోన్ Drone - మగ తేనెటీగ | బీ Bee - ఆడ తేనెటీగ |
| ఎర్ల్ Earl - ప్రభువు | కౌంటెస్ Countess - ప్రభ్వి |
| ఫాదర్ Father - తండ్రి | మదర్ Mother - తల్లి |
| ఫ్రయర్ Friar - సన్న్యాసి | నన్ Nun - సన్న్యాసిని |
| గ్యాండర్ Gander - మగబాతు | గూస్ Goose - ఆడబాతు |
| జెంటిల్మెన్ Gentleman - పెద్దమనిషి లేక దొర | లేడీ Lady - దొరసాని |
| హార్ట్ Hart - మగదుప్పి | రో Roe - ఆడదుప్పి |
| హార్స్ Horse - మగగుఱ్ఱము | మేర్ Mare - ఆడగుఱ్ఱము |
| హస్బెండ్ Husband - భర్త | వైఫ్ Wife - భార్య |

| | |
|---|---|
| కింగ్ King - రాజు | క్వీన్ Queen - రాణి |
| లార్డ్ Lord - ప్రభువు | లేడీ Lady - ప్రభ్వి |
| మ్యాన్ Man - పురుషుడు | వుమన్ Woman - స్త్రీ |
| మాంక్ Monk - సన్న్యాసి | నన్ Nun - సన్న్యాసిని |
| నెవ్యూ Nephew - మేనల్లుడు | నీస్ Niece - మేనకోడలు |
| పప్పా Papa - తండ్రి | మమ్మా Mamma - తల్లి |
| ర్యాం Ram - పొట్టేలు | యూ Ewe - ఆడగొర్రె |
| సర్ Sir - అయ్యా! | మేడం Madam - అమ్మా! |
| సన్ Son - కొడుకు | డాటర్ Daughter - కూతురు |
| స్ట్యాగ్ Stag - మగలేడి | హింద్ Hind - ఆడులేడి |
| స్వాన్ Swan - హంస (మగ) | నిమ్ఫ్ Nymph - ఆడహంస |
| అంకుల్ Uncle - పినతండ్రి, మేనమామ | ఆంట్ Aunt - పినతల్లి, మేనత్త |
| విజర్డ్ Wizard - మంత్రగాడు | విచ్ Witch - మాంత్రికురాలు |
| విడోయర్ Widower - విధురుడు | విడో Widow - వితంతువు |

## 5-వ అభ్యాసము

I. ఈ క్రింది నామవాచకాలు (Nouns) ఏ లింగం (Gender) లో నున్నవో వ్రాయుము :—

(1) Abbot (2) Belle (3) Chair (4) Doe (5) Earl (6) Fowl (7) Gander (8) Hart (9) Instructress (10) Jew (11) King (12) Lioness (13) Monk (14) Negress (15) Orphan (16) Princess (17) Ram (18) Student (19) Tigress (20) Uncle (21) Vixen (22) Wall (23) Witch (24) Widower

II. ఈ క్రింది నామవాచకములకు పుంలింగ రూపముల వ్రాయుము (Write the Masculine forms to the following nouns) :—

(1) Authoress (2) Abess (3) Countess (4) Duchess (5) Ewe (6) Foundress (7) Goddess (8) Heroine (9) Hind (10) Jewess (11) Jenny-ass (12) Lass (13) Maid-servant (14) Mistress (15) Niece (16) Nun (17) Peeress (18) Queen (19) Pea-hen (20) Roe (21) Sow (22) Songstress (23) Traitress (24) Widow

III. ఈ క్రింద యీయబడిన విశేష్యములకు స్త్రీలింగ రూపముల వ్రాయుము (Write the feminine forms to the nouns given here under :—

(1) Author (2) Benefactor (3) Conductor (4) Drake (5) Emperor (6) Father (7) Giant (8) Hart (9) Heir (10) Host (11) Land-lord (12) Murderer (13) Manager (14) Man-servant (15) Priest (16) Papa (17) Preceptor (18) Stag (19) Shepherd (20) Swan (21) Testator (22) Uncle (23) Viceroy (24) Washerman.

IV. Write sentences using the feminine gender of the underlined words in the following :—

(1) An author wrote a book.

(2) Barons live in big houses.

(3) I got a colt.

(4) There is a big dog in the house of our earl.

(5) My nephew was my host.

(6) Poets always have patrons.

(7) The king and his son, the prince are going in the car.

(8) An <u>enchanter</u> and a <u>wizard</u> are the same.

(9) The <u>Mayor</u> of Madras is elected only for a year.

V. Write 6(six) sentences of your own using any common gender forms you know.

VI. Write 5(five) sentences of your own using any neuter gender nouns you know.

## 55. The Cow (ది కౌవ్)

## ఆవు

The cow is a useful animal. ఆవు ఒక ఉపయోగకరమైన జంతువు.

It is found in almost all Countries of the world. ఇంచుమించు ప్రపంచమందలి అన్నిదేశములలో ఇది కనుగొనబడును.

It is a mild animal. ఇది సాధుజంతువు.

We keep cows in our houses. ఆవులను మనము ఇండ్లలో ఉంచుకొందుము.

So we call the cow a domestic animal. కనుక ఆవును మనము పెంపుడు జంతువు అని పిలుతుము.

The cow has four short legs and a long tail. ఆవు నాలుగు పొట్టి కాళ్లను, ఒక పొడుగాటి తోకను కలిగియున్నది.

There is a tuft of hair at the end of its tail. దాని తోకచివర ఒక వెంట్రుకల కుచ్చు కలదు.

Cows are of different colours. ఆవులు వివిధములైన రంగులలో నుండును.

The cow eats grass and straw. ఆవు పచ్చి గడ్డిని ఎండు గడ్డిని తినును.

It is also fed on rice gruel, oil cake, and cotton seeds. అది బియ్యపుకడుగు, గానుగ పిండి, ప్రత్తి గింజలతోకూడ మేపబడును.

The cow is a cud-chewing animal. ఆవు నెమరువేయు జంతువు.

It gives us milk. అది మనకు పాలు ఇచ్చును.

Cow milk is a rich and good food. ఆవుపాలు బలవర్ధకమగు శ్రేష్ఠమయిన ఆహారము.

Cow dung is used as manure. ఆవుపేడ ఎరువుగా ఉపయోగింపబడుచున్నది.

The cow is a sacred animal for the Hindus. ఆవు హిందువులకు పవిత్రమైన జంతువు.

They worship the cow. వారు ఆవును పూజింతురు.

# 56. The Horse (ది హార్స్)

## గుఱ్ఱము

The horse is also a domestic animal like the cow. గుఱ్ఱముకూడ ఆవు వలెనే ఒక పెంపుడుజంతువు.

It is a noble animal. అది గంభీరమైన జంతువు.

It is found in almost all the parts of the world. అది యించుమించు ప్రపంచమందలి అన్ని ప్రాంతములందును కనుగొనబడును.

It has a long neck with long and thick hair. పొడవైనట్టియు, దట్టమైనట్టియు వెంట్రుకలు గల పొడుగాటి మెడను అది కలిగియున్నది.

The long hair is called mare. ఆ పొడుగాటి వెంట్రుకలు జూలు అని పిలువబడును.

It has four long legs. అది పొడుగైన నాలుగు కాళ్లను కలిగియున్నది.

It has four hoofs one on each leg. ఒక్కొక్క కాలికి ఒకటి ప్రకారము అది నాలుగు గిట్టలను కలిగియున్నది.

Its hoofs are not cloven. దాని గిట్టలు చీలియుండలేదు.

So it is able to run fast. కనుక అది తొందరగా పరుగెత్తుటకు శక్తి కలిగి యున్నది.

The horse is a faithful animal. గుఱ్ఱము విశ్వాసముగల జంతువు.

It loves its master very much. అది తన యజమానిని ఎక్కువ ప్రేమించును.

It lives on grass, gram and hay. అది పచ్చి గడ్డి, ఉలవలు, ఎండుగడ్డి తిని జీవించును.

Horse is very useful for us. గుఱ్ఱము మనకు మిక్కిలి ఉపయోగకరముగా నున్నది.

It draws carts. అది బండ్లను లాగును.

It carries loads on its back. అది వీపుపై బరువులను మోయును.

We use the horse for riding. మనము గుఱ్ఱమును స్వారిచేయుటకు ఉపయోగింతుము.

In western Countries like England, the horse is used for ploughing land also. ఇంగ్లాండు వంటి పడమటిదేశములలో గుఱ్ఱము పొలము దున్నుటకుకూడ ఉపయోగింపబడును.

In olden days the horse was used in wars. పూర్వకాలమునందు గుఱ్ఱము యుద్ధములందు ఉపయోగింపబడు చుండెను.

## 57. The Elephant (ది ఎలిఫెంట్)

### ఏనుగు

The elephant is a very big animal. ఏనుగు చాల పెద్దజంతువు.

It is as big as a wall. అది గోడంత పెద్దగా నుండును.

It is very strong. అది మిక్కిలి బలిష్ఠమయినది.

The elephant lives in dense forests. ఏనుగు దట్టమైన అడవులలో నివసించును.

It fells trees and eats the leaves and small branches. అది చెట్లను పడగొట్టి ఆకులను కొమ్మలను తినును.

It has four legs. ఏనుగు నాలుగు కాళ్ళను కలిగియున్నది

Its legs are stout like pillars. దీని కాళ్ళు స్తంభములవలె లావుగానుండును.

It has two ears which are like big fans. దానికి పెద్ద విసనకఱ్ఱలవలె నుండు రెండు చెవులు కలవు.

The elephant is a costly animal. ఏనుగు మిక్కిలి వెలగల జంతువు.

Only kings and emperors can purchase it. రాజులు, చక్రవర్తులు మాత్రమే దానిని కొనగలరు.

In olden days kings used to have many elephants in their armies. పూర్వకాలమందు రాజులు తమ సైన్యములలో అనేక ఏనుగుల నుంచుకొనుచుండిరి.

Warriors sat on the back of the elephants and fought battles. సైనికులు ఏనుగు వీపుపై కూర్చొని యుద్ధములు చేయుచుండిరి.

India is famous for elephants. భారతదేశము ఏనుగులకు ప్రసిద్ధికెక్కినది.

Most of Indian elephants are from Mysore State. భారతదేశపు ఏనుగులలో ఎక్కువభాగము మైసూరు రాష్ట్రములో లభించును.

# 58. The Camel (ది కేమల్)

## ఒంటె

The camel is a peculiar animal. ఒంటె ఒక వింత జంతువు.

It is not beautiful to look at. అది చూచుటకు అందముగా ఉండదు.

It has a long neck and long legs. అది పొడుగైన మెడను కాళ్ళను కలిగియున్నది.

It has a very short tail. అది మిక్కిలి చిన్నదైన తోకను కలిగియున్నది.

The trunk of its body is very high from the ground. దాని శరీరము నేలకు చాల ఎత్తున నుండును.

Camels live in the desert parts of the world. ప్రపంచమందలి ఎడారి ప్రదేశములందు ఒంటెలు నివసించును.

A very hot and sandy place is called a desert. మిక్కిలి వేడిమిగల ఇసుకప్రదేశము ఎడారి అని పిలువబడును.

No other animal except the camel can live or walk in a desert. ఒంటె తప్ప ఏ ఇతర జంతువుకూడ ఎడారిలో నడువలేదు, జీవించలేదు.

So the camel is called 'the Ship of the Desert.' కనుకనే ఒంటె 'ఎడారి ఓడ' అని పిలువబడుచున్నది.

As there is no water in a desert, the camel is accustomed to drink water only once in about ten days. ఎడారియందు నీరు ఉండదు. అందువలన ఒంటె ఇంచుమించు పదిదినముల కొకసారి మాత్రమే నీరు త్రాగుటకు అలవాటు పడియున్నది.

Camel is used for all kinds of travel in a desert. ఎడారియందలి అన్నిరకముల ప్రయాణములకును ఒంటె ఉపయోగింపబడుచున్నది.

It is used for carrying loads as well as men. అది బరువులను, మనుష్యులను మోయుటకు ఉపయోగింపబడుచున్నది.

# 59. The Clock (ది క్లాక్)

## గడియారము

The clock shows us time. గడియారము మనకు కాలము చూపును.

A big time-piece is called a clock. పెద్దగా నుండు కాలముచూపు యంత్రమునకు గడియారము అని పేరు.

A small time-piece is called a watch. చిన్నగానుండు కాలముచూపు యంత్రమునకు 'చేతి గడియారము-watch' అని పేరు.

The face of the clock is generally round. సాధారణముగా గడియారము ముఖము గుండ్రముగా నుండును.

There are twelve numbers from one to twelve on the face of the clock. గడియారము యొక్క ముఖముమీద 12 సంఖ్యలు (1 నుండి 12 వరకు) ఉండును.

The twelve numbers denote twelve hours. ఆ పండ్రెండు సంఖ్యలును పండ్రెండు గంటలను సూచించును.

There are two hands on the face of the clock. గడియారము ముఖముమీద రెండు ముండ్లు ఉండును.

One hand is long and the other is short. ఒక ముల్లు పొడుగుగను, మరొకటి పొట్టిగను ఉన్నవి.

The long hand shows minutes and the short hand shows hours. పెద్దముల్లు నిమిషములను చూపును, చిన్నముల్లు గంటలను చూపును.

The long hand is therefore called the minute-hand and the short hand is called the hour-hand. కనుక పెద్దముల్లు నిమిషముల ముల్లనియు, చిన్నముల్లు గంటల ముల్లనియు పిలువబడుచున్నవి.

The minute hand moves quickly. నిమిషముల ముల్లు తొందరగా తిరుగును.

The hour hand moves slowly. గంటల ముల్లు నిదానముగా తిరుగును.

The minute hand goes round the face of the clock once in an hour. నిమిషముల ముల్లు గంట కొకసారి గడియారము ముఖమును చుట్టివచ్చును.

The hour hand moves only from one number to the other in an hour. గంటల ముల్లు ఒక గంటలో, ఒక సంఖ్యనుండి మరొక సంఖ్యకు మాత్రమే కదలును.

Till recently clocks and watches were imported to our country from foreign countries. కొద్దికాలము క్రిందటివరకు గడియారములు మనదేశమునకు విదేశములనుండి దిగుమతి చేయబడుచుండినవి.

They are now manufactured in our country itself in a small scale. అవి ఇప్పుడు మన దేశమునందే కొద్దికొద్దిగా తయారుచేయబడుచున్నవి.

# 60. The Mango Tree (ది మేంగో ట్రీ)

## మామిడి చెట్టు

The mango tree grows in hot places. మామిడిచెట్టు ఉష్ణప్రదేశములయందు పెరుగును.

Black cotton soil is best suited for the mangoe tree. నల్లరేగడినేల మామిడిచెట్లకు మిక్కిలి తగియుండును.

The mango tree grows into a big tree with a strong trunk and many branches. మామిడిచెట్టు బలిష్ఠమగు మొదలుతో, అనేకములయిన కొమ్మలతో పెద్ద వృక్షముగా పెరుగును.

The trunk is very hard. దీని బోదె మిక్కిలి గట్టిగా నుండును.

The life of the mango tree is long. మామిడిచెట్టు జీవితము పెద్దది. (అనగా చాలకాలము బ్రతుకును.)

Some trees live more than fifty years. కొన్నిచెట్లు ఏబదిఏండ్లకు పైగాకూడా బ్రతుకును.

The mango tree flowers in early spring. మామిడిచెట్టు వసంతఋతువు ఆరంభములో పుష్పించును.

By summer we get green mangoes and mango fruit. వేసవి కాలమప్పటికి మామిడికాయలు, పండ్లు లభించును.

Green mangoes are used to make pickles. మామిడికాయలు ఊరగాయ చేయుటకు పనికివచ్చును.

Mango fruits have good taste. మామిడి పండ్లు మంచి రుచిగా నుండును.

Banganapalli town in Kurnool Dt. and Alampur in Mahaboobnagar Dt. are famous for mango-fruit. కర్నూలు జిల్లాయందలి బనగనపల్లి, మహబూబునగరము జిల్లాలోని అలంపూరు మామిడిపండ్లకు ప్రసిద్ధికి వచ్చినవి.

The fruits grown here are of best quality. ఇచట లభించు పండ్లు చాల శ్రేష్ఠమైనవి.

They are not only sent to all other States of India, but also to foreign countries. ఇవి మన దేశమందలి ఇతర రాష్ట్రములకే కాక విదేశములకుకూడ పంపబడుచున్నవి.

In our Andhra Pradesh both green mangoes and mango-fruit are prepared into many side-dishes and are used freely. ఆంధ్ర ప్రదేశమునందు మామిడికాయలు, పండ్లు రకరకములయిన వంటకములుగా తయారుచేయబడి, ధారాళముగా ఉపయోగింపబడుచున్నవి.

# 61. The Postman (ది పోస్ట్‌మేన్)
# తపాలా బంట్రోతు

The postman is a Government servant. తపాలా బంట్రోతు ప్రభుత్వ ఉద్యోగస్థుడు.

He wears khaki uniform. అతడు ఖాకీదుస్తులు ధరించును.

The Postman brings us news from distant places. తపాలావాడు దూరప్రదేశములనుండి మనకు వార్తలను తెచ్చును.

So everybody is glad to see him. కనుక ప్రతివాడును తపాలావానిని చూచి సంతోషించును.

We also regard the postman as our friend. తపాలా బంట్రోతును మనము స్నేహితునిగకూడ భావింతుము.

There is a big leather bag with the postman. తపాలావానివద్ద ఒక పెద్ద తోలుసంచి ఉండును.

He keeps cards, covers, money, parcels and letters in it. అతడు కార్డులు, కవర్లు, డబ్బు, పార్సళ్ళు, ఉత్తరములు దానిలో ఉంచును.

The postman is a very busy man. తపాలా వాడు ఎల్లప్పుడు పనిచేయుచునే ఉండును.

He goes from door to door. అతడు ఇంటింటికి పోవును.

He delivers letters, parcels, etc. అతడు ఉత్తరములను, పార్సళ్ళను బట్వాడా చేయును.

In towns, the postman generally goes on a cycle. పట్టణములలో తపాలావాడు సామాన్యముగా సైకలుమీద పోవుచుండును.

But the village-postman has to walk in the streets of the village. కాని పల్లెటూరి తపాలావాడు వీధులలో నడువవలసి యుండును.

So the work of a village postman is more difficult than the work of a town postman. కనుక పట్టణపు తపాలావాని పని కంటె పల్లెటూరి తపాలావాని పని ఎక్కువ కష్టమయినది.

# 62. The Noun : Case (ది నౌన్ : కేస్)

## నామవాచకము : విభక్తి

వాక్యములో తప్పనిసరిగా కర్తగా ఉపయోగింపబడే నామవాచకమునకు, ఆ వాక్యములోని యితర పదములతో కలిగి యుండే సంబంధమునకు విభక్తి యని పేరు. విభక్తికి ఆంగ్లములో 'కేస్' (Case) అని అందురు. తెలుగులో ఎనిమిది విభక్తులు (సంబోధన ప్రథమావిభక్తితో) ఉండగా, ఆంగ్లములో విభక్తులు నాల్గుమాత్రమే కలవు:—

(1) నామినేటివ్ కేస్ Nominative Case - ప్రథమావిభక్తి (ని, ను).

(2) ఆబ్జెక్టివ్ కేస్ Objective Case - ద్వితీయా విభక్తిని, షష్ఠీవిభక్తిని (కి, కు) పోలును.

(3) పొసెసివ్ కేస్ Possesssive Case - షష్ఠీవిభక్తి.

(4) నామినేటివ్ ఆఫ్ అడ్రస్ లేక ఒకేటివ్ కేస్ Nominative of address or Vocative Case - సంబోధన ప్రథమావిభక్తిని (తెలుగులో) పోలును.

1. ప్రథమావిభక్తి (Nominative Case):—

(a) వాక్యములో Subject (కర్త) గా నుండే Noun (నామవాచకము) నామినేటివ్ కేస్ (Nominative Case)

లో ఉండును. ఉ॥ The boy is a student. ఇచట కర్త యైన 'The boy' Nominative Case లో ఉన్నది.

(b) వాక్యములో కర్తగా ఉండే Noun తో, అన్వయించే దిగా మరియొక Noun ఉండినయెడల (Put in apposition) దానిని 'Nominative Case' అందురు. ఉ॥ Telugu, the Italian of the east, is spoken by the Andhras. ఈ వాక్యములో కర్తయైన 'Telugu' అనే నామవాచక పదముతో, 'Italian of the east' అనే పదము అన్వయించును.

(c) ఒక నామవాచకము వాక్యములోని క్రియలోని భావమును పూర్తిచేయునది 'అనగా' Complement (కాంప్లిమెంట్) గా ఉన్నయెడల ఆ నామవాచకపదము (Noun) నామినేటివ్ కేస్ (Nominative Case) లో ఉన్నదనవలెను.

ఉ॥ She is a woman (Nominative Case).

II. ద్వితీయావిభక్తి (Objective Case):—

ఇది రెండు విధములు:— (1) Accusative Case (అక్కుసేటివ్ కేస్). ఇది మన తెలుగు వ్యాకరణమందలి ద్వితీయవిభక్తి వంటిది. (2) Dative Case (డేటివ్ కేస్). ఇది మన ఆంధ్రమందలి చతుర్థీవిభక్తి వంటిది.

I. Accusative Case :—

(a) వాక్యములో Direct object గా ఉండే నామ వాచక పదము Accusative Case లో ఉండును.

(b) నామవాచక పదానికి ముందు 'Preposition' (ప్రిపోసిషన్) అనగా విభక్తి అర్థమిచ్చే ఉపసర్గ ఉండినయెడల ఆ నామవాచక పదము 'అక్యుసేటివ్ కేస్' లో ఉండును.

(c) Accusative Case లో ఉన్న ఒక Noun తో అన్వయింపబడే మరియొక Noun కూడా అట్టి Accusative Case లోనే ఉన్నదని చెప్పవలయును.

ఉ॥ (a) Rama purchased a book. (direct object).

(b) My pen is in the shelf. ఇచట 'in' preposition (ఉపసర్గ) 'shelf' అనే Noun కు ముందున్నది.

(c) I met today Shri K. Kamraj, President of Indian National Congress. ఇచట President అనే నామవాచకము కామరాజ్ (Kamraj) అనే Object గా ఉండే నామవాచకముతో అన్వయించుచున్నది.

II. వాక్యములో Indirect Object గా ఉండే Noun Dative Case (చతుర్థీవిభక్తి) లో ఉన్నదందురు.

ఉ॥ I gave Rama a pencil. ఈ వాక్యములో 'Rama' అనే నామవాచకము Indirect Object. అందువలన యిది 'Dative Case'లో ఉన్నదనవలెను. 'a pencil' అనే నామవాచకము Direct Object. కనుక Accusative Case లో ఉన్నది.

III. షష్ఠీ విభక్తి లేక జెనెటివ్ కేస్ (Possessive Case or Genetive Case) :—

(a) Noun, Singular గా ఉన్నయెడల Possessive Case యేర్పరుచుటకు ఆ Noun కు (') పై కామాతోటి 's' ('s) చేర్పవలెను.

ఉ॥ My brother's book.

(b) Noun బహువచనము (Plural Number) లో ఉన్నచో ఆ Noun కు సామాన్యముగా కడపటనుండే 's' కు (') పై కామా (apostrophe - అపాస్ట్రఫీ) మాత్రమే చేర్చిన యీ Possessive Case ఏర్పడును.

ఉ॥ It is a boys' college.

(c) కడపట 's' లేని అసాధారణమైన Plural Nouns కు (women, children వంటివి) సాధారణ Singular Nouns కు వలె అపోస్ట్రఫీ (') తోటి s చేర్పవలెను.

ఉ॥ Children's Park.

(d) ఒక్క పేరుకు సంబంధించి పెక్కు నామవాచక పదములున్నప్పుడు కడపటిపదము చివర 's చేర్చవలెను.

ఉ॥ The President of India Sri Radhakrishna's salary.

(e) కొన్నిచోట్ల Possessive Case కు తరువాత సాధారణముగావచ్చే Noun లోపించును.

ఉ॥ He is studying in Pachaiappa's. (ఇచట 'College' అనే పదము లోపించినది)

(f) ప్రాణములేని నామవాచకములకు (Nouns) కు Possessive Case ఉపయోగింపరాదు.

ఉ॥ 'The legs of the chair' అనే అనవలెను. కాని 'The chair's legs' అని అనకూడదు. (కుర్చీకాళ్ళు అని ఆంగ్లములో పలికేటందుకు)

(g) 'కాలము', 'దూరము', 'బరువు' లను సూచించే Nouns కు ('s) చేర్చిన Possessive Case యేర్పడును.

ఉ॥ A night's sleep; a mile's race
A kilo's weight; a month's time.

IV. The Nominative of address (The Vocative Case):—

సంబోధన సూచించే నామవాచకమును 'Nominative of address' లో ఉన్నదని చెప్పవలెను.

ఉ॥ O Krishna! come along with me.

ఇచట 'Krishna' ను సంబోధించుటవలన ఆ నామ వాచకము 'Nominative of Address' అని అందుము.

## అభ్యాసము

I. ఈ క్రింది వాక్యములలో యేయే నామవాచకపదములు (Nouns) యేయే Cases లో ఉన్నవో తెలుపుము:—

(1) Gandhiji, the father of the nation taught the Indians non-violence.

(2) Nehru, the first Prime-Minister of India wrote many books.

(3) Rajaji was the last Governor-general of India.

(4) Rajendra Prasad presided over the Constituent Assembly.

(5) Ramayana, the first poet's book tells the story of Sri Rama.

(6) I worked in Pachaiappa's College for two years.

II. ఈ క్రింది వాక్యములలో సాధ్యమైనచోట్ల Nouns ను Possessive Case లోకి మార్చుము (Change into

Possessive Case, the Nouns in the following sentences wherever it is possible :—

(1) I go to the office of my brother.

(2) The dog of the landlord is a dangerous animal.

(3) I have to attend the marriage of my friend.

(4) They have holidays for a month.

(5) The weight of the charcoal bag is six kilos.

(6) One leg of my table is broken.



## 63. The Pronoun (ది ప్రొనౌన్)

### సర్వనామము

ఈ క్రింది వాక్యములను చదువుము (Read the following sentences):—

Sri Rama was the eldest son of king Dasaratha.

Sri Rama married Sita, the daughter of king Janaka.

Sri Rama went to forest with Sita and Lakshmana, Sri Rama's brother.

ఈ పై మూడువాక్యములలో నాల్గుమార్లు Sri Rama పదము వచ్చినది. ఇట్లు పలుమా రాకేశబ్దము వినుటకు యింపుగా ఉండదు. అనవసరమనికూడా తోచును. అట్లుగాకుండా యీ క్రిందివిధమున వ్రాసినయెడల యెంత యింపుగానుండునో చూడుము :—

Sri Rama was the eldest son of king Dasaratha.

He married Sita, the daughter of king Janaka.

He went to forest with her and Lakshmana, his brother.

పై వాక్యములలో శ్రీరామశబ్దము ఒకమారే మొదటి వాక్యములో వచ్చినది. మిగిలిన రెండు వాక్యములలో Sri Rama శబ్దానికి బదులు He, His శబ్దములు వచ్చినవి. రెండవ వాక్యములోని 'Sita' కు బదులు మూడవవాక్యములో 'Her' వచ్చినది. ఇట్లు అసలుపేర్లైన Sri Rama, Sita కు బదులుగా, He, His, Her వచ్చుట అందమిచ్చును

ఇట్లు ముందువాక్యములలో వచ్చిన Nouns కు బదులుగా వచ్చే పదములు Pronouns (సర్వనామము) లందురు.



# 64. Kinds of Pronouns

(కైన్డ్స్ ఆఫ్ ప్రోనౌన్స్)

## సర్వనామముల రకాలు

1. Personal Pronouns (పర్సనల్ ప్రోనౌన్స్) - I, we, thou, you, he, she, it, they మొదలగునవి.

2. Possessive Pronouns (పొసెసివ్ ప్రోనౌన్స్):- My, our, your, his, her, its, their మున్నగునవి.

3. Reflexive Pronouns (రిఫ్లెక్సివ్ ప్రోనౌన్స్) - Myself, ourselves, yourself, yourselves, himself, herself, itself, themselves, etc.

4. Emphasising Pronouns (ఎంఫసైసింగ్ ప్రోనౌన్స్):—Myself, ourselves, yourself, yourselves, himself, herself, itself, themselves, etc.

5. Demonstrative Pronouns (డెమాన్‌స్ట్రేటివ్ ప్రోనౌన్స్):—This, that, these, those.

6. Interrogative Pronouns (ఇంటరాగెటివ్ ప్రోనౌన్స్):—Who, which, what.

7. Relative Pronouns (రిలెటివ్ ప్రోనౌన్స్) :- Who, which, what, that.

8. Indefinite Pronouns(ఇండెఫినిట్ ప్రోనౌన్స్): One, any one, some one, no one, none, any, anybody, anything, some, somebody, everybody, nobody, few, many, others, all, they.

9. Distributive Pronouns (డిస్ట్రిబ్యూటివ్ ప్రోనౌన్స్) :—Each, either, neither.



# 65. Personal Pronouns

(పెర్సనల్ ప్రోనౌన్స్)

## మానవుల నామములు

Persons అనగా మానవుల నామముల (Nouns) కు బదులుగా ఉపయోగింపబడు పదములను Personal Pronouns అని అందురు. ఇందులో మూడు Persons (పురుషము) ఉన్నవి.

First Person (ఫస్ట్‌పర్సన్) :—మాట్లాడేవారికిచెందే Personal Pronouns, First Person లో ఉండును.

ఉ॥ I, we వంటివి. దీనికే ఆంధ్రములో ఉత్తమ పురుషమందురు.

Second Person (సెకెండ్‌పర్సన్) :— ఎవరితో మాట్లాడుచున్నామో, అనగా మన యెదుటివారికి చెందే Personal Pronouns ను 'Second Person' లో ఉన్నవని చెప్పవలెను. You, your మొదలగునవి.

Third Person (తర్డుపర్సన్) ;— మాట్లాడేవానికి, మాటలాడుచుండేవానికిగాక, పరాయివానికి చెందిన Personal

Pronouns ను Third Person లో ఉన్నవందురు. He, she, it, they మొదలగునవి.

Number (వచనము) :— Nouns (నామవాచకము) కు వలెనే, Pronouns (సర్వనామములు) కు కూడా, Singular, Plural Numbers కలవు. Singular Number లో ఉండే Nouns కు బదులుగా వచ్చే Pronouns (సర్వనామములు) Singular Number లోను, Plural Nouns కు బదులు వచ్చే Pronouns, Plural Number లోనే ఉండును.

ఉ॥ I (నేను), You (నీవు), He (వాడు) అనునవి Singular Pronouns. We (మేము), you (మీరు), they (వారు) అనునవి Plural Pronouns.

Gender (లింగము) :—Nouns కు వలెనే Pronouns కు కూడా Gender ఉండును. Number బట్టి, Pronouns మారునట్లే, Gender ను బట్టికూడా Pronouns లో మార్పు జరుగుచుండును.

ఉ॥ He, they :—ఇది పుంలింగాలు.

She, they :—ఇవి స్త్రీలింగాలు.

It, they :—ఇవి నపుంసకలింగాలు.

Case:—Number, Gender వలెనే, Case కూడా, Nouns లోవలె Pronouns కు కూడ కలదు. Nouns కు వలె Pronouns కు (1) Nominative Case (2) Objective Case (3) Possessive Case అని మూడు ముఖ్యమైన Cases కలవు.

Nouns లో Nominative, Objective Cases లో ఒకేరూపములో నుండును. ఒక్క Possessive Case లో మాత్రము మార్పుచెంది ('s) అపోస్ట్రఫీతోటి s తో నుండును.

Pronouns లో అట్లుగాక, మూడు Cases లోను మార్పులుసంభవించి భిన్నరూపములు దాల్చును.

ప్రక్క పేజీలో ఇచ్చిన Table (పట్టీ) లో పైన పేర్కొనబడిన Personal Pronouns లోని వివిధములైన మార్పులు, రూపములు వివరముగా తెలుపబడినవి. గమనింపుము.

Case, Gender, Number (విభక్తి, లింగము, వచనము) బట్టి Personal Pronouns ధరించే వివిధరూపాల జాబితా.

(Table showing the different Personal Pronouns in different cases, genders and numbers)

| Person | Nominative case | | Objective case | | Possessive case | | Remarks |
|---|---|---|---|---|---|---|---|
| | Singular | Plural | Singular | Plural | Singular | Plural | |
| 1. First Person (ఉత్తమ పురుష) | I = నేను | We = మేము, మనము | Me = నన్ను, నాకు | Us = మమ్ము లను, మాకు, మనకు | My = నా యొక్క Mine = నాది | Our = మాయొక్క, మనయొక్క Ours = మనది | |
| 2. Second Person (మధ్యమ పురుష) | Thou } You } = నీవు | You = మీరు | You = మిమ్ము లను, నిన్ను, నీకు, మీకు | You = మిమ్ము, మిమ్ములను, మీకు | Your = నీయొక్క, మీయొక్క Yours = నీది, మీది | Your = మీయొక్క Yours = మీది | ఇందలి యేకవచనం లోని "Thou" ఇప్పుడు వాడుకలో లేదు. You (మీరు) అని బహువచనం లోనే గౌరవంగా వాడుచున్నారు. |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 3. Third Person (ప్రథమ పురుషము) | పుం. లిం. He=వాఁడు, అతడు<br>స్త్రీ లిం. She=ఆమె, ఆపె<br>న. లిం. It=అది | They=అవి, వారు, వారలు | Him=వానిని, అతనిని, వానికి, అతనికి<br>Her=ఆమెను, ఆమెకు<br>It=దానిని, దానికి | Them=వానిని, వాటిని, వారిని, వారలను, వానికి, వాటికి, వారికి, వారలకు | His=వాని యొక్క, వానిది<br>Her=ఆమె యొక్క<br>Hers=ఆమెది<br>Its=దాని యొక్క, దానిది | Their=వారియొక్క, వాటియొక్క<br>Theirs=వారిది, వాటిది |

## 66. Interrogative Pronouns

(ఇంట్రాగేటివ్ ప్రోనౌన్స్)

### ప్రశ్నార్థక సర్వనామములు

'Who, which, what' (ఎవరు. ఏది, ఏమి) అనునవి ప్రశ్నార్థక (Interrogative) సర్వనామములు.

Who (హూ) అనునది - Nominative Case.

Whom (హూమ్) అనునది - Objective Case.

Whose (హూస్) అనునది - Possessive Case.

Which, what అను Interrogative Pronouns కు, Nominative, Objective Cases లో రెంటిలోను ఒకేరూపముండును. వీటికి Possessive Case లేదు.

ఇందులో 'Who', - మనుష్యుల విషయంలోమాత్రమే ఉపయోగింపబడును What (వాట్) వస్తువుల విషయంలో మాత్రమే ఉపయోగింపబడును Which (విచ్) - వస్తువుల విషయంలోను, మనుష్యులవిషయంలోకూడా ఉపయోగింపబడును.

ఈ క్రింది వాక్యములను చదివిన Interrogative Pronouns యొక్క ఉపయోగము తెలియనగును.—

1. Who goes there? (హూగోస్ దేర్) - అచట పోయే దెవరు?
2. Whom do you ask ? (హూమ్ డు యూ అస్క్) నీ వడిగేది యెవరిని?

3. Whose pen is this? (హూస్ పెన్ యిస్ దిస్)- ఈ పేనా ఎవరిది?

4. What is this? (వాట్ యిస్ దిస్) - ఇది యేమి?

5. What do you look at? (వాట్ డూ యు లుకట్) నీవు యేమిటిని చూచెదవు?

6. Which do you want? (విచ్ డు యు వాంట్)- నీవు కోరే దేమిటి?

కొన్ని ముఖ్యమైన సూచనలు:—

సూచన:

Who are you? Who is he? - అని Who తో ప్రారంభించే ప్రశ్నలకు జవాబు, మనిషిపేరు యీయవలెను.

What are you? What is he? - అని What తో అడిగే ప్రశ్నలకు జవాబులో ఆమనిషి ఉద్యోగముగురించి గాని, వృత్తినిగురించిగాని తెలుపవలెను.

What is this? What is it? - వంటి ప్రశ్నలకు జవాబు వస్తువుపేరులోనుండును.

| ప్రశ్న: | జవాబు: |
|---|---|
| ఉ॥ Who are you? | I am Krishnamoorthy. |
| What are you? | I am a teacher. |
| What is this? | This is a book. |

# 67. Relative Pronouns

(రిలేటివ్ ప్రోనౌన్స్)

## సంబంధార్థక సర్వనామములు

ఇంతకుముందు 'Interrogative Pronouns' గా పేర్కొనబడిన who, whom, whose , which, what అను ప్రశ్నార్థక సర్వనామములును. that అను యింకొక సర్వనామమును, ఒక పెద్దవాక్యములోగల రెండు చిన్నవాక్యములను కలుపుచు వాటిమధ్యగల Relationship అనగా సంబంధమును తెలుపుటకు ఉపయోగపడును. అట్లు ఉపయోగబడినప్పుడు యీ who, whom, whose, what, which, that అనునవి Relative Pronouns అని పేర్కొనబడును.

1. Who:- Nominative Caseలో, Masculine and Feminine Genders లో,Singular and Plural Numbers లో - మనుష్యులవిషయంలో మాత్రమే ఉపయోగింపపడును. అసలు రూపములో మార్పుఉండదు

2. Whom :-Objective Case లో, Masculine and Feminine Genders లో, Singular and Plural Numbers లో - మనుష్యులవిషయంలో మాత్రమే ఉపయోగింపబడును. అసలురూపములో మార్పుఉండదు

3. Whose :—Possessive Case లో, Masculine and Feminine Genders లో, Singular and Plural Numbers లో - మనుష్యులకేగాకుండా, వస్తువులకు గూడ ఉపయోగించును.

4. Which :— Nominative and Objective Cases లలోను, Singular and Plural Numbers లోను ఒకేరూపముతో ఉపయోగింపబడును. దీనికి Possessive Case లేదు. వస్తువులకు, జంతువులకు మాత్రమే ఉపయోగమగును.

5. What :—ఏకవచనములో మాత్రమే ఉపయోగింపబడును. దీనికిగూడ Possessive Case లేదు. ఇది వస్తువులకు మాత్రమే ఉపయోగింపబడును. Nominative, Objective Case లలో ఒకే రూపము కలిగియుండును.

6 That :— Singular, Plural Numbers లోను, Nominative, Objective Cases లోను. ఒకే రూపమున ఉపయోగింపబడును. Possessive Case లేదు.

1. WHO (Nominative Case)

(1) I like my father. He buys me books and toys.

I like my father, who buys me books and toys.

(Singular - Masculine Gender)

(2) I went to the station to receive my sister. She came from Madras.

I went to the station to receive my sister, who came from Madras. (Singular - Feminine Gender)

(3) They are poor people. They always beg.

They are poor people, who always beg. (Plural - Masculine Gender)

(4) They are rich ladies. They go daily to cinema.

They are rich ladies, who go daily to cinema. (Plural-Feminine Gender)

2. WHOM (Objective Case)

(1) I love very much my father. I respect him always.

I love very much my father, whom I respect always. (Singular - Masculine Gender)

(2) She is my mother. I always love her.

She is my mother, whom I always love.

(Singular - Feminine Gender)

(3) They are teachers. The Government treats them badly.

They are teachers, whom the Government treats badly.

(Plural - Masculine Gender)

(4) There were many Gopikas in Dwaraka. Sri Krishna married most of them.

There were many Gopikas in Dwaraka, most of whom Sri Krishna married.

(Plural - Feminine Gender)

3. WHOSE (Possessive Case)

(1) Sri Rama Rao is a rich man. His car costs Rs. 30,000.

Sri Rama Rao is a rich man, whose car costs Rs. 30,000.

(Singular - Masculine Gender)

(2) She is a poor woman. Her sari is torn.

She is a poor woman, whose sari is torn.
(Singular - Feminine Gender)

(3) Ramayana is a sacred book. Its poetry is sweet.

Ramayana is a sacred book, whose poetry is sweet.
(Singular - Neuter Gender)

(4) Vedas are our religious books. Their contents are very good.

Vedas are our religious books, whose contents are very good.
(Plural - Neuter Gender)

(5) In Mahabharatha war many ladies became widows. Their husbands died in that war.

In Mahabharatha war many ladies, whose husbands died in that war became widows.
(Plural - Feminine Gender)

(6) They are big merchant princes, Their houses are like palaces.

They are big merchant princes, whose houses are like palaces. (Plural - Masculine Gender)

4. WHICH (Nominative Case)

(1) Mahabharatha is the biggest book in the world. It gives good knowledge.

Mahabharatha, which gives good knowledge, is the biggest book in the world. (Singular - Neuter Gender)

(2) Madras Colleges are all now closed. They will reopen on 1st March, 1965.

Madras Colleges, which will reopen on 1st March 1965, are all now closed. (Plural - Neuter Gender)

WHICH (Objective Case)

(1) I read Shakespeare's Dramas. They are very interesting.

I read Shakespeare's Dramas, which are very interesting.
(Plural - Neuter Gender)

(2) Pothana wrote Bhagavatham. It is full of Bhakthi.

Pothana wrote Bhagavatham, which is full of Bhakthi.
(Singular - Neuter Gender)

5. WHAT (వస్తువులకు మాత్రమే ఉపయోగమగును)

Nominative:—

(1) What you talk must be reasonable.
(Singular - Neuter Gender)

Objective:—

(2) The thief searched and searched and at last, he found what he was searching for.
(Singular - Neuter Gender)

6. THAT (మనుష్యులకు, వస్తువులకు ఉపయోగము)

Nominative and Objective:—

(1) The Magistrate fined the car-driver. He killed a boy by his rash driving.

The Magistrate fined the car-driver, that killed a boy by his rash driving.
(Singular - Masculine - Objective.)

(2) On platforms we see many beggars, They trouble the passers-by.

On platforms we see many beggars, that trouble the passers-by.
(Plural - Masculine - Objective)

(3) All the eyes were on the girl. She danced so well.

All the eyes were on the girl, that danced so well.
(Singular - Feminine - Objective.)

(4) Arjuna brought yadava ladies. They had lost their husbands on the seashore fight.

Arjuna brought yadava ladies, that had lost their husbands on the seashore fight.
(Plural - Feminine - Objective.)

(5) I completely read Sravana Charitra. I purchased it only two days back.

I completely read Sravana Charitra, that I purchased only two days back. (Singular-Neuter-Objective.)

(6) All the vessels were repaired. They were leaking.

All the vessels that were leaking, were repaired.
(Plural - Neuter - Nominative.)

(7) The train is late by two hours. It was stopped on the way by Hooligans.

The train that was stopped on the way by Hooligans, is late by two hours.
(Singular - Neuter - Nominative.)

(8) I got by heart many poems in Sra - vana Charitra. They are very sweet.

I got by heart many poems in Sra-vana Charitra, that are very sweet. (Plural-Neuter-Objecive.)

(9) The girls were highly appreciated. They got more marks than boys in the examination.

The girls that got more marks than boys in the examination, were highly appreciated.
(Plural-Feminine-Nominative.)

(10) The dancing girl is abused by all good people. She leads a bad life.

The dancing girl, that leads a bad life is abused by all good people.
(Singular-Feminine-Nominative.)

(11) Sravana, the hero of Sravana Charitra was a great soul. He inspired Mahatma Gandhi.

Sravana, that inspired Mahatma Gandhi, was a great soul.
(Singular-Masculine-Nominative.)

(12) All those boys were suspended. They misbehaved towards their class teacher.

All those boys, that misbehaved towards their class teacher were suspended.
(Plural-Masculine-Nominative.)

సూచన :

1. Who, what అనే Interrogative Pronouns కు తరువాత 'that' ను ఉపయోగింపవచ్చును.

ఉ॥ Who is that man, that goes there in the street.

What is it that you want.

2. Adjectives (విశేషణాలు) Superlative Degree లో ఉన్నప్పుడు that, ను Relative Pronoun గా ఉపయోగింపవచ్చును.

This is the best book that I have ever read.

3 Antecedent - ఏ వాక్యములోనైనా ఉపయోగింపబడే Relative Pronoun కు, ఆ వాక్యములో దానితో సంబంధముగల నామవాచకమో, (Noun) సర్వనామమో (Pronoun) ఉండును. ఆ Noun లేక Pronoun కు Antecedent అని వ్యాకరణనామము. ఈ Antecedent యొక్క లింగ, పురుష, వచనములు (Gender, Person and Number) మూటిలోనూ దానితోసంబంధముగల Relative Pronoun తో యేకీభవించును. కాని, Case విషయంలో Relative Pronoun దాని Antecedent తో ఒక్కొక్కప్పుడు యేకీభవింపకపోవచ్చును.

## అభ్యాసము

I. పర్సనల్ (Personal Pronouns) పేర్కొని, వాటి నొక్కొక్క దానిని మీ సొంత వాక్యములలో ఉపయోగింపుము :

II. క్రింది ఖాళీలను సరియైన Pronoun తో పూరింపుము :

(1) — is your father?

(2) By — was Ravana killed?

(3) To — are you writing that letter?

(4) I met an orphan — had lost his parents.

(5) I went with — mother to Benares and — wanted to be always with — during journey.

# 68. Adjective (అడ్జెక్టివ్)

## విశేషణము

నామవాచకము (Noun) యొక్క గుణము తెలుపు పదములకు విశేషణము (Adjective) అని పేరు.

ఉ॥ Rama was a great hero. రాముడు గొప్ప వీరుడు. ఇచట 'hero' అను నామవాచకము యొక్క గుణము తెలుపు great అను పదము Adjective. అటులనే

(1) Ravana was a cruel man.
(2) Bhima was a strong person.
(3) Sita was a chaste woman.
(4) The dog is a grateful animal.
(5) The hammer is a useful instrument.

అనే వాక్యములలో క్రింది గీతతో గుర్తింపబడిన 'cruel, strong, chaste, grateful, useful' అను పదములు Adjectives. అవిక్రమముగా, man, person, woman, animal, instrument అను నామవాచకములను qualify చేయుచున్నవి. అనగా పైపేర్కొనబడిన అయిదు విశేషణాలు (Adjectives) వాటి వెనువెంటనే ఉన్న అయిదు విశేష్యముల (Nouns) యొక్క గుణములను తెలుపును.

# 69. Kinds of Adjectives

(క్రైన్డ్స్ ఆఫ్ అడ్జెక్టివ్స్)

## వివిధ విశేషణములు

1. Adjective of Quality(అడ్జెక్టివ్ ఆఫ్ క్వాలిటి)-గుణవిశేషణము.

ఉదా. It is a good book. - ఇచట Book ఎటువంటిదో ఎట్టి గుణముగలదో తెలుపు 'good' అనేపదము గుణ విశేషణమని చెప్పవలయును.

2. Adjective of Quantity (అడ్జెక్టివ్ ఆఫ్ క్వాంటిటీ) (Quantity అనగా పరిమాణము) - పరిమాణమును దెలుపు విశేషణము.

ఉదా. It was a very big paper. - ఇందులో 'paper' యొక్క పరిమాణముతెలుపు 'big' అనేపదము విశేషణము.

3. Adjective of Number (అడ్జెక్టివ్ ఆఫ్ నంబర్) - సంఖ్యదెలుపు విశేషణము - వీటినే 'Numeral Adjectives' సంఖ్యా విశేషణములందురు.

ఉదా. In a week there are seven days. ఇందులో 'days' అను నామవాచకముయొక్క సంఖ్యను

తెలుపు 'seven' విశేషణము. ఈ విశేషణము సంఖ్యాపదము గనుక 'seven' అనే విశేషణము సంఖ్యావిశేషణమని చెప్పుదురు.

4. Demonstrative Adjectives (డెమాన్‌స్ట్రేటివ్ అడ్జెక్టివ్స్).

ఉదా. This story-book is an interesting book. ఈ వాక్యములో మొదటి పదమగు 'This' Story book అనే నామవాచకమును Demonstrate చేయుచున్నది. అనగా చూపుచున్నది.

5. Interrogative Adjectives (ఇంటరాగేటివ్ అడ్జెక్టివ్స్) Pronouns (సర్వనామముల)లోవలె Adjectives లో గూడ ప్రశ్నార్థకములైన వున్నవి. వాటికి Interrogative Adjectives అని పేరు.

ఉదా. What book it is? Whose pen is it?- ఇందులో 'what' అనే పదము 'book' అనే విశేష్యానికి, 'whose' 'pen' కూ విశేషణాలు.



# 70. Formation of Adjectives (ఫార్మేషన్ ఆఫ్ అడ్జెక్టివ్స్)

## విశేషణముల నేర్పరుచుట

I. Nouns (నామవాచకములు లేక విశేష్యము)ల నుండి యేర్పడే విశేషణములు (Adjectives).

| Noun | Adjective |
|---|---|
| బాయ్ Boy - బాలుడు | బాయిష్ Boyish - బాలిశ; బాల్యపు |
| కేర్ Care - జాగ్రత్త | కేర్‌ఫుల్ Careful - జాగ్రతగల |
| ఛియర్ Cheer - ఉల్లాసము; ఉత్సాహము | ఛియర్‌ఫుల్ Cheerful - ఉల్లాసవంతమైన |
| కరేజ్ Courage - ధైర్యము | కరేజస్ Courageous - ధైర్యముగల |
| డేంజర్ Danger - అపాయము | డేంజరస్ Dangerous - అపాయకరమైన |
| డిసీట్ Deceit - మోసము; వంచన | డిసీట్‌ఫుల్ Deceitful - మోసమైన |
| డర్ట్ Dirt - మురికి | డర్టీ Dirty - మురికియైన |
| అర్త్ Earth - భూమి; భూలోకము | అర్త్‌లీ Earthly - భూలోకముతోసంబంధముగల |
| ఎన్వి Envy - అసూయ | ఎన్వియస్ Envious - అసూయగల |

| Noun | Adjective |
|---|---|
| ఫెయిత్ Faith - విశ్వాసము; నమ్మకము | ఫెయిత్‌ఫుల్ Faithful - విశ్వాసముగల<br>ఫెయిత్‌లెస్ Faithless - విశ్వాసములేని |
| ఫేమ్ Fame - కీర్తి | ఫేమస్ Famous - కీర్తివంతమైన |
| ఫూల్ Fool - తెలివిలేనిమనిషి | ఫూలిష్ Foolish - తెలివిలేని; పనికిమాలిన |
| గిఫ్ట్ Gift - సహజశక్తి; బుద్ధిబలము | గిఫ్టెడ్ Gifted - సహజశక్తిగల; బుద్ధిబలముగల |
| గ్లోరీ Glory - ప్రభావము; ప్రఖ్యాతి | గ్లోరియస్ Glorious - ప్రభావముగల, ప్రఖ్యాతిగల |
| గోల్డ్ Gold - బంగారము | గోల్డన్ Golden - బంగారువంటి |
| గిల్ట్ Guilt - నేరము; తప్పు | గిల్టీ Guilty - నేరము లేక తప్పుచేసిన |
| హెల్త్ Health - ఆరోగ్యము | హెల్తీ Healthy - ఆరోగ్యవంతమైన |
| హార్ట్ Heart - హృదయము | హార్టీ Hearty - హృదయపూర్వకమైన<br>హార్ట్‌లెస్ Heartless - హృదయములేని |
| హోప్ Hope - ఆశ | హోప్‌ఫుల్ Hopeful - ఆశగొల్పు<br>హోప్‌లెస్ Hopeless - ఆశలేని |
| హోమ్ Home - ఇల్లు | హోమ్లీ Homely - ఇంటివలె సౌకర్యముగల |

| | |
|---|---|
| హర్ట్ Hurt - హాని; బాధ | హర్ట్‌ఫుల్ Hurtful - హానికరమైన,బాధాకరమైన |
| ఇండస్ట్రి Industry - పరిశ్రమ; పాటు | { ఇండస్ట్రియల్ Industrial - పారిశ్రామికమైన |
| | { ఇండస్ట్రియస్ Industrious - పాటుపడెడు |
| ఇంజరి Injury - హాని | ఇంజురియస్ Injurious - హానికరమైన |
| జాయ్ Joy - సంతోషము | { జాయ్‌ఫుల్ Joyful - సంతోషకరమైన |
| | { జాయస్ Joyous - సంతోషముతో నిండిన |
| కింగ్ King రాజు | కింగ్‌లీ Kingly - రాజోచితమైన |
| నేవ్ Knave - అయోగ్యుడు | నేవిష్ Knavish - అయోగ్యమైన |
| లాఫ్ Laugh - నవ్వు | లాఫబుల్ Laughable - నవ్వుపుట్టించెడు |
| మ్యాన్ Man - పురుషుడు | మ్యాన్‌లీ Manly - పౌరుషముగల |
| మ్యానర్ Manner - మర్యాద | { మ్యానర్‌లీ Mannerly - మర్యాదగల |
| | { మ్యానర్‌లెస్ Mannerless - మర్యాదలేని |
| నిగర్డ్ Niggard - లోభి | నిగర్డ్లీ Niggardly - లోభియైన |
| అవుట్‌రేజ్ Outrage - దౌర్జన్యము | అవుట్‌రేజియస్ Outrageous - దౌర్జన్యమైన |
| ఆర్డర్ Order - వరుస; క్రమము | ఆర్డర్లీ Orderly - క్రమమైన |

| Noun | Adjective |
|---|---|
| పార్డన్ Pardon - క్షమాపణ | పార్డనబిల్ Pardonable - క్షమింపదగిన |
| పీస్ Peace - శాంతి | పీస్ఫుల్ Peaceful - శాంతమైన |
| పిటీ Pity - దయ; కనికరము | పిటీఫుల్ Pitiful - కనికరముగల |
| | పిటియబిల్ Pitiable - కనికరింపదగిన |
| | పిటియస్ Piteous - జాలిగొలుపునట్టి |
| ప్లే Play - ఆట; క్రీడ | ప్లేఫుల్ Playful - ఆటలాడెడు |
| క్వారెల్ Quarrel - కలహము | క్వారల్సం Quarrelsome-కలహమాడునట్టి |
| క్వీన్ Queen - రాణి | క్వీన్లీ Queenly - రాణికిదగిన |
| రిబెల్ Rebel - తిరుగుబాటుదారు<br>రిబెల్లియన్ Rebellion - తిరుగుబాటు | రిబెలియస్ Rebellious - తిరుగబడు స్వభావముగల |
| రిగర్ Rigour - కఠినత్వము | రిగరస్ Rigorous - కఠినమైన |
| రోగ్ Rogue - దొంగ; మోసకాడు<br>రోగరీ Roguery - దొంగబుద్ధి; మోసబుద్ధి | రోగిష్ Roguish - మోసబుద్ధిగల, తప్పుడు బుద్ధిగల |

| | |
|---|---|
| సెన్స్ Sense - తెలివి, ఇంద్రియబోధము అనుభవము | సెన్సిబిల్ Sensible - తెలివిగల<br>సెన్స్‌లెస్ Senseless - తెలివిలేని<br>సెన్సిటివ్ Sensitive - మిక్కిలి వివేకముగ<br>సెన్సువల్ Sensual - ఇంద్రియవాంఛగల<br>సెన్సుఅస్ Sensuous - ఇంద్రియసంబంధమైన |
| షేమ్ Shame - సిగ్గు అవమానము | షేమ్‌ఫుల్ Shameful - అవమానకరమైన<br>షేమ్‌లెస్ Shameless - సిగ్గుమాలిన |
| సిల్క్ Silk - పట్టు | సిల్‌కెన్ Silken - పట్టువలెనున్న |
| సిన్ Sin - పాతకము | సిన్‌ఫుల్ Sinful - పాపకరమైన |
| స్టార్మ్ Storm - తుపాను | స్టార్మీ Stormy - తుపానువచ్చునట్లుండు |
| థ్రిఫ్ట్ Thrift - పొదుపు | థ్రిఫ్టీ Thrifty - పొదుపుగా |
| ట్రబుల్ Trouble - బాధ | ట్రబులస్ Troublous - తొందరపెట్టు<br>ట్రబుల్‌సమ్ Troublesome - బాధాకరమైన |
| ట్రిక్ Trick - జిత్తు | ట్రిక్కిష్ Trickish - జిత్తులమారియైన |
| యూస్ Use - ఉపయోగము; ప్రయోజనము | యూస్‌ఫుల్ Useful ఉపయోగమైన<br>యూస్‌లెస్ Useless - ఉపయోగము లేని |

| Noun | Adjective |
|---|---|
| వెంచర్ Venture - సాహసము | వెంచర్సమ్ Venturesome - సాహసముగల |
| వర్చ్యూ Virtue - మంచిబుద్ధి; నీతి | వర్చు అస్ Virtuous - సాహసముగల |
| వైస్ Vice - చెడుబుద్ధి | వైషస్ Viceous - చెడుబుద్ధిగల |
| వర్త్ Worth - యోగ్యత | వర్తీ Worthy - యోగ్యతగల |

II. క్రియలనుండి పుట్టు విశేషణములు :—

| Verbs (క్రియలు) | Adjectives (విశేషణములు) |
|---|---|
| అబ్సార్బ్ Absorb - పీల్చు | అబ్సార్బెంట్ Absorbent - పీల్చుగల |
| బైట్ Bite - కఱచు | బైటింగ్ Biting కఱచునట్టి |
| సీజ్ Cease - ముగియు | సీజ్లెస్ Ceaseless - ముగియనట్టి |
| డిసైడ్ Decide - నిశ్చయించు | { డిసైసివ్ Decisive - నిశ్చయమైన |
| | డిసైడెడ్ Decided - నిశ్చయింపబడిన } |
| ఈట్ Eat - తిను | ఈటబిల్ Eatable - తినదగిన |
| హంగర్ Hunger - ఆకలిగొను | హంగ్రీ Hungry - ఆకలిగొన్న |

| | |
|---|---|
| లవ్ Love - ప్రేమించు; వలచు | లవ్-సిక్ Love-sick - విరహార్తుడగు<br>లవింగ్ Loving - ప్రేమించెడు<br>లవ్లీ Lovely - అందమైన |
| మువ్ Move - కదలు; కదలించు | మువబిల్ Moveable - కదలునట్టి<br>మొబైల్ Mobile - కదలునట్టి |
| టాక్ Talk - మాట్లాడు | టాకెటివ్ Talkative - మాట్లాడుస్వభావముగల |
| టయర్ Tire - అలయు; అలసిపోవు | టయర్సం Tiresome - అలయునట్టి<br>టయర్లెస్ Tireless - అలసటలేని |
| వేక్ Wake - మేల్కొల్పు | వేక్ఫుల్ Wakeful - మేల్కొనియుండు. |

III. విశేషణజన్యమైన విశేషణములు :—

| | |
|---|---|
| బ్లాక్ Black - నల్లనైన | బ్లాకిష్ Blackish - కొంచెము నల్లనైన |
| రెడ్ Red - ఎఱ్ఱని | రెడ్డిష్ Reddish - ఒకమోస్తరుగా ఎఱ్ఱని |
| సిక్ Sick - రోగియైన | సిక్లీ Sickly - రోగిష్టియైన |
| వైట్ White - తెల్లని | వైటిష్ Whitish - కొంచెము తెల్లని |
| ట్రాజిక్ Tragic - దుఃఖకరమైన | ట్రాజికల్ Tragical - దుఃఖకరమైన |
| హోల్ Whole - పూర్తిగా | హోల్సం Wholesome - ఆరోగ్యకరమైన |

# 71. Numeral Adjectives

(న్యూమరల్ అడ్జెక్టివ్స్)

## సంఖ్యా విశేషణములు

ఇవి మూడు విధములు :—

1. Definite Numeral Adjectives (డెఫినిట్ న్యూమరల్ అడ్జెక్టివ్స్) సరిగా సంఖ్యను తెలుపు విశేషణములు.

ఉదా. one, two, three (1, 2, 3) మొదలగునవి Cardinals (కార్డినల్స్).

First, second, third (I, II, III) మొదలగునవి Ordinals (ఆర్డినల్స్).

2. Indefinite Numeral Adjectives (ఇండెఫినిట్ న్యూమరల్ అడ్జెక్టివ్స్) ఇవి నిశ్చితమైన సంఖ్య తెలుపని విశేషణములు.

ఉదా. All - అన్ని, Any - ఏదైన, ఏవైన, Few - కొన్ని, కొద్ది, Many - చాలా, None - ఏవియులేని, Some - కొన్ని, Several - అనేకమైన - మున్నగునవి.

3. Distributive Numeral Adjectives (డిస్ట్రిబ్యూటివ్ న్యూమరల్ అడ్జెక్టివ్స్) ఇవి ఒకసంఖ్యలో ప్రతి దానిని తెలుపు విశేషణాలు.

ఉదా. Each(girl)-ప్రతి(బాలిక), Every (person)-ప్రతి (మనిషి), Either (book) - ఏ (పుస్తక) మైనా Neither (word) - ఏ (మాటయు) లేదు.

సూచన:—

ఈ క్రిందివికూడా సంఖ్యావిశేషణములే :—

డబుల్ Double - రెండింతలు

ట్రెబిల్ Treble - మూడింతలు

ట్రిపిల్ Triple - మూడింతలు

ఫోర్ఫోల్డ్ Four-fold - నాల్గింతలు

టెన్ఫోల్ Ten-fold - పదింతలు

థవుజండ్ఫోల్డ్ Thousand-fold - వేయింతలు

ఒన్స్ Once - ఒకమారు

ట్వైస్ Twice - రెండుమార్లు

త్రైస్ Thrice - మూడుమార్లు

ఫోర్ టైమ్స్ Four times - నాల్గుమార్లు

హండ్రడ్ టైమ్స్ Hundred times - నూరుమార్లు



# 72. Opposite words - List of Antonyms

(ఆపోజిట్ వర్డ్స్ - లిస్ట్ ఆఫ్ ఆంటొనిమ్స్)

## వ్యతిరేకపదముల పట్టిక

| Words | Antonyms |
|---|---|
| ఎబౌ Above - పైన | బిలో Below - క్రింద |
| అక్సెప్ట్ Accept - అంగీకరించు | రిజెక్ట్ Reject - తిరస్కరించు |
| అరైవల్ Arrival - రాక | డిపార్చర్ Departure - పోక |
| అసెండ్ Ascend - ఎక్కు | డిసెండ్ Descend - దిగు |
| అట్రాక్ట్ Attract - ఆకర్షించు | రిపెల్ Repel - అస్యహించుకొను |
| బార్బరస్ Barbarous - అనాగరికమైన | సివిలైజ్డ్ Civilized - నాగరికమగు |
| బేస్ Base - నీచమైన | నోబుల్ Noble - ఉన్నతమగు |

బిడ్ Bid - ఆజ్ఞాపించు
బ్లంట్ Blunt - మొద్దుగానుండు
బోల్డ్ Bold - ధైర్యముగల
బ్రైట్ Bright - కాంతివంతమైన
బ్రాడ్ Broad - వెడల్పయిన
బయ్ Buy - కొను
కేర్ Care - జాగ్రత్తపడు
ఛియర్ఫుల్ Cheerful - ఉల్లాసముగా
సివిల్ Civil - మర్యాదగా
కండెమ్ Condemn - ఖండించు
డిమినిష్ Diminish - తగ్గించు
డీప్ Deep - లోతైన
డిఫికల్ట్ Difficult - కష్టమైన
డిలిజెంట్ Diligent - పాటుపడు
డొసైల్ Docile - లొంగెడు
డ్రై Dry - పొడిగానున్న

ఫర్బిడ్ Forbid - నిషేధించు
షార్ప్ Sharp - పదునైన
టిమిడ్ Timid - పిరికి
డల్ Dull - కాంతిలేని
న్యారో Narrow - ఇరుకైన
సెల్ Sell - అమ్ము
నెగ్లక్ట్ Neglect - అశ్రద్ధచేయు
ఛియర్లెస్ Cheerless - నిరుత్సాహముగా
ర్యూడ్ Rude - మోటుగా
అప్రూవ్ Approve - ఒప్పుకొను
ఇన్క్రీస్ Increase - ఎక్కించు
ష్యాలో Shallow - లోతులేని
ఈజీ Easy - సులభమైన
ఐడిల్ Idle - సోమరియగు
స్టబ్బర్న్ Stubborn - మొండియగు
వెట్ Wet - తడియైన

| Words | Antonyms |
|---|---|
| ఎర్లీ Early - పెందలకడనే | లేట్ Late - ఆలస్యముగా |
| ఎన్కరేజ్ Encourage - ప్రోత్సహించు | డిస్కరేజ్ Discourage - నిరుత్సాహపరుచు |
| ఎన్‌త్రోన్ Enthrone - గద్దెనెక్కించు | డీత్రోన్ Dethrone - గద్దెదించు |
| ఎక్‌స్టీరియర్ Exterior - వెలుపలనున్న | ఇంటీరియర్ Interior - లోపలనున్న |
| ఎక్‌స్ట్రావగెంట్ Extravagant - దుబారాగా | ఫ్రూగల్ Frugal - పొదుపుగా |
| ఫాల్స్ False - అబద్ధమైన | ట్రూ True - నిజమైన |
| ఫ్రెష్ Fresh - తాజాయైన | స్టేల్ Stale - నలిగిన (చల్లబడిన) |
| గో Go - పొమ్ము | కమ్ Come - రమ్ము |
| హార్డ్ Hard - గట్టియైన | సాఫ్ట్ Soft - మెత్తని |
| - కఠినమైన | ఈజీ Easy - సులభమైన |
| హేట్ Hate - ద్వేషించు | లవ్ Love - ప్రేమించు |
| ఇన్ In - లోపల | అవుట్ Out - బయట |
| జూనియర్ Junior - చిన్న | సీనియర్ Senior - పెద్ద |
| కీన్ Keen - చురుకైన | డల్ Dull - మొద్దైన |

| | |
|---|---|
| నాలెడ్జ్ Knowledge - విజ్ఞానము | ఇగ్నోరెన్స్ Ignorance - అజ్ఞానము |
| లీనియంట్ Lenient - ధారాళమైన | రిగరస్ Rigorous - కఠినమైన |
| మైనర్ Minor - వయసురానివాడు | మేజర్ Major - వయసువచ్చినవాడు |
| మేక్ Make - చేయు | మార్ Mar - చెరుచు |
| నోబుల్ Noble - గొప్ప | ఇగ్నోబుల్ Ignoble - మర్యాదలేని |
| ఓరల్ Oral - వాగ్రూపకమైన | రిటన్ Written - వ్రాతమూలకమైన |
| పర్మనెంట్ Permanent - ఖాయమైన | టెంపొరరీ Temporary - తాత్కాలికమైన |
| ప్రిఫిక్స్ Prefix - ముందుచేర్చునది | సఫిక్స్ Suffix - వెనుకచేర్చునది |
| రిచ్ Rich - ధనికుడైన | పూర్ Poor - పేదవాడైన |
| రిసీవ్ Receive - తీసికొను | గివ్ Give - ఇచ్చివేయు |
| సే Say - చెప్పు (ఔనని) | గెయిన్‌సే Gainsay - కాదనిచెప్పు |
| సెన్సిబిల్ Sensible - తెలివిగల | సెన్స్‌లెస్ Senseless - బుద్ధిలేని |
| స్ట్రేంజ్ Strange - పరిచయములేని | ఫెమిలియర్ Familiar - పరిచయమైన |
| స్ట్రిక్ట్ Strict - కఠినమైన | లాక్స్ Lax - సులభమైన |
| సింపతి Sympathy - సానుభూతి | ఆంటిపతి Antipathy - అయిష్టము |
| థిక్ Thick - మందమైన | థిన్ Thin - పలుచని |

| Words | Antonyms |
| --- | --- |
| యూస్‌ఫుల్ Useful - ఉయోగకరమైన | యూస్‌లెస్ Useless - నిరుపయోగమైన |
| వెర్టికల్ Vertical - నిలువుగా | హారిజాంటల్ Horizontal - అడ్డముగా |
| వెట్ Wet - తడియైన | డ్రై Dry - పొడియైన |
| వైల్డ్ Wild - క్రూరమైన | డొమెస్టిక్ Domestic - సాధువైన |
| విక్టరి Victory - విజయము | డిఫీట్ Defeat - ఓటమి |



# 73. Adjectives - Degrees of Comparison

(అడ్జెక్టివ్స్ - డిగ్రీస్ ఆఫ్ కంపేరిసన్)

## విశేషణములు - తరతమభేదములు

I am a tall man. నేను పొడవుగా నున్నాను. ఈ వాక్యములో నా పొడవునుగురించిమాత్రమే తెలుపబడినది కాని ఎంతపొడవు ఉన్నదను ప్రసక్తియేలేదు. కనుక యీ వాక్యములోని 'Tall' అను విశేషణము Positive Degree లో ఉన్నదని చెప్పబడినది.

He is a taller man than myself: ఈ వాక్యములోని 'Taller' శబ్దము నాకన్న వాడు ఎక్కువ పొడవుఉన్నవాడని తెలుపును. అనగా నా పొడవును వాని పొడవుతో పోల్చితే అనగా Compare చేస్తే (పోల్చుటకు Compare అందురు) వాని పొడవే ఎక్కువ ఉన్నదన్నమాట. కనుక యీ వాక్యములోని 'Taller' అను విశేషణము Comparative Degree లో ఉన్నదని చెప్పనగును.

You are the tallest man of all the three of us - మనముగ్గురిలో నీవే ఎక్కువ పొడవుగా ఉన్నమనిషివి.- ఈ వాక్యములోని 'Tallest' విశేషణము నీపొడవు, నాపొడవు కన్న, వానిపొడవుకన్నకూడా ఎక్కువయని తెలుపుచున్నది. కాన

'Tallest' అను విశేషణము 'Superlative Degree' లో ఉన్నదందురు.

ఈ విధముగా పోలికలవలన యేర్పడే విశేషణములలోను, ఆ విశేషణములుపయోగించే వాక్యాలలోకూడా మార్పు లేర్పడును.

విశేషణపదములలో యేర్పడిన మార్పులు—

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Tall | Taller | Tallest |

అనగా పాజిటివ్ (Positive) డిగ్రీలోని విశేషణ పదానికి, Comparative Degree లో 'er', ఎక్కువగాను, Superlative Degree లో 'est' ఎక్కువగాను వచ్చినవి.

ఆ విశేషణములుపయోగించుటవలన, వాక్యాలలో యేర్పడిన మార్పులు:—

1. Comparative Degree వాడిన వాక్యములో విశేషణశబ్దానికి 'er' అనునది ఎక్కువకావడమే కాకుండా, అవిశేషణముతో 'than' అనే క్రొత్త శబ్దముకూడా వచ్చినది.

2. Superlative Degree వాడిన Sentence లో 'Tall' అనే Adjective కు 'est' ఎక్కువగాచేరడమే కాకుండా, ఆ విశేషణానికి ముందు 'the' అనుపదమును, వెనుక 'of' అను పదమును ఎక్కువగాచేర్చినవి.

I. ఇట్లు, 'er' 'est' చేర్పుతో Comparative, Superlative యేర్పడే విశేషణాల పట్టిక :—

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Able | Abler | Ablest |
| Bold | Bolder | Boldest |
| Cheap | Cheaper | Cheapest |
| Dull | Duller | Dullest |
| Easy | Easier | Easiest |
| Fair | Fairer | Fairest |
| Fine | Finer | Finest |
| Great | Greater | Greatest |
| Hard | Harder | Hardest |
| Happy | Happier | Happiest |
| Kind | Kinder | Kindest |
| Large | Larger | Largest |
| Long | Longer | Longest |
| Mean | Meaner | Meanest |
| Noble | Nobler | Noblest |
| Old | Older | Oldest |
| Poor | Poorer | Poorest |
| Quick | Quicker | Quickest |
| Red | Redder | Reddest |

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
| --- | --- | --- |
| Small | Smaller | Smallest |
| Tall | Taller | Tallest |
| Wet | Wetter | Wettest |
| Wide | Wider | Widest |
| Wise | Wiser | Wisest |
| Young | Younger | Youngest |

సూచన 1 :

పైన పేర్కొనబడిన Adjectives లో Positive Degree లో నున్న Adjective (విశేషణము) 'e' తో అంతమైన 'Able' వంటివి కేవలము 'r' మాత్రమే చేర్చుట వలన Comparative Degree యు (Able+r=Abler), 'st' (est కాదు) మాత్రమే చేర్చుటవలన 'Superlative Degree' యు యేర్పడిన విషయము గమనింపదగును. అట్టి విశేషణపదములు మరికొన్ని యీక్రింద యీయబడినవి :—

II.

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
| --- | --- | --- |
| Brave | Braver | Bravest |
| Pure | Purer | Purest |
| True | Truer | Truest |
| White | Whiter | Whitest |

సూచన 2 :

Positive Degree లో 'y' చివరగల విశేషణములలో ఆ 'y' ముందుగా హల్లు ఉంటే ఆ 'y' 'i' గా మారి 'er' ను చేర్చుకొని Comparative Degree యు 'est' ని చేర్చుకొని Superlative Degree యు యేర్పడును.

ఉదా. Easy (Positive) Easier(Comparative) Easiest (Superlative) - పై పట్టీలో యివ్వబడిన 'Happy, Happier, Happiest' కూడా యిట్టిదే. అట్టివే మరికొన్ని విశేషణముల జాబితా :—

III.

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Dry | Drier | Driest |
| Heavy | Heavier | Heaviest |
| Lazy | Lazier | Laziest |
| Healthy | Healthier | Healthiest |
| Merry | Merrier | Merriest |
| Sorry | Sorrier | Sorriest |
| Mighty | Mightier | Mightiest |
| Ugly | Uglier | Ugliest |
| Wealthy | Wealthier | Wealthiest |

సూచన 3:

Positive Degree లో ఒకేసిలబులు ఉండి, హ్రస్వముగా నుచ్చరింపబడు అచ్చునకు పిమ్మట ఒకేహల్లుతో అంతమయ్యే విశేషణాలలో, చివరిహల్లు రెట్టింపబడి, er, est లతోచేరి Comparative, Superlative Degree లుయేర్పడును.

IV.

ఉదా.

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Big | Bigger | Biggest |
| Fat | Fatter | Fattest |
| Hot | Hotter | Hottest |
| Red | Redder | Reddest |
| Sad | Sadder | Saddest |
| Thin | Thinner | Thinnest |
| Wet | Wetter | Wettest |

సూచన 4:

రెండుకన్న ఎక్కువగా Syllables ఉండే విశేషణాలన్నియును, రెండు Syllables గలవి కొన్నియును, Positive రూపమునకు, ముందు 'More, Most' ల నుంచుటవలన Comparative, Superlative Degree రూపములను బొందును.

ఉదా:

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Beautiful | More beautiful | Most beautiful |
| Comfortable | More comfortable | Most comfortable |
| Difficult | More difficult | Most difficult |
| Expensive | More expensive | Most expensive |
| Learned | More learned | Most learned |
| Industrious | More industrious | Most industrious |
| Proper | More proper | Most proper |
| Splendid | More splendid | Most splendid |
| Useful | More useful | Most useful |

సూచన 5 :

కొన్ని Adjectives వేర్వేరు డిగ్రీలలో వేర్వేరురూపములను ధరించును.

ఉదా:

| Positive Degree | Comparative Degree | Superlative Degree |
|---|---|---|
| Bad (Ill) | Worse | Worst |
| Far | Farther | Farthest |
| Fore | Former | Foremost, first |
| Good (Well) | Better | Best |
| Late | Later, Latter | Latest, Last |
| Little | Less, Lesser | Least |
| Much, Many | More | Most |
| Nigh | Nigher | Nighest, Next |
| Old | Older, elder | Oldest, eldest |

సూచన 6 :

ఒక Degree లో ఉన్న Adjective ను, దాని భావమును చెడకుండా, ఇతర డిగ్రీలలోనికి మార్చనగును.

ఉదా.—1

Rama is one of the best boys in the school. (Superlative)

Rama is better than most other boys in the school. (Comparative)

Very few boys in the school are so good as Rama. (Positive)

ఉదా:—2

Calcutta is the biggest city in India. (Superlative)

Calcutta is bigger than all other cities in India. (Comparative)

No other city in India is so big as Calcutta. (Positive)

పై వాక్యాలలో డిగ్రీల మార్పువలన గలిగిన మార్పులను జాగ్రత్తగా పరిశీలించి అట్టి వాక్యాలను నీ సొంతముగా ఎన్ని వ్రాయగలిగితే అన్ని వ్రాయుటకు అభ్యాసముచేసుకొనుము.

# 74. Articles (ఆర్టికల్స్)

A, An — అనునవి Indefinite (ఇండెఫినిట్) Articles.

The — అనునది Definite (డెఫినిట్) Article.

ఈ ఆర్టికల్స్ కూడా విశేషణములవలె నామవాచకము (Nouns) లకు ముందు వచ్చి ఆ నామవాచకములను qualify చేయును.

ఉదా. A boy, An apple, The man.

అందువలన Articles కూడా Adjectives అనియే చెప్పనగును. కాని వీటికి వ్యాకరణశాస్త్రజ్ఞులు Articles అని ప్రత్యేకముగా నామకరణముచేశారు.

I. A, An:—1. వీటిని ఏకవచనములోనుండేCommon nouns కు ముందు ఉంచవలెను. కాని Material nouns కు ఉంచకూడదు.

A అనునది, నామవాచకముయొక్క మొదటి అక్షరము హల్లుగా:నున్నచో వచ్చును. అది అచ్చుగానున్నచో An వచ్చును.

ఉదా. A cat, An attack.

2. నామవాచకపదములోని మొదటి యక్షరము 'h' గా ఉండి, అది ఉచ్చారణలో పలుకకున్నచో, an వచ్చును.

ఉదా: An hour (అన్ అవర్) - ఒకగంట.

An honest person (ఆనెస్ట్) - నీతిమంతుడైన ఒక మనిషి.

An heir (ఎయ్ర్) - వారసుడు.

3. 'u' అనే అక్షరము అచ్చుఅయినప్పటికి, అది 'యు' కారముతో దీర్ఘముగా పలికేచోట u లో ప్రారంభమయ్యే మాటలకు ముందు A యే ఉపయోగించవలెను.

ఉదా. A (not An) Uniform; A University.

4. 'O' అనే అక్షరముకూడ అచ్చు (Vowel) అయినను, అది 'వ' కారముగా (హల్లుగా) పలికే 'one' అనే 'O' తో ప్రారంభమయ్యే పదానికి ముందు 'An' బదులు 'A' వచ్చును.

ఉదా. A one anna coin; A one rupee note.

II.

The—(1) మనకిదివరకు పరిచయమై, నిశ్చితముగా తెలిసిన, యిదివరలో చెప్పబడిన మనుష్యుని పేరుకుగాని, వస్తువు పేరుకుగాని ముందు The వచ్చును. The Principal of the Pachaiappa's College is a well-known man.

(2) ఏకవచనములో (Singular) నున్న Common Nouns అన్నిటికి ముందు 'The' వచ్చును. The lion is the king of forest.

(3) సృష్టిలో ఒకే వస్తువుగా నున్నదానిని, దానియొక్క ఏకత్వమును తెలుపుటకు దానిముందు 'the' ఉపయోగింతురు.

ఉదా. The sun rises in the east; The sky; The moon.

(4) నదులు (Rivers), సముద్రములు (Seas), మహా సముద్రములు (Oceans), పర్వతాలు (Mountains) మున్నగువాని పేర్లముందు 'The' వచ్చును.

ఉదా. The Ganges rises in the Himalayas and falls into the Bay of Bengal.

The Arabian Sea and the Indian Ocean are in the west and south of our Country respectively.

(5) ప్రఖ్యాత గ్రంథనామములముందు 'The' వచ్చును.

ఉదా. The Vedas, the Puranas, the Bible, the Koran, the Epics, the Ramayana and the Mahabharatam contain the same noble principles.

(6) Superlative Degree లో వచ్చే Adjective కుముందు 'The' వచ్చును.

ఉదా. The Pacific is the deepest of all Oceans.

(7) Common nouns, Abstract nouns గా ఉపయోగించేటప్పుడు, ఆ nouns కు ముందుగా 'the' వచ్చును.

ఉదా. He played the Villain (the role or the part of the Villain).

(8) విశేష్యముగా ఉపయోగింపబడే విశేషణానికి ముందు 'the' వచ్చును.

ఉదా. The poor (Poor people) are always at the mercy of the rich (rich men).

(9) Comparative Degree లో ఉండే adjectives ను క్రియావిశేషణాలు (Adverbs) గా ఉపయోగించేటప్పుడు, ఆ విశేషణాలకుముందు 'the' వచ్చును.

ఉదా. The poorer the people, the greater the suffering.

## అభ్యాసము

I. క్రింది పదములకు విశేషణ (Adjective) రూపముల వ్రాయుము:—

Absorb, boy, cheer, decide, eat, fool, glory, hurt, love, move, talk, red, whole, use, venture.

II. క్రింది వాక్యములలో ఖాళీలను పూర్తిచేయుము :—

1. He is — clerk in — Taluq Office.
2. — Mango is — .
3. Rama is — — boy in — College.
4. China Bazaar is broad, but the Broadway is — .
5. My brother gives me — day — Rupee.
6. The Motor car goes — than a Jutka.

III. ఈ క్రింది వాక్యములను, వాటిలోని భావము చెడకుండా, యితర Degrees లోకి మార్చి వ్రాయుము :—

(1) The Indus is the longest of Indian rivers.

(2) The Godavari is longer than all other rivers in the south.

(3) The Mahabharata is one of the biggest books in the world.

(4) No other animal is so huge as the elephant.

(5) There is no other paper having so high a circulation as 'the Hindu'.

(6) Gold is costlier than all other metals.

(7) No other ocean is so deep as the Pacific.

(8) The banyan tree lives longer than any other tree in India.

(9) No fruit is so sweet as the mango fruit.

(10) No other animal on the earth is so much faithful as the dog.

(11) Mount Everest is the highest peak in the world.

(12) Tiger is the most ferocious of all the wild animals.



# 75. The Verb (ది వెర్బ్)

## క్రియ

Verb అనగా ప్రధానమైన పలుకు అని అర్థము: వాక్యములో verb ప్రధానమైనది. Verb లేని వాక్యమే ఉండదు. ఒకమనిషిని గురించి గాని, వస్తువునుగురించిగాని, మరి దేనిని గురించియైనా చెప్పుమాటను verb (క్రియ) అని అందురు.

క్రియచేయుపనులు :— (1) వాక్యములో కర్త యేమి చేయునో తెలుపును.

ఉదా. Student reads విద్యార్థి చదువును.— ఇచట కర్తయైన Student యేమిచేయునో, Reads అనే క్రియ (verb) తెలుపుచున్నది.

(2) కర్తకు యేమిజరిగినదో తెలుపును.

ఉదా. The book is lost - పుస్తకము పోయినది. (పోగొట్టుకొనబడినది) - ఇచట కర్తయైన పుస్తకానికి is lost అనే verb (క్రియ) యేమిజరిగినదో తెలుపుచున్నది.

(3) కర్తయొక్క స్థితిని లేక గుణమును తెలుపును.

ఉదా. The dog is grateful - కుక్క విశ్వాసము గలదిగా నున్నది—ఇచట is grateful అనే verb కర్తయైన Dog యొక్క స్థితి లేక గుణమును తెలుపుచున్నది.

కనుక వచ్చుట, పోవుట, కూర్చుండుట, నిలుచుట. ఉండుట, పండుట, వండుట మొదలగునవన్నియు పనులే. ఇట్టి పనులను తెలుపు పదములకే verbs (క్రియలు) అని పేరు.

ఒక క్రియలో ఒకటిగాని, అంతకన్న ఎక్కువగాగాని పదములుండవచ్చును.

ఉదా. The farmer ploughs (ఒక పదము) - రైతు దున్నును.

The farmer is ploughing (రెండు మాటలు) రైతు దున్నుచున్నాడు.

The farmer has finished ploughing (మూడు పదాలు) రైతు దున్నడము ముగించినాడు.



# 76. Transitive and Intransitive Verbs

## (ట్రాన్సిటివ్ అండ్ ఇంట్రాన్సిటివ్ వెర్బ్స్)

## సకర్మక - అకర్మక క్రియలు

1. సకర్మక క్రియలు - అనగా కర్మపదముగల క్రియలు.

2. అకర్మక క్రియలు - అనగా కర్మపదములేని క్రియలు.

ఉదా. (1) I bought a pen - ఇచట bought అను క్రియకు 'a pen' అను కర్మపదము గలదు - కనుక 'bought' సకర్మక క్రియ (Transitive verb.)

(2) She sings a song—'sings' 'అనే క్రియకు' సాంగ్ (Song) అనేది - కర్మపదము. కనుక 'Sings' Transitive verb.

(3) She sings well—'sings' అను క్రియకు కర్మ పదము లేదు. కనుక యిది Intransitive verb (అకర్మక క్రియ). Sings వలె కొన్ని కర్మపదము కలవి, లేనివి verbs కలవు.

Come, go, die, lie, sleep, peep మొదలగు క్రియలు ఎప్పటికి అకర్మక(Intransitive) క్రియలే. సకర్మకము (Transitive) గా ఉపయోగపడవు.



# 77. The Complement
## (ది కాంప్లిమెంట్)

పైన పేర్కొనబడిన అకర్మకక్రియ అగు 'sings' ఉపయోగించిన 'She sings well' అనే వాక్యములో well అనేది sings అనే క్రియాభావము పూర్తి (complete) చేయుచున్నది. అనగా sings పాడును అనగా ఎట్లు పాడినదో well అనుపదము తెలిపి, ఆ 'sings' అనే క్రియయొక్క భావమును పూర్తిచేయుటవలన, 'well' అనేపదము Complement అని పిలువబడుచున్నది.

She is a girl.

The fruit tastes sweet.

The flower smells sweet.

ఈ వాక్యాలలో క్రింద గీతలుగల పదములు Complements.

girl = Noun

sweet = Adjective

Complement గా Noun, లేక Adjective ఉండును.



# 78. Tense (టెన్స్)

## కాలము

తెలుగులో వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము లున్నట్లే ఆంగ్లభాషలో Present tense (వర్తమాన కాలము), Past tense (భూతకాలము), Future tense (భవిష్యత్కాలము) అని మూడు కాలములు గలవు.

ఉదా. 1. I go to town - నేను టౌనుకు పోదును (ఇప్పుడు) - వర్తమానకాలం.

2. I went to town - నేను టౌనుకుపోతిని (ఇంతకు ముందు) - భూతకాలం.

3. I shall go to town - నేను టౌనుకు పోవుదును (ఇకముందు) - భవిష్యత్కాలం.

పై మూడువాక్యాలలో మొదటిదానిలో go (పోవుట) అనే పని యిప్పుడే జరుగునట్లు తెలుపుచున్నది. ఇట్లు వర్తమాన (జరుగుచుండు) కాలమును తెలుపు go వంటి క్రియలు వర్తమాన కాలములో (Present tense) లో ఉన్నవనవలెను.

పై రెండవవాక్యములో పోవుట అనేపని జరిగిపోయినట్లు 'went' అను క్రియవలన తెలియుచున్నది. కనుక యిట్లు జరిగి

పోయినకాలమునుగూర్చి తెలుపు 'went' వంటి క్రియలు Past (అయిపోయిన) tense (కాలము) లో ఉన్నవందురు.

పై మూడవవాక్యములోని 'Shall go' అనే క్రియ ఇకముందు జరుగబోయే పనినిగూర్చి తెలుపును. అట్లు తెలుపు క్రియలు Future (రాబోవుకాలము లేక భవిష్యత్) tense (కాలము) లో ఉన్నవని చెప్పనగును.

ఈ విధముగా ప్రతిక్రియకు ముఖ్యమైన కాలములుమూడు ఉన్నవి :— (1) Present tense (2) Past tense (3) Future tense.

ఈ ఒక్కొక్క Tense కు మరల ఆకాలస్థితినిబట్టి నాలుగేసి అంతర్భాగములుకలవు. చూడుము.

I. Present tense (వర్తమాన కాలము):—

1. I go to town - నేను టౌనుకుపోదును (Simple present)

2. I am going to town - నేను టౌనుకు పోవుచున్నాను (Present continuous)

3. I have gone to town - నేను టౌనుకు పోయియుంటిని (Present perfect)

4. I have been going to town - నేనుటౌనుకు పోవుచూఉంటిని (Present perfect continuous)

పై నాల్గు వాక్యాలలోని go, am going, have gone, have been going అను నాలుక్రియలు, ఒక వర్త మానకాలమును (Present tense) గురించియే తెలుపును. కాని అవి నాలుగును భిన్నములైనవి.

మొదటివాక్యములోని 'go' అనే క్రియ 'పోవుట' ను గూర్చి నిశ్చితముగా తెలుపదు. కనుక యిది కేవలము Simple present లేక Present indefinite tense అని చెప్పుదురు. (Indefinite అనగా అనిశ్చితమైనదని అర్థము).

రెండవవాక్యములోని 'am going' 'అనే క్రియ' 'పోవుట' అనుపని యింకను (యిప్పుడుగూడ) జరుగుచున్నట్లు 'పోవుచున్నాను' అని తెలుపుచుండుటవలన 'am going' అనే క్రియ (Verb) Present continuous tense లో ఉన్న దనవలెను.

మూడవవాక్యములోని 'have gone' అను క్రియ 'పోవుట' అనేపని అప్పుడే అయిపోయినట్లు తెలుపును. కనుక 'have gone' Present perfect tense లో ఉన్న క్రియ అని చెప్పనగును.

కడపటి (నాల్గవ) వాక్యములోని 'have been going' అనేక్రియ పోవుట అనేపని ఇదివరకే ఆరంభమై, యింకనూ, యిప్పటికిగూడా జరుగుచూ ఉన్నదని తెలుపుచున్నది. అట్టి

క్రియలు Present perfect continuous tense లో ఉన్నవందురు.

పైన తెలుపబడిన ఉదాహరణవాక్యాలవలన, వివరణవలన ఒక్కొక్క క్రియయు కేవలము tense (కాలమునే)కాక, ఆక్రియ చేసేపనియొక్క స్థితినిబట్టిగూడా రూపమును మారుచుండునని తెలుసుకొనవలెను.

ఇట్లు Present tense కు వలెనే Past, Future tenses కు గూడా ఒక్కొక్కదానికి నాలుగేసి అంతర్భాగముల వంతున మొత్తముమీద 12 tenses యేర్పడునని ఈ క్రింద నీయబడిన Past, Future tense ల యొక్క ఉదాహరణము లనుబట్టి తెలియనగును.

II. Past tense:—

1. I went to town - నేను టౌనుకు పోతిని (Past indefinite)

2. I was going to town - నేను టౌనుకు పోవుచుంటిని (Past continuous)

3. I had gone to town - నేను టౌనుకు పోయియుంటిని (Past perfect)

4. I had been going to town - నేను టౌనుకు పోవుచూ ఉంటిని (Past perfect continuous)

III. Future tense:—

1. I shall go to town - నేను టౌనుకు పోదును (Future indefinite)

2. I shall be going to town - నేను టౌనుకు పోవుచూ నుండగలను (Future continuous)

3. I shall have gone to town - నేను టౌనుకు పోయియుండి యుందును (Future perfect)

4. I shall have been going to town - నేను టౌనుకు పోవుచూయుండి యుందును (Future perfect continuous)



## 79. Agreement of the Verb

(అగ్రిమెంట్ ఆఫ్ ది వెర్బ్)

ఏవాక్యములోనైనా, అందులోని కర్తయే Person (పురుషము), Number (వచనము) లోనుండునో, ఆ కర్త యొక్క క్రియకూడా అదే పురుష, వచనములను కలిగియుండును.

ఉదా. 1. I go to town-నేను టౌనుకు పోదును (1st Person - Singular number)

2. We go to town - మేము టౌనుకు పోదుము (1st Person - Plural number)

3. You go to town - నీవు టౌనుకు పోదువు (II Person-Singular number)

4. You go to town - మీరు టౌనుకు పోదురు (II Person-Plural number)

5. He goes to town - వాడు టౌనుకు పోవును (III Person-Singular number)

6. They go to town - వారు టౌనుకు పోదురు (III Person - Plural number)

ఈ పై వాక్యాలలో Subject (కర్తకు) పిమ్మటనే Verb (క్రియ) ఉన్నది. అట్లుగాకుండా క్రియకు పిమ్మట కర్త

వచ్చే వాక్యాలరకాలుకూడా కొన్నికలవు. అందులోకూడా, కర్తకు, క్రియకు పురుష, వచనముల (Person and Number) విషయములలో ఏకీభావముండును. అట్టి వాక్యాలు 'There' అను పదముతో ఆరంభమగునవియు, ప్రశ్నార్థక వాక్యములుగాను ఉండును.

ఉదా. I. There was a farmer.

There were farmers.

There are many shops in this town.

But there is only one shop in that town.

మొదటి రెండు There తో ఆరంభమైన వాక్యాలు. వీటిలో was, were క్రియలు. వాటివెనుక farmer, farmers ఆ వాక్యాలలో కర్తలు.

కాని వీటిలోకూడా farmer అను Singular కర్తకు was అనే Singular verb క్రియయే ఉన్నది. అట్లనే మిగత వాక్యాలలో.

II. Is he a bright boy?

Are they bright boys?

ఇవి ప్రశ్నార్థకవాక్యాలు. వీటిలోకూడా Is, Are అనే Verbs కు వెనుకనే Boy, Boys కర్తలు వచ్చినవి. ఇందులో కూడ వచనం విషయంలో కర్త, క్రియ ఏకీభవించును.

III. Husband and wife work hard for their livelihood.

ఈ వాక్యములో Subject (కర్త) Husband and wife. Husband, Wife వేర్వేరుగా Singular (ఏక వచన) నామవాచకములైనా, రెండు and తో కలిసినపుడు బహు వచన కర్తయగును. అందువలన work అను బహువచనక్రియ వచ్చినది.

IV. Each student has a book.

Every school has its own building.

వీటిలో Student (మొదటివాక్యంలో)ను, School (రెండవవాక్యంలో) ను కర్తలు. ఈ కర్తలకు ముందు, Each, Every పదాలుతో వచ్చినపుడు కర్తపదములు (Subject words) Singular గానే ఉండును. Subjects ను బట్టి అందలి క్రియ (Verb) కూడ (Singular) గా ఉండును.



# 80. Strong and Weak Verbs

(స్ట్రాంగ్ అండ్ వీక్ వెర్బ్స్)

పైన వివరింపబడిన 12 tenses లకుగాను యీయబడిన ఉదాహరణలలో క్రియ రూపము ముఖ్యముగా మూడు విధాలుగా మారుచుండుట తెలియనగును. ఈమూడు క్రియారూపములకు Present, Past, Past Participle అని పేరు— go, (Present) went(Past) gone(Past-Participle). ఇట్లు Present tense లో ఉన్న రూపమునకు, Past tense రూపము భిన్నరూపముగానున్నయెడల ఆ Verb (క్రియ) Strong Verb అని తెలియనగును. అట్లుగాక Present tense లో ఉండే క్రియారూపానికి చివరి d, ed, t మొదలగు ఉపసర్గలు చేరుటవలన, Past tense యేర్పడితే అట్టి Verbs (క్రియలు) Weak Verbs అని తెలియనగును.

ఈ క్రింద కొన్ని Strong Verbs యొక్కయు, మరి కొన్ని Weak Verbs యొక్కయు రూపము లీయబడినవి. జాగ్రత్తగా గమనింపుము.

List of the Verbs :—

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| (వర్తమానకాలం) | (భూతకాలం) | (తద్ధర్మకాలం) |
| అబైడ్ - Abide | అబోడ్ - Abode | అబోడ్ - Abode |
| అరైస్ - Arise | అరోస్ - Arose | అరిసన్ - Arisen |
| అవేక్ - Awake | అవోక్ - Awoke | అవేకన్ - Awaken |
| బేర్ - Bear (Carry) | బోర్ - Bore | బోర్న్ - Borne |
| బీట్ - Beat | బెట్ - Beat | బీటన్ - Beaten |
| బికం - Become | బికేమ్ - Became | బికమ్ - Become |
| బిగిన్ - Begin | బిగాన్ - Began | బిగన్ - Begun |
| బిగెట్ - Beget | బిగాట్ - Begot | బిగాటన్ - Begotten |
| బిహోల్డ్ - Behold | బిహెల్డ్ - Beheld | బిహెల్డ్ - Beheld |
| బిడ్ - Bid | బెడ్ - Bade - బిడ్-Bid | బిడన్ - Bidden |
| బైండ్ - Bind | బౌండ్ - Bound | బౌండ్ - Bound |
| బైట్ - Bite | బిట్ - Bit | బిటన్ - Bitten |

| | | |
|---|---|---|
| బ్లో - Blow | బ్లూ - Blew | బ్లౌన్ - Blown |
| బ్రేక్ - Break | బ్రోక్ - Broke | బ్రోకన్ - Broken |
| బ్రింగ్ - Bring | బ్రాట్ - Brought | బ్రాట్ - Brought |
| బిల్డ్ - Build | బిల్ట్ - Built | బిల్ట్ - Built |
| బర్న్ - Burn | బరంట్ - Burnt | బరంట్ - Burnt |
| బయ్ - Buy | బాట్ - Bought | బాట్ - Bought |
| చైడ్ - Chide | చిడ్ - Chid | చిడ్ - Chid |
| ఛూస్ - Choose | ఛోస్ - Chose | ఛోజన్ - Chosen |
| క్లీవ్ - Cleave | క్లోవ్ - Clove | క్లోవెన్ - Cloven |
| | క్లెఫ్ట్ - Cleft | క్లెఫ్ట్ - Cleft |
| క్లింగ్ - Cling | క్లంగ్ - Clung | క్లంగ్ - Clung |
| కమ్ - Come | కేమ్ - Came | కమ్ - Come |
| డిగ్ - Dig | డగ్ - Dug | డగ్ - Dug |
| డూ - Do | డిడ్ - Did | డన్ - Done |
| డ్రా - Draw | డ్రూ - Drew | డ్రాన్ - Drawn |
| డ్రింక్ - Drink | డ్రాంక్ - Drank | డ్రంక్ - Drunk |

| Present tense (వర్తమానకాలం) | Past tense (భూతకాలం) | Past participle (తద్ధర్మకాలం) |
|---|---|---|
| డ్రైవ్ - Drive | డ్రోవ్ - Drove | డ్రివన్ – Driven |
| ఈట్ - Eat | ఏట్ - Ate | ఈటన్ – Eaten |
| ఫాల్ - Fall | ఫెల్ - Fell | ఫాలన్ – Fallen |
| ఫైట్ - Fight | ఫాట్ - Fought | ఫాట్ – Fought |
| ఫైండ్ - Find | ఫవుండ్ – Found | ఫవుండ్ – Found |
| ఫ్లింగ్ - Fling | ఫ్లంగ్ – Flung | ఫ్లంగ్ – Flung |
| ఫ్లై - Fly | ఫ్లూ – Flew | ఫ్లవన్ – Flown |
| ఫర్బేర్ - Forbear | ఫోర్బోర్ – Forbore | ఫోర్బోర్న్ – Forborne |
| ఫర్బిడ్ - Forbid | ఫర్బేడ్ – Forbade | ఫర్బిడన్ – Forbidden |
| ఫర్గెట్ Forget | ఫర్గాట్ – Forgot | ఫర్గాటన్ – Forgotten |
| ఫర్సేక్ - Forsake | ఫర్సూక్ – Forsook | ఫర్సేకన్ – Forsaken |
| ఫర్స్వేర్ - Forswear | ఫర్స్వోర్ – Forswore | ఫర్స్వోర్న్ – Forsworn |
| ఫ్రీజ్ - Freeze | ఫ్రోజ్ – Froze | ఫ్రోజన్ – Frozen |

| | | |
|---|---|---|
| గెట్ - Get | గాట్ – Got | గాట్, – Got, గాటన్ Gotten |
| గివ్ - Give | గేవ్ – Gave | గివన్ – Given |
| గో - Go | వెంట్ – Went | గాన్ – Gone |
| గ్రైండ్ - Grind | గ్రౌండ్ - Ground | గ్రౌండ్ - Ground |
| గ్రో - Grow | గ్రూ – Grew | గ్రోన్ - Grown |
| హైడ్ - Hide | హిడ్ – Hid | హిడ్ - Hid, హిడన్-Hidden |
| హోల్డ్ - Hold | హెల్డ్ - Held | హెల్డ్ - Held |
| నో - Know | న్యూ - Knew | నోన్ - Known |
| లై - Lie | లే - Lay | లెయిన్ - Lain |
| రైడ్ - Ride | రోడ్ - Rode | రిడన్ - Ridden |
| రింగ్ - Ring | రాంగ్ - Rang | రంగ్ - Rung |
| రైస్ - Rise | రోస్ - Rose | రిజన్ - Risen |
| రన్ - Run | ర్యాన్ - Ran | రన్ - Run |
| సీ - See | సా - Saw | సీన్ - Seen |
| షేక్ - Shake | షూక్ - Shook | షేకన్ - Shaken |
| షైన్ - Shine | షాన్ - shone | షాన్ - Shone |

| Present tense<br>(వర్తమానకాలం) | Past tense<br>(భూతకాలం) | Past participle<br>(తద్ధర్మకాలం) |
|---|---|---|
| షూట్ - Shoot | షాట్ - Shot | షాట్ - Shot |
| ష్రింక్ - Shrink | ష్రాంక్ - Shrank | ష్రంక్ - Shrunk |
| సింగ్ - Sing | సాంగ్ - Sang | సంగ్ - Sung |
| సింక్ - Sink | సాంక్ - Sank | సంక్ - Sunk |
| సిట్ - Sit | సాట్ - Sat | సిట్ - Sit |
| స్లే - Slay | స్లూ - Slew | స్లెయిన్ - Slain |
| స్లైడ్ - Slide | స్లిడ్ - Slid | స్లిడ్ - Slid |
| స్లింగ్ - Sling | స్లంగ్ - Slung | స్లంగ్ - Slung |
| స్లింక్ - Slink | స్లంక్ - Slunk | స్లంక్ - Slunk |
| స్మైట్ - Smite | స్మోట్ - Smote | స్మిటన్ - Smitten |
| స్పీక్ - Speak | స్పోక్ - Spoke | స్పోకన్ - Spoken |
| స్పిన్ - Spin | స్పన్ - Spun | స్పన్ - Spun |
| స్ప్రింగ్ - Spring | స్ప్రాంగ్ - Sprang | స్ప్రంగ్ - Sprung |

| | | |
|---|---|---|
| స్టాండ్ - Stand | స్టుడ్ - Stood | స్టుడ్ - Stood |
| స్టీల్ - Steal | స్టోల్ - Stole | స్టోలన్ - Stolen |
| స్టిక్ - Stick | స్టక్ - Stuck | స్టక్ - Stuck |
| స్టింగ్ - Sting | స్టంగ్ - Stung | స్టంగ్ - Stung |
| స్టింక్ - Stink | స్టాంక్ - Stank | స్టంక్ - Stunk |
| స్ట్రైడ్ - Stride | స్ట్రోడ్ - Strode | స్ట్రిడన్ - Stridden |
| స్ట్రయిక్ - Strike | స్ట్రక్ - Struck | స్ట్రక్ - Struck |
| స్ట్రింగ్ - String | స్ట్రంగ్ - Strung | స్ట్రంగ్ - Strung |
| స్ట్రైవ్ - Strive | స్ట్రోవ్ - Strove | స్ట్రివన్ - Striven |
| స్వేర్ - Swear | స్వోర్ - Swore | స్వోర్న్ - Sworn |
| స్విమ్ - Swim | స్వామ్ - Swam | స్వమ్ - Swum |
| స్వింగ్ - Swing | స్వంగ్ - Swung | స్వంగ్ - Swung |
| టేక్ - Take | టుక్ - Took | టేకన్ - Taken |
| టేర్ - Tear | టోర్ - Tore | టోర్న్ - Torn |

| Present tense (వర్తమానకాలం) | Past tense (భూతకాలం) | Past participle (తద్ధర్మకాలం) |
|---|---|---|
| త్రో - Throw | త్రూ - Threw | త్రోన్ - Thrown |
| ట్రెడ్ - Tread | ట్రాడ్ - Trod | ట్రాడ్ - Trod<br>ట్రాడన్ - Trodden |
| వేర్ - Wear | వోర్ - Wore | వోర్న్ - Worn |
| వీవ్ - Weave | వోవ్ - Wove | వోవన్ - Woven |
| విల్ - Will | వుడ్ - Would | వుడ్ - Would |
| విన్ - Win | వన్ - Won | వన్ - Won |
| వైండ్ - Wind | వూండ్ - Wound | వూండ్ - Wound |
| రింగ్ - Wring | రంగ్ - Wrung | రంగ్ - Wrung |
| రైట్ - Write | రోట్ - Wrote | రిటన్ - Written |

List of some Weak Verbs :—

(a) ed తో Past tense యేర్పడే Verbs :—

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Add | Added | Added |
| Bow | Bowed | Bowed |
| Crush | Crushed | Crushed |
| Deliver | Delivered | Delivered |
| Fail | Failed | Failed |
| Gain | Gained | Gained |
| Heap | Heaped | Heaped |
| Jump | Jumped | Jumped |
| Kill | Killed | Killed |
| Lash | Lashed | Lashed |
| Mend | Mended | Mended |
| Push | Pushed | Pushed |
| Remark | Remarked | Remarked |
| Switch | Switched | Switched |
| Train | Trained | Trained |
| Work | Worked | Worked |

(b) d' మాత్రమే చేరి Past tense యేర్పడే కొన్ని Weak Verbs :—

| | | |
|---|---|---|
| Advise | Advised | Advised |
| Believe | Believed | Believed |
| Cane | Caned | Caned |

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Live | Lived | Lived |
| Love | Loved | Loved |
| Move | Moved | Moved |
| Practise | Practised | Practised |

(c) ed' చేరేటప్పుడు Present tense form చివరి హల్లు రెట్టింపయ్యే Verbs :—

| | | |
|---|---|---|
| Bar | Barred | Barred |
| Bat | Batted | Batted |
| Cap | Capped | Capped |
| Dip | Dipped | Dipped |
| Fit | Fitted | Fitted |
| Glut | Glutted | Glutted |
| Gut | Gutted | Gutted |
| Lug | Lugged | Lugged |
| Inter | Interred | Interred |
| Nip | Nipped | Nipped |
| Quit | Quitted | Quitted |
| Rip | Ripped | Ripped |
| Sip | Sipped | Sipped |
| Sup | Supped | Supped |
| Tin | Tinned | Tinned |
| Tip | Tipped | Tipped |

(d) ఇతర Weak Verbs :—

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Bend | Bent | Bent |
| Beseach | Besought | Besought |
| Bleed | Bled | Bled |
| Breed | Bred | Bred |
| Bring | Brought | Brought |
| Build | Built | Built |
| Burn | Burnt | Burnt |
| Buy | Bought | Bought |
| Catch | Caught | Caught |
| Creep | Crept | Crept |
| Deal | Dealt | Dealt |
| Dwell | Dwelt | Dwelt |
| Feed | Fed | Fed |
| Feel | Felt | Felt |
| Flee | Fled | Fled |
| Have | Had | Had |
| Keep | Kept | Kept |
| Kneel | Knelt | Knelt |
| Lay | Laid | Laid |
| Lead | Led | Led |
| Learn | Learnt | Learnt |
| Leave | Left | Left |
| Lend | Lent | Lent |

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Lose | Lost | Lost |
| Make | Made | Made |
| Mean | Meant | Meant |
| Meet | Met | Met |
| Pay | Paid | Paid |
| Say | Said | Said |
| Seek | Sought | Sought |
| Sell | Sold | Sold |
| Send | Sent | Sent |
| Shoe | Shod | Shod |
| Sleep | Slept | Slept |
| Smell | Smelt | Smelt |
| Spell | Spelt | Spelt |
| Spend | Spent | Spent |
| Sweep | Swept | Swept |
| Teach | Taught | Taught |
| Tell | Told | Told |
| Think | Thought | Thought |
| Weep | Wept | Wept |
| Will | Would | Would |
| Shall | Should | Should |
| Can | Could | Could |
| May | Might | Might |

(e) Present, Past, Past participle రూపములు మూడును ఒకేరీతిగా నుండే Verbs:—

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Burst | Burst | Burst |
| Cast | Cast | Cast |
| Cost | Cost | Cost |
| Cut | Cut | Cut |
| Hit | Hit | Hit |
| Hurt | Hurt | Hurt |
| Let | Let | Let |
| Put | Put | Put |
| Read | Read (రెడ్) | Read (రెడ్) |
| Rid | Rid | Rid |
| Set | Set | Set |
| Shed | Shed | Shed |
| Shut | Shut | Shut |
| Slit | Slit | Slit |
| Split | Split | Split |
| Spread | Spread | Spread |
| Thrust | Thrust | Thrust |

(f) Weak రూపము Strong రూపము రెండును గల Verbs (క్రియలు):—

| Present tense | Past tense | Past participle |
|---|---|---|
| Awake | Awoke (Strong) | Awaken |
| | Awaked(Weak) | Awaked |
| Crow | Crew (Strong) | |
| | Crowed (Weak) | Crowed |
| Hang | Hung (Strong) | Hung |
| | Hanged (Weak) | Hanged |
| Thrive | Throve(Strong) | Thriven |
| | Thrived(Weak) | Thrived |
| Light | Lit (Strong) | Lit |
| | Lighted (Weak) | Lighted |
| Wake | Woke (Strong) | Woken |
| | Waked (Weak) | Waked |



# 81. Active and Passive Voice

## (ఆక్టివ్ అండ్ పాసివ్ వాయిస్)

## కర్త్రర్థక - కర్మార్థక ప్రయోగములు

1. Rama killed Ravana - రాముడు రావణుని చంపెను.
2. Ravana was killed by Rama-రావణుడు రాముని చేత చంపబడెను.

రాముడు రావణుని చంపెనను ఒకే విషయమును రెండు విధాలుగా చెప్పవచ్చునని పైరెండు వాక్యములవలన తెలియు చున్నది. వాక్యములు రెండురూపములలో భిన్నముగానున్నను విషయములో మాత్ర మొకటే.

మొదటివాక్యమైన ‘ Rama killed Ravana ’ లో Rama అనే Subject (కర్త) Killed (చంపెను) అనే పనిని చేసినట్లు తెలుపుచున్నది. ఇట్లు కర్తచేసినపని కర్తయే చేసి నట్లు తెలిపే Killed అనేక్రియ కర్త్రర్థకము (Active Voice) లో ఉన్నదని చెప్పవలెను.

రెండవవాక్యమైన ‘Ravana was killed by Rama’ లో Ravana అనేపదము కర్తస్థానములో నున్నది కాని Killed (చంపుట) అనే పనిని ఈ కర్త Ravana (రావణుడు) చేయలేదు. ఆపనిచేసినవాడు Rama (రాముడు)

అనేపదముకర్మస్థానంలో ఉంటున్నది. కనుక యిందులోని 'was killed' అనే క్రియ కర్మార్థకము (Passive Voice) లో ఉన్నది.

ఈ క్రింది వాక్యములలో ఒక Voice నుండి యింకొక Voice కు మారేటప్పుడు, ఆ వాక్యములోని వివిధ పదముల స్థానములలోను, రూపములలోను కలిగే మార్పులను జాగ్రత్తగా గమనింపుము :—

(1) Valmiki wrote Ramayana (Active, Past, Singular.)

Ramayana was written by Valmiki (Passive, Past, Singular.)

(2) Scholars write books (Active, Present, Plural.)

Books are written by scholars (Passive, Present, Plural.

(3) Good boys will write all answer papers (Active, Future, Plural)

All answer papers will be written by good boys (Passive, Future, Plural)

1. పై వాక్యములు Active నుండి Passive కు మారేటప్పుడు, అన్ని కాలములలోను, అన్ని వచనములలోను

ఆవాక్యాలలోని క్రియ (Verb) కు, Past Participle రూపముకలుగుచున్నది.

ఉదా. Write, Wrote, Will write కు Written రూపముకలిగినది.

2. Past participle రూపముతోకూడా, was, are, will be అను 'to be' అను Verb యొక్క వివిధరూపములు ఆ Past participle కు ముందుగాచేరినవి —

ఉదా.

Ramayana was written—(Past-Singular)

Books are written—(Present-Plural)

Answer Papers will be written—(Future-Plural)

మరికొన్ని ఉదాహరణలు :—

(1) I saw a dog—A dog was seen by me.

(2) We saw dogs—Dogs were seen by us.

(3) Rama killed Rakshasas—Rakshasas were killed by Rama.

(4) Krishna ate butter — Butter was eaten by Krishna.

(5) The teacher beats the boys—Boys are beaten by the teacher.

(6) Girls got good marks—Good marks are got by girls.

(7) Boys will write their examinations soon—Their examinations will be written by the boys soon.

(8) Farmers sow the seeds in the field—Seeds are sown in the field by the farmers.

(9) Artists will draw pictures—Pictures will be drawn by the artists.

పై వాక్యములను జాగ్రత్తగా పరిశీలించిన నీకు Active voice నుండి Passive voice లోకి వాక్యములను మార్చేటప్పుడు యేయే మార్పులు యెక్కడెక్కడ యెట్లెట్లు కలుగునో తెలియగలవు. వాటిని 1, 2, 3 అని నెంబరువేసి. నీయంత నీవు స్వంతముగా వ్రాసి, యీ క్రింద నీయబడిన పట్టికతో పోల్చి సరిచూచుకొనుము :—

1. Active voice లోని వాక్యములో కర్మ (Object) స్థానమందున్న పదము, లేక పదములు Passive voice లో కర్త (Subject) స్థానము నాక్రమించును.

2. Active voice వాక్యములో కర్త (Subject) స్థానమందున్న పదము లేక పదములు Passive voice లో కర్మసానములోనికి వెళ్ళును.

3. Active voice లోను Passive voice లోను కూడా, ఆయావాక్యాలలోని Subject word ఏవచనములో ఉంటే అందలి Predicate లేక Verb (క్రియ), అదేవచనములో నుండును.

4. పైన చెప్పినట్లుగా Active voice లోని క్రియకు, Passive voice లో Past participle రూపమువచ్చును.

5. ఆ Past participle రూపానికి ముందుగా 'to be' యొక్క వివిధ రూపాలలో, యేదో ఒకరూపము వచన, కాల, లింగాదులనుబట్టి వచ్చును.

6. Active voice లేని 'by' అనే Preposition Passive Voice లో వచ్చును. ఆ 'by' కి తరువాత Active voice వాక్యములో Subject స్థానములో ఉన్న పదము Passive voice లో Object స్థానమునకు వచ్చును.

సూచనలు :—

1. Active voice లోని వాక్యమందలి కర్మ Passive voice లోని వాక్యములో కర్తస్థానమునకువచ్చును గనుక కర్మ లేని (అకర్మక) క్రియలకు అనగా Intransitive verbs కు Passive voice రూపములేదని తెలియవలెను.

2. సర్వనామములు (Pronouns) కర్తగా ఉన్న Active voice లోని వాక్యము Passive voice లోకి మార్చ

బడినపుడు, ఆ కర్తపదము Object స్థానమునకు పోవుచు, Objective case రూపమును పొందును. అటులనే Object స్థానములో నున్నపదము Subject స్థానమునకు పోవుచు Nominative రూపమును పొందును.

ఉ॥ He (1) brought me (2) here—Active voice.

I (2) was brought here by him (1)—Passive voice.

పై ఉదాహరణములో Active voice వాక్యములో కర్తగా ఉన్న He అనే సర్వనామము Passive voice వాక్యములో him (Objective case) రూపముపొందినది — ఈ పదము 1 గా గుర్తింపబడినది. Active voice వాక్యములో 2 గా గుర్తింపబడిన 'me' అనే సర్వనామము అచట Objective case రూపముతో నుండగా Passive voice వాక్యములో 'I' అను Nominative case రూపమును పొందును.

3. పై ఉదాహరణము, దాని వివరణమును బట్టి Pronouns (సర్వనామములు) Subject (కర్త) స్థానమునందుండవలసివచ్చినప్పుడు Nominative case రూపమును, Object (కర్మ) సానమునందుండునప్పుడు Objective case రూపమును పొందునని రూఢిగా తెలియనగును.

4. ఏ Active voice వాక్యములోనైనా రెండు Objects ఉన్నప్పుడు ఆ వాక్యము Passive voice లోనికి మారునపుడు రెండు విధములుగా నుండును.

ఉదా.

Active voice:— He gave me a book:— ఈ వాక్యములో (1) me, (2) book - అను రెండు Objects కలవు.

Passive voice:— (1) I was given a book. (2) A book was given to me. రెండు విధముల Passive voice వాక్యాలు.

పై Passive voice లోని రెండవవాక్యములో Active voice లో లేని 'to' వచ్చినది గమనింపవలెను.

## అభ్యాసము

I. ఈ క్రింది వాక్యములను, అందలి Voice ను మార్చి వ్రాయుము :

(1) Rama married Sita.

(2) I heard his speech.

(3) My book was taken by him.

(4) The cow gives milk.

(5) His teacher took him to the Zoo.

(6) Taxes are paid by the people.

(7) My father bought me new books.

(8) Boys play Cricket.

(9) Songs are sung by the girls.

(10) My grand mother told me a story.

(11) This pen was purchased by my brother.

(12) This watch was given to me by my friend during my marriage.

II. Fill up the blanks in the following sentences-క్రింది వాక్యములలోని ఖాళీలను పూరింపుము:—

(1) My father — to Bombay yesterday.

(2) My mother is—now in the Kitchen.

(3) My brother — his S. S. L. C. this year.

(4) Boys always — in the playground.

(5) This bus — to Madhavaram.

(6) That train — from Culcutta.

(7) My grandmother — to Benares tomorrow.

(8) Each boy in this class—a note book.

(9) Every girl in the school—good dress now.

(10) Rama and Lakshmana — brothers.

(11) Rama — brother of Lakshmana.

(12) The hare and the tortoise — a race.

(13) We — meet again tomorrow.

(14) He — come to Madras next month.

(15) Govind and Gomati — husband and—.

(16) My father—my mother—to Madras —Calcutta Mail — night

III. Point out whether the following Verbs are strong or weak and give the past and past participle forms of each of those Verbs :-

(1) Arise (2) Bleed (3) Bid (4) Chide (5) Dwell (6) Flee (7) Kneel (8) Lie (9) Lose (10) Mean (11) Pay (12) Read (13) Sleep (14) Sing (15) Swim (16) Sweep (17) Swear (18) Tread (19) Think (20) Tear (21) Weep (22) Will (23) Wring.



## 82. The Participle and the Gerund
(ది పార్టిసిపిల్ అండ్ ది జెరన్డ్)

Participles రెండు విధములు :—(1) Present participle (2) Past participle.

Present tense లోని Verb (క్రియ) రూపానికి 'ing' చేర్చిన Present participle యేర్పడును.

ఉదా. Go (Present tense)—Going (Present participle).

ఈ Present participle కు ముందు is, was, will be, shall be మొదలగు to be యొక్క రూపాలు వచ్చుటచేత, Present continuous tense యేర్పడును.

ఉదా,—

(1) The girl is singing.

(2) The boys are playing.

(3) Boys were going to school.

(4) That girl was coming from the school.

(5) I shall be giving alms everyday.

(6) He will be coming tomorrow.

Past participle రూపాలు, 'Strong and weak verbs' జాబితాలనుండి గ్రహింపవలసియుండును.

Past participle కు ముందు to be యొక్క రూపమువచ్చి Passive voice యేర్పడును.

ఉదా.—

Ravana was killed by Rama.

Past participle కు ముందు had, has, have వచ్చి Perfect tense యేర్పడును.

ఉదా.—

He has come from Madras.

They have gone to Bombay.

She had taken my note-book last week.

Participles నామవాచకము (Noun) ను ఒక్కొక్కప్పుడు Qualify చేయును. అట్లు చేయునప్పుడు అవి Adjective (విశేషణము) పనిచేయును.

అందువలన Participles కు Verbal adjectives అనికూడా పేరుగలదు.

ఉదా.—

(1) A rolling stone gathers no moss.

(2) All the passed candidates in the S. S. L. C. got employment.

పై వాక్యాలలో Rolling, Passed అనే Present, Past participles stone, candidates అనే నామవాచకములను Qualify చేయుచున్నది. అందువలన యీ rolling, passed అనేవి Verb (క్రియ) రూపములో నుండేAdjectives అనగా Verbal Adjectives.



## 83. Gerund (జెరన్డ్)

Participles విశేషణము పనిచేయగా, Gerund నామవాచకము పనినిచేయును. కనుక Gerund ను Verbal noun అందురు. Gerund కూడ Participle వలెనే ing తో అంతమగును.

ఉదా.—

(1) I Like going to Cinema.

(2) Coming in the hot sun caused me fever.

ఈ పై వాక్యాలలో 1-వ వాక్యములో Going అనునది Like అనే Verb కు (క్రియకు) Object (కర్మ) గా నామవాచకము (Noun) పనిచేయుచున్నది. రెండవవాక్యములో 'Coming' అనే పదము Subject గా ఉపయోగింపబడినది. కనుక ఇదికూడా, నామవాచకముపనినే చేయుచున్నది. ఇట్లు నామవాచకము పనిచేసే Verbs (క్రియారూపాలు) Gerunds.



## 84. Phrase and Clause(ఫ్రేస్ అండ్ క్లాస్)

Phrase, Clause కూడా Sentence వలె కొన్ని మాటలసమూహాలె. కాని Sentence లో సంపూర్ణమైన భావ ముండును. Phrase లోను, clause లోను అటువంటి సంపూర్ణ భావముండదు.

Phrase లో సంపూర్ణభావము ఉండకుండపోవడమే కాకుండా, క్రియకూడా ఉండదు. Clause లో సంపూర్ణభావము మాత్రముండదుకాని, క్రియ (verb) ఉంటుంది.

ఉదా.—

He came here.—Sentence
(అతడు ఇచ్చటికి వచ్చెను.)

He, having come here—Phrase
(అత డిచ్చటికి వచ్చి–)

As he comes here—Clause
(అత డిచ్చటికి రాగా)

Phrases ను clauses గా మార్చవచ్చును.

ఉదా.—

(1) He, having come here, ate his meals. ఇతడు యిచ్చటికివచ్చి, భోజనముచేసెను. ఇందులో having come here అనే మాటల సమూహము Phrase.

After he came here, he ate his meals.
అతడు, ఇచటికి వచ్చినవెనుక, భోజనముచేసెను.

ఇందులో After he came here అనే మాటల సమూహము having come here అనే Phrase స్థానములో వచ్చిన Clause. having come here అనే మాటల సమూహములో Finite verb లేదు. After he came here అనే మాటలసమూహములో came అనే Finite verb ఉన్నది. రెంటి అర్థము ఒక్కటే. కాని రూపములు వేరుగానున్నవి.

(2) Having studied well, he passed his examination. బాగుగాచదివి, అతడు పరీక్షలో నెగ్గెను.

As he studied well, he passed his examination. బాగుగా చదివినందువలన అతడు పరీక్షలోనెగ్గెను.

(3) Running very fast, he could not catch the train. చాలావేగముగా పరుగెత్తి, అతడు రైయిను పట్టుకొనలేక పోయెను.

Though he ran very fast, he could not catch the train. అతడెంతత్వరగా పరుగెత్తి నప్పటికిని, రైయినును పట్టుకొనజాలక పోయెను.

(4) Reading daily this Angleya Bodhini, you will soon learn English. ప్రతి దినము యీ ఆంగ్లేయభోదినిని చదివితే నీవు త్వరలో యింగ్లీషును నేర్చు కొందువు.

If you read daily this Angleya Bodhini, you will soon learn English. నీవు ప్రతిదినము, యీ ఆంగ్లేయభోదినిని చదివినట్లయితే త్వరలో యింగ్లీషు నేర్చు కొందువు.



## 85. The Infinitive (ది ఇన్ఫినిటివ్)

## క్రియధాతురూపము

1. I play games-నేను ఆటలాడుదును.

2. I go to play games-నేను ఆటలాడుటకు పోదును.

పై వాక్యములందు మొదటిదానియందుండు Play అను verb అందలి Subject (కర్త) అయిన 'I' (నేను) అనే సర్వనామానికి Predicate గా ఉన్నది.

రెండవవాక్యములోని Play కి 'I' Subject కాదు. దానికి కర్తయేలేదు. కర్తఉన్న మొదటివాక్యములోని Play ని Finite verb అందురు. కర్తలేని రెండవవాక్యములోని Play ని దానికి ముందువచ్చిన 'to' తో కూడాకలిపి (To play) 'Infinitive' అని అందురు.

ఇటి Infinitive లో Present tense లోని క్రియా పదములకు ముందు 'to' అనే Preposition ఉంచితే చాలు, ఎన్ని Infinitive లు అయిన యేర్పడుతవి.

ఉదా.—

To go, to come, to eat, to sleep, to play, to read, to write, to fight, to meet మొదలగునవి.

ఇట్టి Infinitive వలని ఉపయోగములు :

(1) ఒక వాక్యములో కర్తగా (Subject) గా ఉపయోగపడును.

ఉదా: To swim in the sea is not easy- సముద్రములో యీదుట సులభముకాదు - To swim - కర్త.

(2) He wants to swim in the river - అతడు నదిలో యీదుట కిష్టపడును - To swim - కర్మ (object) గా యీ వాక్యములో ఉపయోగింపబడినది.

(3) I went to the river to swim - నేను నదికి యీదుటకుగాను పోతిని, ఇచట to swim, the river అను object కు Compliment గా ఉపయోగింపబడినది.

(Objective Compliment)

(4) His daily habit is to swim in the village well - వాని దినచర్య ఊరి బావిలో యీదుట (గా ఉన్నది)– ఇచట to swim సాధారణ Complimentగా ఉపయోగింపబడినది. (Compliment)

(5) With his usual dress removed he is about to swim in the swimming pool - వాని మామూలు దుస్తులువిడిచి వాడు కొలనులో యీదుటకు తయా

రుగానున్నాడు - ఇచట to swim 'about' అను preposition కు కర్మ (object) గా ఉపయోగింపబడినది (object of a preposition)

ఈ పై అయిదువిధములుగా noun (నామవాచకము)వలె ఉపయోగపడిన Infinitive ను 'Simple Infinitive' అని అందురు.

అట్లుగాక Adjective పనినో, Adverb పనినో చేసే Infinitive కు Gerundial Infinitive అని పేరు.

# 86. Auxiliary Verbs

(ఆగ్జిలియరీ వర్బ్స్)

## సహాయక క్రియలు

సహాయక క్రియలు అనగా Perfect tense, Continuous tense మొదలగు కొన్ని Tense లు యేర్పడుటకు సహాయపడు క్రియలు.

ఉదా.—

You are my teacher - మీరు నా ఉపాధ్యాయులుగా నున్నారు.—ఇచట 'are' అనునది యితర యేసహాయము లేకుండా యీ వాక్యములో Predicate (క్రియ) పనిచేయుచున్నది. అందువలన నిది ప్రధాన (Principal) క్రియా పదమని చెప్పవలెను.

You are teaching me - మీరు నాకు బోధించుచున్నారు. ఇచట are అనునది స్వయముగా క్రియగా యేర్పడగా, teaching అనే Present participle కు సహాయపడి Present continuous tense యేర్పడుటకు తోడ్పడినది. అందు వలన నిచట 'are' సహాయకక్రియ అని చెప్పవలెను.

ఇట్టి సహాయకక్రియలే :—

(1) 'To be' రూపములగు—Is, are, am, was, were

(2) 'To have' రూపములైన—has, have, had

(3) 'To do' రూపములగు—do, does, did

shall, should, will, would, may, might మొదలగునవికూడ సహాయక క్రియలు.

ఈ సహాయక్రియల ఉపయోగములు:—

(1) పైన పేర్కొన్న Perfect, Continuous tenseలు యేర్పడుటకు.

(2) ప్రశ్నార్థక వాక్యమును నిర్మించుటకు.

ఉదా.—

He is a teacher - అతడు ఉపాధ్యాయుడు. ఈ వాక్యమును ప్రశ్నార్థకవాక్యముగా నిర్మించుటకు లేక మార్చుటకు వాక్యములోని Is అను క్రియాపదమును మొదటి స్థానమునకు తీసికొనివచ్చి, వాక్యముకడపట ప్రశ్నార్థక గుర్తు (?) ఉంచవలెను.

ఉదా.—

Is he a teacher? - అతడు ఉపాధ్యాయుడా ?

అటులనే They are going అనువాక్యమును ప్రశ్నార్థక వాక్యముగా మార్పుచేసిన 'Are they going?' అగును.

(3) 'not' అను పదముతోచేరి, యీ Auxiliary verbs, వ్యతిరేకార్థకవాక్యములు (Negative sentences) యేర్పడుటకు సహాయపడును :—

ఉదా.—

He has a book—He has not a book.

They have gone—They have not gone.

ఈ Auxiliary verbs కేవలం సహాయక క్రియలు గానే కాకుండా, పైనతెలిపినట్లుగా ప్రధాన లేక స్వతంత్రక్రియ లుగాకూడా ఉపయోగపడును :—

| 'సహాయక' క్రియలుగా | 'స్వతంత్ర' లేక 'ప్రధాన' క్రియలుగా |
|---|---|
| I am teaching | I am a teacher |
| We are working | We are workers |
| You are trading | You are a trader |
| You are begging | You are beggers |
| He is studying | He is a student |
| She was cutting | She was a cutter |

| 'సహాయక' క్రియలుగా | 'స్వతంత్ర' లేక 'ప్రధాన' క్రియలుగా |
|---|---|
| They were robbing | They were robbers |
| I have come late | I have a book |
| He has gone home | He has a son |
| Ravana had defeated Indra | Rama had a big Vanara army |
| Pandavas did not like to fight | Kauravas did their worst to kill the Pandavas |
| Where do they go now? | He does his home work daily |
| I shall go to cinema this evening | I will go home to night |
| He will go home now | They shall pay their fees before 11 a.m. tomorrow |
| Our teacher told that he would revise the lessons | The Hindus would worship Vedas |

| 'సహాయక' క్రియలుగా | 'స్వతంత్ర' లేక 'ప్రధాన' క్రియలుగా |
| --- | --- |
| I told you that I shall read for my examinations | You should stand on the bench all this hour |
| We work hard that we may get through the examination | You may now come in |
| You might have met him in the market | He might join the army this year |



# 87. The Verb 'To be' (ది వెర్బ్ 'టు బి')

ఈ క్రియయొక్క వివిధరూపములగు am, is, are, was, were అనునవి సహాయక్రియలుగాను, స్వతంత్రక్రియలుగాను ఉపయోగింపబడగలవని ముందే ఉదాహరణపూర్వకముగా తెలిసికొన్నావు. ఇక్కడ అట్టివే మరి కొన్ని విషయములు తెలిసికొందువు—

సహాయక్రియ :—A. (Helping or Auxiliary Verbs) :

Passive Voice

| 1st person | 2nd person | 3rd person |
|---|---|---|
| *Present tense.* | | |
| I am taken | You are taken | He (she, it) is taken |
| We are taken | | They are taken |
| *Past tense.* | | |
| I was taken | You were taken | He (she, it) was taken |
| We were taken | | They were taken |
| *Future tense.* | | |
| I shall be taken | You will be taken | He (she, it) will be taken |
| We shall be taken | | They will be taken |

సహాయక్రియ :—B. Continuous tense :

Passive Voice

| | | |
|---|---|---|
| 1st person | 2nd person | 3rd person |
| *Present tense.* | | |
| I am coming | You are coming | He (she, it) is coming |
| We are coming | | They are coming |
| *Past tense:* | | |
| I was coming | You were coming | He (she, it) was coming |
| We were coming | | They were coming |
| *Future tense.* | | |
| I shall be coming | You will be coming | He (she, it) will be coming |
| We shall be coming | | They will be coming |

స్వతంత్ర (Independent) లేక ప్రధాన (Principal) క్రియ :—

Passive Voice

| | 1st person | 2nd person | 3rd person |
| --- | --- | --- | --- |
| *Present tense.* | | | |
| | I am hungry | You are hungry | He (she, it) is hungry |
| | We are hungry | | They are hungry |
| *Past tense.* | | | |
| | I was hungry | You were hungry | He (she, it) was hungry |
| | We were hungry | | They were hungry |
| *Future tense.* | | | |
| | I shall be hungry | You will be hungry | He (she, it) will be hungry |
| | We shall be hungry | | They will be hungry |

## 88. The Verb 'To have' (ది వెర్బ్ టు హేవ్)

ఈ 'Have' యొక్క వివిధరూపములైన, has, had, have అనునవికూడా సహాయ క్రియలుగాను, స్వతంత్ర క్రియలుగాను ఉపయోగింపనగును :—

I. సహాయక్రియగా:—ప్రధానక్రియయొక్క Past Participle (తద్ధర్మ) రూపమునకు ముందుచేరి 'have' యొక్క రూపము మూడుకాలములలోను, ఈ క్రింద చూపినట్లుగా, మూడు పురుషము లందును Perfect tense యేర్పడుటకు సహాయపడును :

Passive Voice

| 1st person | 2nd person | 3rd person |
|---|---|---|
| *Present tense (Perfect.)* | | |
| I have bought a book | You have bought a book | He (she) has bought a book |
| *Past tense (Perfect.)* | | |
| I had bought a book | You had bought a book | He (she) had bought a book |
| *Future tense (Perfect.)* | | |
| I shall have bought a book | You will have bought a book | He (she) will have bought a book |

II. స్వతంత్రక్రియగా :— 'Have' యిందు మూడుకాలములందును, మూడుపురుషములందును 'కలిగియుండు' అర్థమిచ్చును :—

Passive Voice

| | | |
|---|---|---|
| 1st person | 2nd person | 3rd person |
| *Present tense.* | | |
| I have a pen | You have a pen | He (she) has a pen |
| *Past tense.* | | |
| I had a pen | You had a pen | He (she) had a pen |
| *Future tense* | | |
| I shall have a pen | You will have a pen | He (she) will have a pen |



# 89. The Verb 'To do' (ది వెర్బ్ టు డు)

Be, Have, ల వలె, Do, కూడా సహాయక్రియగాను, స్వతంత్రక్రియగాను, క్రింద చూపబడి నట్లుగా రెండు మూడు పురుషములలోను ఉపయోగింపనగును:—(రెండు కాలములందు మాత్రమే).

I. సహాయక్రియగా :— (As Auxiliary or helping verb). (1) Negative (వ్యతిరేకార్థక), (2) Interrogative (ప్రశ్నార్థక), (3) Emphatic (రూఢివాచక) వాక్యములను నిర్మించుటకు, యీ 'Do' క్రియారూపములు సహాయపడును :—

(1) Negative sentence నిర్మాణము

| | 1st person | 2nd person | 3rd person |
|---|---|---|---|
| *Present tense :* | I do not know Hindi | You do not know Hindi | He (she) does not know Hindi |
| *Past tense :* | I did not know Hindi | You did not know Hindi | He (she) did not know Hindi |

(2) Interrogative sentence నిర్మాణము

*Present tense :*

| | | |
|---|---|---|
| Do I read well ? | Do you read well ? | Does he (she) read well ? |

*Past tense :*

| | | |
|---|---|---|
| Did I read well ? | Did you read well ? | Did he (she) read well? |

(3) Emphatic sentence నిర్మాణము

*Present tense :*

| | | |
|---|---|---|
| I do think so | You do think so | He (she) does think so |

*Past tense :*

| | | |
|---|---|---|
| I did think so | You did think so | He (she) did think so |

II. స్వతంత్రక్రియగా :—

| I. 1st person | 2nd person | 3rd person |
|---|---|---|
| *Present tense :* | | |
| I do that sum | You do that sum | He (she) does that sum |
| *Past tense :* | | |
| I did that sum | You did that sum | He (she) did that sum |
| *Future tense :* | | |
| I shall do that sum | You will do that sum | He (she) will do that sum |

II. Substitute Verb (క్రియకు బదులు) గా :---

Scooters run faster than a car does (does=runs) - అనగా does అనేది Runs కు బదులుగా (substitute) వచ్చినది.

I know as well as you do (do = know) అనగా, know అనుటకు బదులుగా (substitute) do అనే క్రియ ఉపయోగింపబడినది.

You eat as much as I do (do=eat) eat కు బదులుగా do ఉపయోగింపబడినది.



## 90. Shall and Will (షల్ అండ్ విల్)

I. సహాయకక్రియగా :

(1) ఉత్తమపురుషము (First person) లో Present tense లో ఉండే క్రియా (verb) రూపమునకు ముందు shall ను చేర్చిన ఆక్రియయొక్క future tense యేర్పడును.

(2) మధ్యమ, ప్రథమ పురుషములలో (Second and Third Person) Present tense లో ఉండే క్రియారూపాలకుముందు will ను చేర్చినయెడల, future tense యేర్పడును.

ఉదా.—

| Present tense | Future tense |
|---|---|
| 1st Person : | |
| I take you with me | I shall take you with me |
| We go to the Park | We shall go the Park |
| 2nd Person : | |
| You give me your book | You will give me your book |

| Present tense | Future tense |
| --- | --- |
| 3rd Person : | |
| He (she, it) comes here | He (she, it) will come here |
| They come here | They will come here |

II. స్వతంత్రక్రియగా :

(1) ఉత్తమపురుషములో (First person) నిశ్చితమును గాని, వాగ్దానమునుగాని తెలియజేయు అర్థములో ఉపయోగింపబడినప్పుడు 'will' స్వతంత్రక్రియ.

ఉదా.—

I will go home this day (నిశ్చితము)

I will take you to cinema (వాగ్దానము).

(2) మధ్యమ, ప్రథమ పురుషము (Second and third person) లలో, నిశ్చితము, వాగ్దానములేకుండా, ఆజ్ఞాపనలుగూడా తెలియజేయు అర్థములో ఉపయోగింపబడినప్పుడు 'shall' స్వతంత్రక్రియ.

ఉదా.—

You shall come here tomorrow (నిశ్చితము).

He shall pay a visit to me (వాగ్దానము).

They shall pay their fines before this evening (ఆజాపన)

III. Is, are ల వలె shall, will లు గూడ Auxiliary Verbs అగుటవలన, యివి ప్రశ్నార్థకవాక్యములలో Is, are లవలె వాక్యములోని మొదటిస్థానమునకు వచ్చును.

ఉదా.—

I shall come in—Shall I come in?

You will go now—Will you go now?

He will bring his book— Will he bring his book?

IV. వ్యతిరేకార్థకవాక్యములందుగూడ not తో చేరి, యీ shall, will ఉపయోగింపబడును.

ఉదా.—

I shall give you my pen—I shall not give you my pen.

You will read this book—You will not read this book.

He will take his notes—He will not take his notes.



## 91. Should and Would (షుడ్ అండ్ వుడ్)

(1) First person లో Should, Second and third persons లో Would, Direct speech ని Indirect speech లోకి మార్చినప్పుడు. ఉపయోగింపబడును. అప్పుడా Should, Would future past కాలమును తెలియచేయును.

ఉదా.—

First person

Direct Speech:—I said "I shall go to Bombay to attend the meeting".

Indirect Speech:—I said that I should go to Bombay to attend the meeting.

Second person

Direct Speech:—You said "I shall pay one hundred rupees next month".

Indirect Speech:—You said that you would pay one hundred rupees next month.

Third person

Direct Speech: He said "I shall read this year for my B.A.".

Indirect Speech:—He said that he would read this year for his B.A.

(2) మూడు పురుషములలోను (In all the three persons) should బాధ్యతను (Obligation) తెలుపు అర్థములో ఉపయోగింపబడును.

ఉదా.—

I should admit my Mrs. in the hospital.

You should start by this night train.

He should attend the Conference.

(3) మూడు పురుషములలోను Subjunctive mood ను తెలుపుటకు if, lest అనుపదములకు వెనుక Should వచ్చును.

ఉదా.—

If I should leave Madras, I will go to my native place.

If you should fail this year, you will discontinue your studies.

He left by Bombay Mail, lest he should miss the meeting tomorrow.

(4) ఉత్తమపురుషములో (First person) shall కు బదులుగా, మర్యాదతోకూడి మనవినిచేయుటకు should ఉపయోగపడును.

ఉదా.—

I should feel highly thankful if you would help me now.

(5) మూడుపురుషములలోను, కోరిక (desire) ను కాని నిశ్చయము (determination) ను కాని, తెలుపు అర్థము నందు, would ఉపయోగింపబడును.

ఉదా.—

First person

I would attend the office, though I am unwell.

Second person

You would drink coffee despite doctor's advice.

Third person

He would go his own way even though he lost heavily.

(6) Should వలె, Would కూడా, అన్నిపురుషముల లోను Subjunctive mood అర్థములో ఉపయోగింపబడు చుండును.

ఉదా.—

If I would try, I could win- ఉత్తమపురుషము (First person)

If you would be present at the function it will be indeed pleasant — Second person (మధ్యమపురుషము)

If he would work hard, he will pass— Third person (ప్రథమపురుషము)

(7) Shall కు బదులుగా Should వలె, Will కు బదులుగా Would కూడా First person లో మర్యాదపూర్వకమైన ప్రార్థనకుగాను ఉపయోగపడును.

ఉదా.

Would you be kind enough to give me a hand loan of ten rupees !



# 92. May and Might
(మే అండ్ మైట్)

1. ఈ May, Might అను రెండు సహాయక (Auxiliary Verbs) క్రియలు చేదర్థకమందు అనగా, ముందు చెప్పబడినదానితో చేర్పబడు అర్థమునందు ఉపయోగింప బడును.

ఉదా.—

He walks so fast, that he may be in time in the office.

The crow put the pebbles into the jar so that the water in the jar might come up to the surface.

2. ఆజ్ఞ అడుగుటకును, యిచ్చుటకును, అనుమానము తెలియజేయుటకును May స్వతంత్ర (Independent or Main) క్రియగా ఉపయోగింపబడును.

ఉదా.—

You may go, if your work is over.
(ఆజ్ఞ యిచ్చుట)

May I come in? (ఆజ్ఞ అడుగుట)

The sky is cloudy; it may rain.
(అనుమానము తెల్పుట)

ఈ పై మూడువాక్యాలలోను, may తరువాత వచ్చిన క్రియలు to లోపించిన infinitive లే గాని finite Verbs కావు.



## 93. Defective Verbs (డిఫెక్టివ్ వెర్బ్స్)

## లోపమున్న క్రియలు

Defective Verbs (లోపమున్న క్రియలు)— అనగా సాధారణముగా అన్నిక్రియలకు ఉండే రూపాలులోపించుక్రియలు: అవి యేవనగా, must, can (could), ought, need. May ను కూడా కొందరు Defective Verb అని అందురు.

1. Must :— ఇది ఒక్క Indirect speech లో తప్ప తక్కిన యెడల Present tense లోనే ఉపయోగింపబడును. Singular, Plural number లలో కూడా ఒకేరూపముతోనుండును. Indirect speech లో కూడా రూపము మారదు కాని, అప్పుడది Past tense లో ఉన్నదని చెప్పబడును. ఇది అవసరమును లేక ఆవశ్యకముతెలుపు అర్థమునందు ఉపయోగింపబడును. అప్పుడది స్వతంత్ర లేక ప్రధాన (Independent or Principal) క్రియగానే ఉపయోగింపబడుచున్నది.

ఉదా.—

I must now go to office—1st person

You must hurry up to catch the train—2nd person

He (They) must go to school to see the Head Master—Third person.

Indirect speech :—He said that I must not be absent this day.

Direct speech :—He said "you must not be absent this day"

2. Can (Could) :—'Can' యిప్పుడు Present tense గానే ఉపయోగపడుచున్నది. 'Could', Can కు Past tense. దీనికి Past participle లేదు, 'Can' శక్తి లేక సామర్థ్యమున్నదను అర్థమునందు ఉపయోగింపబడుచున్నది. Must వలె Can కూడా Independent లేక Principal Verb గా మాత్రమే ఉపయోగింపబడుచున్నది. ఇందులోకూడా Can కు తరువాత వచ్చు Verb (క్రియ) 'to' లోపించిన Infinitive మాత్రమే.

ఉదా :—

I cannot reach the ceiling. It is too high = I am not able to reach the ceiling. It is too high. (Can = am able to) To reach అనునది Infinitive. Can ఉపయోగింపబడినపుడు To లోపించినది.

'Could' రూపము Past tense అర్థములో, Indirect speech లో ఉపయోగింపబడును.

ఉదా:—

Direct Speech:—The officer said "I can dismiss you".

Indirect Speech:—The officer said that he could dismiss him.

(3) Ought:— ఇదికూడా యిప్పుడు Present tense లోనే ఉపయోగింపబడుచున్నది. అది Must అర్థము నిచ్చును.

ఉదా:—

The rich ought to feed the beggars. (Ought to = Must) ought యొక్క Past tense అది ఉపయోగింపబడిన వాక్యములోని 'to have' అను Perfect infinitive ను బట్టి గ్రహింపవలెను.

ఉదా.—

The Grand Trunk Express ought to have come by this time. It is already an hour late.

(4) Need:—ఇది కేవలము Defective Verb గా Present tense లో ఉపయోగింపబడును. 'అవసరమును' (Necessity or obligation) తెలుపు అర్థమునందు ఉపయోగింపబడుచున్నది.

ఉదా:—

Need (Must) I do the work?

No, you need not.

He need not speak.

I need not tell.

(5) Need:—Weak verb want (కావలయును) అను అర్థమిచ్చుటకుగూడ ఉపయోగింపబడుచున్నది.

ఉదా.—

Now you need rest (want)

I need at least five rupees this moment (want)

He needs sound sleep to get back health (wants)



## 94. The Adverb (ది అడ్వెర్బ్)

## క్రియావిశేషణము

ఈ క్రింది వాక్యాలు చదువుము (Read the following sentences):—

1. The train arrived late.
2. You are very slow.
3. I am so early today.

పైవాక్యాలలో క్రింద గీతగల పదాలు Adverbs. మొదటివాక్యములో క్రింద గీతగల late అనుపదము arrived అనే Verb ను వివరించి లేక వర్ణించిచెప్పుచున్నది. అట్లు వర్ణించి చెప్పుటకు ఇంగ్లీషులో Modify (మాడిఫై) అని అందురు.

రెండవవాక్యములో క్రిందగీతగల Very అనే పదము, ఆవాక్యములోని slow అనే Adjective (విశేషణము) ను వివరించి తెలుపుచున్నది; అనగా విశేషణమును Modify చేయుచున్నది.

మూడవవాక్యములో so అనే పదము early అనే మరి యొక క్రియావిశేషణము (Adverb) ను Modify చేయు చున్నది.

ఇట్లు Late, very, so మూడును Adverbs (క్రియా విశేషణములే), అని తెలియనగును.

ఈవిధముగా ఒక క్రియనుగాని, లేక ఒక విశేషణమును గాని, మరియొక క్రియావిశేషణమునుగాని, విశేషించి, వివ రించి లేక వర్ణించిచెప్పు పదమునకు క్రియావిశేషణమని పేరు.

పైవాక్యాలలో (1) వ వాక్యములో Late అనే Adverb పదము అందలి Arrived అనే క్రియను, (2) వ వాక్యములో Very అనే Adverb పదము, ఆ వాక్యములోని Slow అనే విశేషణపదమును, (3) వ వాక్యములో, 'so' అనే Adverb పదము, 'am' అనే క్రియను Modify చేసి Adverb అయిన early అనే పదమును Modify చేయు చున్నది-ఆయాపదవివరణ చేయుచున్నది.

సాధారణ క్రియావిశేషణములు (Simple adverbs) వాటి అర్థమునుబట్టి అయిదువిధములుగా నుండును.

I· Adverbs of time (కాలమును తెలుపునవి.)—

ఉదా.—

We came to school yesterday—Past tense తెలుపును.

You may come tomorrow—Future tense తెలుపును.

He comes just now — Present tense తెలుపును.

ఈ రకం Adverbs ఎప్పుడు (when) ఆ వాక్యములో సూచింపబడిన పని జరిగినది తెలుపును.

II. Adverbs of place (స్థలమును తెలుపునవి).

ఉదా.—

Who has come here?

How far did you go this morning?

It is very cold outside.

పై మూడు వాక్యాలలో క్రింద గీతగల, here, far, outside అనేపదాలు ఆ వాక్యాలలో తెలుపబడినపని యెక్కడ (where) జరిగినది తెలుపును.

III. Adverbs of manner (విధానము తెలుపునవి)

ఉదా.—

Please, hear me carefully.

He answered very badly.

I told him everything clearly.

ఈ పై మూడువాక్యాలలో, క్రింద గీతగల carefully, badly, clearly అనే మూడు Adverb పదాలు ఆవాక్యము లలో తెలుపబడిన పని ఎట్లు (How) జరిగినది వివరించును.

IV. Adverbs of Number (సంఖ్యను సూచించునవి లేక సంఖ్యావాచకములు).

ఉదా.—

He often goes out.

I take meals thrice daily.

Again and again, you drink coffee always.

ఈ పై మూడువాక్యాలలో క్రింద గీతగల often, thrice, again, always అనునవి నాలు Adverb పదాలే. అవి ఆ వాక్యములందు తెలుపబడిన పని 'How often' అనగా ఎన్నిమార్లు జరుగునది వివరించును.

V. Adverbs of Degree or Quantity

ఉదా.—

I am too old to learn anything now.

You are young enough to marry now.

His exercise is very bad.

పై మూడువాక్యాలలో క్రింద గీతలున్న too, enough, very అనే మూడు Adverb పదాలు ఆవాక్యాలలో తెలుపబడిన పని 'how much' లేక 'in what degree', అనగా ఎంత లేక ఎంతవరకు జరిగినది వివరించును.

VI. ఇవిగాక, 'when', 'where', 'why', 'how' అనునవి. Interrogative (ప్రశ్నార్థక) Adverbs గాను, Relative (సందర్భవాచక) Adverbs గా గూడ ఉపయోగింపబడును.

(1) Interrogative Adverbs :—

1. Where are you now?
2. How do you do?
3. When will you go to Bombay?
4. Why did you not go to office?

(2) Relative adverbs :—

1. You must go whenever and wherever you are asked to go.

2. Tell me how you did in the examination.

3. Please explain why you should not be punished for your carelessness.

## VII. Adverbs—Degrees of Comparison

(a) విశేషణముల (Adjectives) కు వలెనే క్రియా విశేషణములకు (Adverbs) కు గూడా Degrees of Comparison అనగా తరతమ భేదములు సూచించు భిన్న రూపములుగలవు.

ఉదా.—

You write well—Positive Degree

I write better—Comparative Degree

He writes best—Superlative Degree

(b) విశేషణములలోవలెనే, క్రియావిశేషణములలో కూడా మూడు డిగ్రీలలో వక్రరూపములు వచ్చును.

ఉదా.—

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Bad | worse | worst |
| Little | less | least |
| Much | more | most |
| Well | better | best |

(c) విశేషణములలోవలెనే కొన్ని క్రియావిశేషణములు er, est లను చేర్చుకొని Comparative, Superlative degree రూపములను బొందును.

ఉదా.—

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Fast | Faster | Fastest |
| Hard | Harder | Hardest |
| Near | Nearer | Nearest |
| Loud | Louder | Loudest |
| Soon | Sooner | Soonest |

(d) ఒకటికన్న ఎక్కువ Syllables (పదాంశములు) గల Adverb పదాలు, అట్టి Adjective పదములవలెనే, Comparative, Superlative degree రూపములలో more, most అను పదములను తమముందు చేర్చుకొనును.

ఉదా.—

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Beautifully | More beautifully | Most beautifully |
| Bravely | More bravely | Most bravely |

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Carefully | More carefully | Most carefully |
| Quickly | More quickly | Most quickly |
| Wisely | More wisely | Most wisely |
| Wonderfully | More wonderfully | Most wonder fully |

## అభ్యాసములు

I. ఈ క్రింది వాక్యములలో క్రియావిశేషణములను (Adverbs) తెలిపి, అవి ఆయావాక్యములలో దేనిని Modify (వివరణ) చేయుచున్నదో తెలుపుము:—

1. Crops grow well there.
2. The country is hilly here.
3. He ran very quickly.
4. The dog was hurt very badly.
5. Krishna is very late this day.
6. Rama put the book there.
7. Where did you place your pen?
8. Boys laughed again and again.
9. My father will come tomorrow from Bombay.

10. That tall fellow is indeed very intelligent.

11. Run the race well today.

12. He went early so as to catch the train.

II. Fill up the blanks in the following sentences, with suitable adverbs taken from the list given here under :—

1. They go——
2. I will——do so.
3. I cannot live——
4. ——is that pen?
5. ——will you go?
6. The sum is——hot today.

1. when, 2. where, 3. gladly, 4. often, 5. too, 6. alone.

III. క్రింది Adverbs కు యితరడి(గీలనిచ్చి వాటి నుపయోగించి సొంతముగా వాక్యాలు వ్రాయుము :

Well, wisely, hard, much,quiet, loud.



## 95. Prepositions (ప్రెపొసిషన్స్)

## విభక్త్యర్థక ఉపసర్గలు

A preposition is a word used with a noun or pronoun to show its relation to some other word in a sentence. It is said to govern that noun or pronoun and that noun or pronoun is called the object of that preposition.

ఉదా.—

1. The pen is <u>in</u> the drawer <u>of</u> the table.

2. Rivers flow <u>from</u> the mountains <u>to</u> the sea.

3. The book is <u>on</u> the box <u>under</u> the table.

ఈ పైవాక్యాలలో క్రింద గీతలుగల in, of, from, to, on, under అనే పదాలు Prepositions. అవి తమ ముందు వెనుకలవచ్చిన పదముల మధ్య సంబంధమును తెలుపుచున్నవి. మొదటివాక్యములో in, pen కు, drawer కు

మధ్యగల సంబంధమును, of, drawer కు table కు మధ్య ఉన్న సంబంధమును తెలుపుచున్నవి.

సాధారణముగా Prepositions వాటియొక్క object words గా ఉండే Nouns, pronouns కు ముందుగా ఉంచ బడును. అందుకే వాటికి Pre (ముందుగా) positions (స్థానమున్నవి) అని చెప్పెదరు.

కాని ఒక్కొక్కప్పుడు, యీ prepositions ఆ Nouns (Objects) కు వెనుకగూడా వచ్చుటకలదు.

ఉదా.—

(1) What is the table made of?

(2) A pen is for writing with.

(3) A knife is a thing for cutting with.

స్థలము (Place), కాలము (Time) తెలిపే nouns ముందు వచ్చే Prepositions కొన్ని లోపించును :—(For, from, in on) అనునవి.

ఉదా.—

(1) I cannot walk a mile. (for a mile)

(2) My father came this morning. (came in this morning.

There are two kinds of prepositions:—(1) Simple prepositions (2) Compound prepositions.

Simple prepositions.

ఎట్ - At
బై - By
డౌన్ - Down
ఫార్ - For
ఫ్రమ్ - From
ఇన్ - In
నియర్ - Near
ఆఫ్ - Of
ఆఫ్ - Off
ఆన్ - On
అవుట్ - Out
ఓవర్ - Over
ఇంటు - Into
త్రూ - Through
టిల్ - Till
టు - To
అప్ - Up
అపాన్ - Upon
అండర్ - Under
విత్ - With
సిన్స్ - Since

Compound prepositions

ఇవి ఒకటికన్న ఎక్కువ Syllables గల పదములుగా నుండును. ఇవి సాధారణముగా, Nouns కు Adjectives కు, Simple adverbs కు ముందు a గాని be గాని చేరుటవలన యేర్పడును.

అగెయిన్స్ట్ - Against
ఎబవుట్ - About
బిహైండ్ - Behind
బిలో - Below

ఎబవ్ - Above
ఎక్రాస్ - Across
ఆఫ్టర్ - After
ఎలాంగ్ - Along
ఎమిడ్స్ట్ - Amidst
ఎమాంగ్ - Among
ఎమాంగ్స్ట్ - Amongst
ఎరౌండ్ - Around
బిఫోర్ - Before
బినీత్ - Beneath
బిసైడ్ - Beside
బెట్వీన్ - Between
బియాండ్ - Beyond
ఇన్సయిడ్ - Inside
అవుట్సైడ్ - Outside
అండర్నీత్ - Underneath
విదిన్ - Within
వితవుట్ - Without

## Prepositional phrases

Prepositional phrases or phrase prepositions అనగా వాక్యములో Preposition పనిచేయునట్టి Phrases అని అర్థము. అట్టివి కొన్ని:—

Preposition గాను, Adverb గాను ఉపయోగింప బడే పదములు కొన్ని గలవు.

ఉదా.—

| | Preposition. | Adverb |
|---|---|---|
| 1. | He talks today about Rama's Vanavasa. | He goes about here and there. |

| | Preposition | Adverb |
|---|---|---|
| 2. | After a long time he is coming. | You may go after the office leaves. |
| 3. | Our house is just behind the Church. | Don't go behind. (వెనుకకు పోవద్దు) |
| 4. | Baka was killed by Bhima. | All this work is for the people living by. (దగ్గర) |
| . | The book is in the drawer. | May I come in? |
| 6. | The pen is on the table. | You may now go on with whatever you want. |



## 96. Uses of some Prepositions

(యూసెస్ ఆఫ్ సం ప్రెపోసిషన్స్

### కొన్ని విభక్త్యర్థక ఉపసర్గల ఉపయోగములు

1. At—(a) స్థలము, కాలములగురించి తెలుపునపుడు.

ఉదా.—

We go to school at 10 A.M. and will be back at home by 5 P.M.

(b) చిన్న పల్లెలు, పట్టణాలగురించి తెలుపునపుడు.

ఉదా.—

Now I am put up at Kodambakam.

(c) చలనములేని వస్తువులగూర్చి తెలుపునపుడు.

ఉదా.—

We are at the door

2. By:—పనిచేయువానినిగూర్చి తెలుపునపుడు.

ఉదా.—

Karna was killed by Arjuna

3. In :—(a) పెద్దనగరములను, దేశములను గురించి తెలుపునపుడు.

ఉదా.—

(1) He lives now in Madras.

(2) Churchill died in England.

(b) చలనములేని వస్తువులనుగూర్చి తెలుపునపుడు.

ఉదా.—

Rama is sitting in the room.

4. Into :—చలనము ఉన్న వస్తువులనుగురించితెలుపునపుడు.

ఉదా.—

He came into the room.

I went into the house.

5. On :—చలనములేని వస్తువులనుగూర్చి తెలుపునపుడు.

ఉదా.—

I sat on the chair.

The pen is on the table.

6. Upon :—చలనము ఉన్న విషయములనుగురించి తెలుపునపుడు.

ఉదా.—

The cat pounced upon the rat.

7. To:—To కూడా చలనము ఉన్న వస్తువులను గురించి తెలుపునప్పుడే.

ఉదా.—

1. Now you may go to cinema.

2. He went to Madras yesterday.

8. From :— సమయము (Point of time) ను గురించి తెలుపునపుడు:—(ఏ Tense లోనైన ఉపయోగింబడును.)

ఉదా.—

1. The school year begins from June every year.

2. He waited there from 10 A.M. in the morning.

3. I will be at home from 8 A.M. till 11 A.M. every day.

9. Since:—ఇది కూడా సమయమునుగురించియే తెలుపును. కాని యిది ఒక్క Present perfect tense లోనే ఉపయోగింపబడును.

ఉదా.—

1. Govind has been in the D.B.K. Railways since 1961.

2. I have been suffering from fever, since last Monday.

10. With :— పనిముట్టు లేక సాధనమునుగూర్చి తెలుపునపుడు.

1. A pen is for writing with.
2. A knife is a thing for cutting with.

## అభ్యాసములు

I. క్రింది వాక్యములందు Prepositions ను యెత్తి చూపి వాటియొక్క కర్మపదమును (Object word) తెలుపుము :—

1. Be ready at 6 A.M.
2. Rama was beaten by his teacher.
3. Jamuna flows into the Ganges.
4. Metturdam is built across the river Cauvery.
5. Himalayas are always covered with snow.
6. Let us talk about the picture at home.

II. Insert suitable prepositions in the blanks:—

1. Please wait——10 A.M.
2. Rama did much good——his people.
3. The train runs——the rails.
4. We hear——our ears.
5. Look——the picture.
6. Don't talk——that unhappy affair.

III. (a) Use the following words as both prepositions and adverbs in sentences of your own: (నీ సొంతవాక్యములలో, ఈ క్రింది పదములను Prepositions గాను Adverbs గాను ఉపయోగింపుము) :—

1. About 2. After 3. Before 4. Behind 5. Down 6. Off 7. Over 8. Near 9. Out 10. By 11. On 12. In.

(b) ఈ క్రింద నీయబడిన Phrases నుండి సరియైన Phrases తో యీ క్రింది వాక్యాలలోని Blanks (ఖాళీలను) పూర్తిచేయుము :—

Phrases :—1. In a draw 2. Under the table 3. Across the plain 4. Towards the goal 5. In cold climates 6. To his place.

Sentences :—

1. He laid his head——
2. The match closed——
3. My brother returned——
4. Paddy does not grow——
5. Rivers flow——
6. The boy is hiding himself——



## 97. Conjunctions (కంజంక్షన్స్)

## సముచ్చయ (సంయోగ) పదములు

రెండు పదములనుగాని, రెండు పదసమూహములనుగాని, లేక రెండువాక్యములనుకాని, కలుపుపదములు Conjunctions అనబడును.

I. ఉదా.—

1. Rama and Lakshmana were brothers.
2. He is bulky but weak.
3. You may take milk or light coffee.

పై వాక్యములందు క్రిందిగీతలుగల and, but, or అను పదములు, ఆ పదములకు ముందు వెనుకలనుండు పదములను కలుపుచున్నవి. Rama, Lakshmana అను రెండుపదములను and కలుపుచున్నది. అటులనే, bulky, weak అను పదాలను, but ను, milk, light coffee అనే పదాలను, or ను కలుపుచున్నవి. కనుక and, but, or అనేవి Conjunctions.

II. ఈ క్రింది ఉదాహరణములలో వాక్యములనే కలిపే Conjunctions ఉపయోగింపబడినవి గమనింపుడు:—

ఉదా.—

1. He came late and sat in the last seat.

2. I tried my best to pass, but I failed.

3. We must be there by 5 P.M. or we may not get space to sit.

పైవాక్యాలలోని and, but, or అనే పదాలు, ఆవాక్యాలలో, ఆ వాక్యాలకుముందు వెనుకలనుండే వాక్యాలనుకలిపినవి.

సూచనలు :

1. పై and, but, or అను మూడు Conjunction పదాలలో and ఒకే విధమైన పదములను, లేక వాక్యములను కలుపుటకు ఉపయోగింపబడినది. రెండు పరస్పరము వ్యతిరేక భావాలుగల పదములను లేక వాక్యములను కలిపేటప్పుడు but ఉపయోగింపబడినది. ఇదో, అదో, యేదైన ఒకటి జరుగవలెననే భావములు తెలిపేపదములనుగాని భావములనుగాని కలిపేది or అనే సముచ్ఛయము (Conjunction)

2. చాలా పదములు, పదసమూహములు, కలుపునప్పుడు and అనే పదము కట్టకడపటి పదము లేక పదసమూహము ముందువచ్చును. తక్కిన పదములు, పదసమూహములు కలుపుటకు (,) కామా ప్రతిపదము లేక పదసమూహము చివరనుంచిన చాలును.

ఉదా.—

Dharmaraja, Bhima, Arjuna, Nakula and Sahadeva were brothers.

3. ఇంతకుముందు మనము Relative pronouns, Relative adverbs, Prepositions కూడా పదములను. వాక్యములను కలుపునని తెలిసికొనియున్నాము. ఇపుడు నేర్చిన Conjunctions పై వాటికి భిన్నములు.

ఉదా.—

1. This is the book which I got as a prize. —Relative pronoun

2. This is the time when the train should arrive. —Relative Adverb

3. His house is on the river bank— —Preposition

పై ఉదాహరణవాక్యములను పరిశీలించిన, Conjunction ఒక్క కలుపుట మాత్రమే చేయుచుండగా, Relative Pronoun కలుపుట చేయుటేగాక, ఒక Noun కు బదులుగా (ఇచట Relative pronoun అయిన which దాని Antecedent అయిన book అను Noun కు బదులుగా) నిలిచియుండును; Relative Adverb కలుపుటయేగాక ఒక క్రియను విశేషించి వివరించిచెప్పును అని తెలిసికొనగలరు.

కొన్ని Conjunction పదముల పట్టిక :—

| | | |
|---|---|---|
| As | Or | Though |
| And | Nor | Than |
| Both | Neither | Since |
| Because | Only | Unless |
| But | Although | Until |
| Either | Before | When |
| If | Ere | Where |
| For | Lest | While |
| Else | It | Yet |
| After | Still | |
| Also | Till | |

'Correlatives' - (కార్రిలెటివ్స్) అనగా అన్యోన్య సంబంధముగల పదములని అర్థము :— (ఇవికూడా Conjunctions వలె కలుపుట చేయును.

ఉదా.—

He went not only to America but also to many other countries. - అతడు అమెరికాకేగాకుండ, అనేకమైన యితరదేశములకుగూడా పోయెను.

ఈ పై వాక్యములో క్రింద గీతగల not only—but also అనునవి Correlatives జంట. ఇవి ఉపయోగించునప్పుడు వాటికి సంబంధమున్న మాటలు, కలుపవలసిన మాటలు ముందు ఉండవలెను.

పై ఉదాహరణ వాక్యములో America ను, many other countries కలుపుచుండు not only——but also అను Correlative పదములలో not only అమెరికాకు ముందుగాను, but also, many other countries కు ముందుగాను ఉన్నవి.

Not only ——— but also వలె యితర Correlatives జంటలు కొన్నిగలవు :—

Either——or

Neither——nor

Both——and

Though——yet

Whether——or

Not only——but also



## 98. Compound Conjunctions

(కాంపౌండ్ కంజంక్షన్స్)

1. In order that
2. On condition that
3. Even if
4. So that
5. Provided that
6. As though
7. As if
8. As well as
9. As soon as
10. As good as

వాక్యాలలో యీ Conjunction ఉపయోగించు పద్ధతులను యీ క్రింద నీయబడిన ఉదాహరణ వాక్యాలను బాగుగా చదివి గమనింపుము :—

1. (అండ్) And - మరియు.

ఉదా.—Come here and sit on the bench - ఇచ్చటికివచ్చి బెంచిమీద కూర్చుండుము.

2. (ఆల్సో) Also - కూడా.

ఉదా.—He is Secretary and also Treasurer- అతడు కార్యదర్శియు, కోశాధిపతియును.

3. (ఆఫ్టర్) After - అవతల, అనంతరము.

ఉదా.—After the announcements of the results, the college will be closed - ఫలితాల ప్రకటన అనంతరం, కాలేజి మూయబడును.

4. (ఆల్దో) Although - అట్లయినను; అయినప్పటికిని.

ఉదా.—Although I was the last in the line, I could get the rice - క్యూలో నేను కడపటివాడనైనప్పటికిని, నాకు బియ్యముదొరికినది.

5. (ఆజ్) As - అందువలన.

ఉదా.—As crops failed, the prices have risen - పంటలు పాడైనందువలన, ధరలుపెరిగినవి.

6. (అజ్ యిఫ్) As if - అయినట్లు.

ఉదా.—You talk as if you are yourself the master - నీనే యజమానివయినట్లు మాట్లాడెదవు.

7. (ఆస్ సూన్ ఆస్) As soon as - వెనువెంటనే.

ఉదా.—As soon as I finished my examinations, I got the job. - నాపరీక్షలు అయినవెంటనే నాకు ఉద్యోగము లభించినది.

8. (ఆస్ దో) As though - ఆలాగున; వలె.

ఉదా.— Don't pretend, as though you cannot hear - వినపడనివానివలె వేషాలువేయకు.

9. (ఆజ్ వెల్ ఆజ్) As well as - అట్లనే.

ఉదా.— Children as well as adults had to purchase full tickets - పెద్దలట్లనే పిల్లలుకూడా పూర్తి టికెట్లను కొనవలసివచ్చెను.

10. (బట్) But—అయినను; కాని.

ఉదా.—He is dull, but studies well-వాడు మందమతి అయినను, బాగుగా చదువును.

11. (బికాస్) Because - ఎందుకనగా.

ఉదా.— Arjuna was very sad, because he had to kill his own kinsmen - అర్జునుడు చాలా దుఃఖించెను, ఎందుకనగా, అతడు తన బంధువులనే చంపవలసి వచ్చెను.

12. (బిఫోర్) Before - ముందు.

ఉదా.— He did not study well before he came to the S.S.L.C. class - అతడు S.S.L.C. తరగతికి రాకముందు చక్కగా చదువలేదు.

13. (బోత్ – అండ్) Both—and - ఇద్దరూ; రెండునూ.

ఉదా.—Both the mother and the child died on the same day. - తల్లీ బిడ్డా యిద్దరూ, ఒకేదినము చని పోయిరి.

14. (ఎల్స్) Else - లేకుంటే.

ఉదా.—Eat moderately, else, you will suffer—మితముగాతినుము; లేకుంటే నీవు బాధపడు దువు.

15. (ఎర్) Ere - ముందుగానే; ముందే.

ఉదా.— Work hard, ere it is too late - అంత ఆలస్యముకాకముందే కష్టపడి పనిచేయుము.

16. (ఎయ్దర్—అర్) Either—or - ఇదో లేక అదో.

ఉదా.— Give the name of either your father or your mother - నీ తండ్రి లేక నీ అమ్మ పేరు నిమ్ము.

17. (ఈవన్ యిఫ్) Even if - అయినప్పటికి.

ఉదా.— He will not give up smoking, even if he dies - వాడు చచ్చినప్పటికి, పొగత్రాగడం మానుకోడు.

18. (ఫార్) For - ఎందువల్లననగా.

ఉదా.—He did not go to office yesterday, for he was suffering from fever - నిన్న అతడు ఆఫీసుకు పోలేదు; ఎందువల్లననగా, అతడు జ్వరముతో బాధపడుచుండెను.

19. (ఇఫ్) If - అయినచో; అయినయెడల.

ఉదా.— You will certainly get into troubles, if you misbehave like this - నీవు యీ రీతిగా దుష్ప్రవర్తకుడవయినచో, తప్పకుండ కష్టాలలో దిగెదవు.

20. (ఇన్ ఆర్డర్ దట్) In order that - అందుకు గాను.

ఉదా.—The ant stores up food in the Spring, in order that it might help it in Winter - చీమ చలికాలములో దానికి సహాయముండేటందుకు గాను, వసంతకాలంలో ఆహారమును నిలువజేయును.

21. (లెస్ట్) Lest - అలా చేయకుండినచో.

ఉదా.—He worked day and night lest he should fail to finish the work - అతడు రేయింబవళ్లు పనిచేయుకుండినచో పని పూర్తిచేసి యుండెడివాడుకాదు.

22. (నెయిదర్) Neither - ఏదియు కానిది.

ఉదా.—He does not work in the office, neither he brings home, the papers - అతడు ఆఫీసులో పని చేయడు, యింటికీ పేపర్లు తీసుకొనిరాడు.

23. (నార్) Nor - లేదు, కాదు.

ఉదా.—Social Studies is not History nor Geography - సోషల్‌స్టడీస్, చరిత్రాకాదు, భూగోళశాస్త్రము కాదు.

24. (నెయిదర్—నార్) Neither—nor -అదియు నిదియు కానిది.

ఉదా.—He has neither father nor mother- వానికి తండ్రిగాని తల్లిగాని లేరు.

25. (నాట్‌వన్లీ—బట్ ఆల్సో) Not only—but also- అదేగాదు, ఇదికూడా.

ఉదా.—He is not only rich but also highly educated - అతడు ధనికుడుగా ఉండడమేకాకుండా, యెక్కువగా చదివినవాడుగాకూడా ఉన్నాడు.

26. (ఆర్) Or – లేదా.

ఉదా.—Please give me a pen or a pencil - దయచేసి నాకొక పేనా లేక ఒక పెన్సిలు యిమ్ము.

27. (ఆన్ కండిషన్ దట్) On condition that - ఆ షరత్తుపైన.

ఉదా.—He was sent up to the higher class, on conditon that he would get more than 50% marks in all subjects this year - ఈ సంవత్సరము అన్ని సబ్జెక్టులలోను నూటికి 50కన్న ఎక్కువ మార్కులతీసేషరత్తు పైన వాడు, పైతరగతికి పంపబడెను.

28. (ప్రొవైడెడ్ దట్) Provided that - అయినచో.

ఉదా.— I shall lend you this book now, provided that you return it next week - నీవు వచ్చేవారములో తిరిగి యిచ్చేటట్లయితేనే, నేను యిప్పుడీ పుస్తకమును నీ కిత్తును.

29. (సిన్స్) Since - నుండి.

ఉదా.—Sri Krishna did wonderful things since He was born - శ్రీకృష్ణుడు, ఆయన పుట్టినప్పటి నుండి, అద్భుతకార్యములు చేసెను.

30. (స్టిల్) Still - అయినా, యింకను.

ఉదా.—He lost everything; still he drinks too much. - అతడంతా నష్టపడినాడు ; అయినా యింకను, అతడు ఎక్కువగా త్రాగుతాడు.

31. (దట్) That - అని.

ఉదా.—Our leaders say that it is now time to be prepared for war. - యుద్ధానికి తయారు అగుటకు ఇపుడు సమయమని మన నాయకులు చెప్పెదరు.

32. (దో) Though - అయినను.

ఉదా.—Though he is rich, he is kind - అతడు ధనికుడై నను, దయగలవాడు.

33. (ద్యాన్) Than కన్న; కంటె.

ఉదా.— He is better in plays than in studies - వాడు చదువులో కన్న ఆటలలో మేలుగాఉన్నాడు.

34. (టిల్) Till - వరకు; దాక.

ఉదా.— Please wait in my room till I come - నేను వచ్చునంతవరకు, దయచేసి నాగదిలో వేచి యుండుము.

35. (దో - యెట్) Though—yet - ఐనను, కాని.

ఉదా.—Though he worked till midnight everyday, yet he failed in the examination - వాడు నిత్యము అర్ధరాత్రిదాకా చదివినప్పటికి, పరీక్షలో తప్పి పోయెను.

36. (అన్లెస్) Unless - లేనియెడల; లేకున్న.

ఉదా.—Unless you confess your wrong, you will not be excused - నీ తప్పును ఒప్పుకొనక పోయినయెడల, నీవు క్షమింపబడవు.

37. (వెన్) When - ఎప్పుడో అప్పుడు.

ఉదా.—When the train comes, people flock to it - రైలును ఎపుడువచ్చునో, అప్పుడే జనులు దాని పైన మూగుదురు.

38. (వేర్) Where - ఎక్కడో అక్కడ.

ఉదా.—Where there is a will, there is a way - ఎక్కడ మనస్సు ఉంటే, అక్కడమార్గముండును.

39. (వైల్) While - ఆసమయమున; అట్టివేళ.

ఉదా.—Don't get into the bus while it is in motion - బస్సు కదులుచున్నప్పుడు, బస్సులో ఎక్కవద్దు.

40. (వెదర్—ఆర్) Whether—or - అయినా, కాకున్నా.

ఉదా.—Whether he studies or not, he will pass - వాడు, చదివినా, చదువకపోయినా, ఉత్తీర్ణుడగును.

## అభ్యాసము

I. Insert suitable conjunctions in the following blanks:—

1. The kitten is small——clever.
2. The elephant is bigger——the ass.
3. Is the bat a bird——a beast?
4. Think——you leap.
5. The fox is——clever——cunning.
6. I am sorry——your father died.

II. Join the following pairs of sentences with suitable conjunctions:—

1. He is clever. He is not honest.
2. Hurry up. You will miss the train.
3. It got dark. The lights were switched off.
4. He is a miser. He is rich.
5. He cannot run. He is not so strong.

6. I have a book in my hand. I have a pen in my hand.

7. He died. He ate bug poison.

8. Please remain in my room. I will return.

9. He studies well. He is very dull.

10. Close the cover. You put the letter into it.

11. He came into my room. I was writing a letter.

12. The bus was upset. No one was hurt.

13. I shall wait. You finish your meals.

14. I started late. I caught the train.

15. The boy answered every question. His teacher praised him very much.

III. Use the following in sentences of your own:—

1. As though
2. Either—or
3. Because
4. In order that
5. On condition that
6. Neither—nor
7. Not only—but also
8. Provided that
9. So that
10. Lest
11. As well as
12. As soon as
13. As if
14. Even if
15. Since



# 99. The Interjection

(డి ఇంటర్జెక్షన్)

ఈ క్రింది వాక్యములను చదువుము :—

1. Ah, they have scored a goal too!
2. Alas, the poor man collapsed!
3. Cheerio, Ramu!
4. Hallo! How do you do?
5. Hurrah! Our school has won!
6. Hush! Don't talk.
7. Oh, you can't do that!
8. O, that I were young again!
9. What! What a fool you are!

I. పై వాక్యాలలో Ah, Alas మొదలైన మొదటిపదములు మన మప్పుడప్పుడు జీవితములో బొందు సంతోషము, సంతాపము, కోపము మొదలైన మనోద్రేకములను దెలుపు మాటలు. మనభాషలోని అయ్యో, అక్కటా, అరరే, భళీ మొదలగున విట్టి ఉద్రేకార్థకపదములే. ఇట్టి మనోద్రేకము తెలియజేయుమాటలకు, ఆంగ్లములో Interjections (ఇంటర్జెక్షన్స్) అని పేరు. ఈ Interjections కేవలము మనోద్రేకమును

దెలుపు మాటలే కాని, ప్రత్యేకమైన అర్థముకలవి కావు. కడకు వాక్యమందలి భాగములుకూడా కావు.

II. Interjection పదమునకు తరువాత ఆశ్చర్యార్థక చిహ్నము (!) ఉంచితే ఆ తరువాతి పదము Capital letter తో ఆరంభించవలెను. అట్లు గాక Comma ( , ) ఉంచితే, ఆవాక్యానికి కడపట ఆశ్చర్యార్థక చిహ్నము రావలెను.

III. Interjection పదము తరువాతనేగాకుండా, యెట్టి చిత్తవృత్తినైన తెలియజేసే Phrase కు Sentence కు తరువాతగూడా ఆశ్చర్యార్థక చిహ్నమును ఉంచవలెను.

ఉదా.—

1. What a pity it is!
2. How beautiful the flower is!
3. O, what a fool he is!

IV. మరికొన్ని Interjection పదములు.

1. Approval (అప్రూవల్) ఆమోదము

   Hallow, Hush, Bravo (భళీ, సెహబాస్)

2. Joly (జాయ్) సంతోషము

   Hurrah, Alas, Cheerio, Huzza (అహ్హా)

3. Grief (గ్రీఫ్) సంతోషము
   Alas, Alack (అయ్యో, అకటా, కటకటా)

4. Surprise (సర్ప్రైస్) ఆశ్చర్యము
   Ah, Oh, O, what, (ఆ, ఓ, అహహా, ఔరా)

5. Anger (ఆంగర్) కోపము
   Avaunt (ఛీ, పో)

V. పై వాక్యములవంటి వాక్యములకు Exclamatory sentences (ఆశ్చర్యార్థక వాక్యములు) అని పేరు.



# 100. Tagore the Great Poet

## మహాకవి టాగూరు

Tagore is one of the greatest poets of the world. India is very proud of him. He has written numerous Novels, Dramas, Poems and Stories which have brought international fame.

ప్రపంచమందలి మహాకవులలో టాగూరు ఒకడు. భారతదేశము అతనిని గురించి మిక్కిలి గర్వించును. అంతర్జాతీయ ప్రతిష్ఠను సంపాదించిన, నవలలను, నాటకములను, పద్యములను, కథలను ఆయన రచించెను.

The full name of Tagore is Rabindranath Tagore. He was born in Culcutta on the 7th May, 1861. His father is Devendranath Tagore, and his mother is Sarada Devi. He is the fourteenth child of his parents. Tagore did not like the school education. He regarded his house as school and Nature as his Teacher. He began to write poems even at the early age of fifteen.

టాగూరు పూర్తిపేరు రవీంద్రనాథ టాగూరు. కలకత్తాలో ఆయన 1861 వ సంవత్సరము మే నెల 7 వ తేదీన జన్మించెను. అతని తండ్రి దేవేంద్రనాథ టాగూరు. తల్లి శారదాదేవి. అతని తలిదండ్రుల కతడు. పదునాల్గవ సంతానము. టాగూరుకు బడి యందలి చదువు నచ్చలేదు. అతడు. తన ఇంటినే పాఠశాలగ, ప్రకృతినే ఉపాధ్యాయుడుగ భావించెను. పదునైదు సంవత్సరముల పసితనముననే ఆతడు పద్యములను వ్రాయనారంభించెను,

Tagore is the founder of two great institutions, the Viswabharathi and the Sree Niketan. Viswabharathi is an international University imparting instruction in Indian arts and culture. Sree Niketan was founded for Rural uplift.

విశ్వభారతి, శ్రీనికేతనము అను రెండు గొప్ప సంస్థలను రవీంద్రుడు స్థాపించెను. భారతీయ కళలను, నాగరికతనుబోధించు అంతర్జాతీయ విశ్వవిద్యాలయము - విశ్వభారతి. గ్రామ పునరుద్ధరణమునకు ఏర్పఱచబడిన మహాసంస్థ శ్రీనికేతనము.

Tagore's Gitanjali has international appreciation. It brought him the Nobel prize. The Culcutta University awarded him the title 'Dr.' The title 'Sir'—which is a great distinction—was awarded to him

by the British Government. In the year 1940 the Oxford University bestowed the title 'Dr. of Letters' on him. Tagore was a great patriot. He surrendered his 'Sir' title at the time of Jalianwalah Bagh massacre. Thus Tagore has contributed much to the spread of Indian arts and culture abroad.

He passed away on the 7th August 1941 and the entire world mourned for him.

టాగూరు గారి 'గీతాంజలి' అంతర్జాతీయమైన మెప్పు పొందినది. ఆయన కది 'నోబెలు బహుమతి' సంపాదించి పెట్టినది. కలకత్తా విశ్వవిద్యాలయము ఆయనకు 'డాక్టరు' బిరుదము నిచ్చినది. మిక్కిలి ఘనమగు 'సర్' బిరుదమును ఆంగ్లప్రభుత్వ మాయనకు ప్రసాదించినది. 1940 వ సంవత్సరములో ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారాయనకు 'డాక్టరు ఆఫ్ లెటర్సు' అను బిరుదమిచ్చిరి. టాగూరు గొప్ప దేశభక్తుడు. జలియన్‌వాలా బాగ్ దురంతములు జరిగి నప్పుడు, అసమ్మతి సూచకముగా ఆయన తన 'సర్' బిరుదమును త్యజించెను. ఈ విధముగ విదేశములందు, భారతీయ కళలు, సంస్కృతి వ్యాపించుటలో ఆయన తగు పాత్రవహించెను.

1941 సంవత్సరము ఆగష్టు 7 వ తేదీన ఆయన పరమపదించినప్పుడు ప్రపంచ మంతయు ఆయనకై దుఃఖించెను.



## 101. Mrs. Sarojini Naidu

## శ్రీమతి సరోజినీ నాయుడు

Sarojini Devi is the gem of Indian women. She was born in Hyderabad on 13th February 1879. Srimathi Varada Sundari Devi and Dr. Aghoranadha Chatopadhyaya were her parents. Their family was famous for Sanskrit learning. Sarojini's grandfathers and forefathers were great Sanskrit scholars and poets.

భారతదేశపు మహిళలలో సరోజినీదేవి వజ్రమువంటిది, 1879 సం॥ ఫిబ్రవరినెల 13-వతేదీన ఆమె హైదరాబాదులోపుటెను. శ్రీమతి వరదాసుందరిదేవి, శ్రీ అఘోరనాథ చటోపాధ్యాయుఁడును ఆమె జననీ జనకులు. వారి కుటుంబము సంస్కృతభాషా పాండిత్యమునకు ప్రసిద్ధికెక్కినది. సరోజినీదేవి తాత ముత్తాతలు సంస్కృతభాషాపండితులును, కవులును ఐ యుండిరి.

Sarojini was very intelligent in her studies. She passed the Matriculation examination even at the age of twelve. By her thirteenth year she began to write

poems. Her first poem 'Lady of the Lake' brought her name and fame. From 1895 to 1898 she studied in England. She took her M.A. degree in the Cambridge University there. On her return to India in 1898 she married Dr. Sri Govindarajulu Naidu. They had two sons and two daughters.

విద్యాభ్యాసములో సరోజిని చాల తెలివితేటలు కలిగి యుండినది. పం్రడెండేండ్ల వయసుననే ఆమె మెట్రికులేషను పరీక్షయందు ఉత్తీర్ణురాలయ్యెను. పదమూడవ సంవత్సరమువచ్చు నాటికే పద్యములు వ్రాయ మొదలుపెట్టి యుండినది. ఆమెమొదటి పద్యము 'లేడీ ఆఫ్ ది లేక్' అనునది ఆమెకు పేరును ప్రతిష్ఠను తెచ్చిపెట్టినది. 1895 నుండి 1898 వరకు ఆమె యింగ్లాండులో విద్యనభ్యసించెను. అచటి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునందు యం.ఏ. పట్టము పొందినది. 1898 లో భారతదేశమునకు తిరిగి వచ్చి శ్రీ గోవిందరాజులునాయుడుగారిని వివాహమాడెను. వారికి ఇద్దఱు కుమారులు, ఇద్దఱు కుమార్తెలు కలిగిరి.

Sarojini was a great patriot. She was a follower of Mahatma Gandhi. She took part in the freedom struggle many a time. She presided over the Indian National Congress Session in the year 1925. She was the first woman to preside over the Congress

Session. For many years she was a member of the Congress Working Committee.

సరోజిని గొప్ప దేశభక్తురాలు. ఆమె గాంధీమహాత్ముని అనుయాయురాలు. స్వాతంత్ర్యపోరాటములో ఆమె చాలమారులు పాల్గొనెను. 1925 లో భారత జాతీయ కాంగ్రెసు సభకు అధ్యక్షత వహించెను. జాతీయ కాంగ్రెసునకు అధ్యక్షత వహించిన మొదటి మహిళ ఈమెయే. చాలసంవత్సరము లామె కాంగ్రెసు కార్య వర్గములో సభ్యురాలుగా నుండెను.

After the advent of freedom she was appointed as the Governor of Uttar Pradesh. She proved to be an able Governor. She died on 2nd March, 1949.

స్వాతంత్ర్యము లభించిన తరువాత ఆమె ఉత్తరప్రదేశము గవర్నరుగా నియమింపబడెను. సమర్థతగల గవర్నరుగా తన్ను తాను నిరూపించుకొనెను. 1949-వ సంవత్సరము మార్చి రెండవ తేదీన మరణించెను.

## ప్రత్యేక అర్థములు

Name and fame - నేమ్ అండ్ ఫేమ్ = పేరు ప్రతిష్ఠ.

Many a time - మెనీ ఎ టైమ్ = చాలమారులు.

Working Committee - వర్కింగ్ కమిటి = కార్యవర్గము.

Advent of freedom - అడ్వెంట్ ఆఫ్ ఫ్రీడం = స్వాతంత్ర్యోదయము.



# 102. Emperor Asoka

## అశోక చక్రవర్తి

Asoka is one of the greatest Kings of the world. He belonged to the Mauryan dynasty. King Bindusara was his father. His mother's name was Subhadrangi.

ప్రపంచమందలి గొప్పరాజులలో అశోకుఁడొకడు. అతఁడు మౌర్యవంశమునకు చెందినవాఁడు. బిందుసార మహారాజు అతని తండ్రి. ఆయన తల్లిపేరు సుభద్రాంగి.

Soon after he became King, he waged war against Kalinga. The people of Kalinga were great heroes. A fierce battle took place. Asoka won the battle. But thousands of soldiers died. A large number of horses and elephants also died. The blood-shed was great. Asoka thought that he was the root-cause for the great loss of life. He repented and enbraced Buddhism.

రాజయిన వెంటనే అశోకుఁడు కళింగదేశముతో యుద్ధము ప్రకటించెను. కళింగప్రజలు గొప్ప వీరులు. భయంకర యుద్ధము

జరిగెను. అశోకుఁడు యుద్ధమును జయించెను. కాని వేలకొలది సైనికులు మరణించిరి. చాల గుఱ్ఱములు, ఏనుగులు చనిపోయినవి. రక్తపాతము ఎక్కువ జరిగినది. ఈ ప్రాణనష్టమున కంతటికి తానే మూలకారణమని అశోకుఁడు గ్రహించెను. పశ్చాత్తాప పడి అతఁడు బౌద్ధమతమును అవలంబించెను.

The main doctrine of Buddhism is Ahimsa. After he became a Buddhist Asoka lead a saint-like life. He discouraged meat-eating. He opened hospitals for men and animals. He engraved the doctrines of Buddhism on big stones and pillars. He built many stupas in the name of Buddha. The stupa which he built at Sanchi is the most famous one.

అహింస బౌద్ధమతముయొక్క ముఖ్య సిద్ధాంతము. బౌద్ధమతస్థుడైన తరువాత అశోకుఁడు ఋషివంటి జీవితముఁగడపెను. మాంసాహారమును నిరసించెను. మనుష్యులకు జంతువులకు ఆసుపత్రులను ఏర్పాటుచేసెను. బౌద్ధమత సిదాంతములను రాళ్లపైనను, స్తంభములపైనను చెక్కించెను. బుద్ధుని పేరిట అనేక స్తూపములను కట్టించెను. సాంచీ వద్ద అతడు కట్టించిన స్తూపము మిక్కిలి ప్రసిద్ధికి వచ్చినది.

The design of the four lions of this stupa has been adopted by the Government of India as a National emblem.

సాంచీ స్తూపమునందలి నాలుగు సింహాముల చిత్రీకరణము భారతప్రభుత్వమువారిచే జాతీయచిహ్నముగ అవలంబింపబడినది.

## అర్థములు

Dynasty - డైనాస్టీ = రాజవంశము.

Waged war - వేజ్డ్ వార్ = యుద్ధము ప్రకటించెను.

Blood-shed - బ్లడ్ షెడ్ = రక్తపాతము.

Root-cause - రూట్ కాస్ = మూలకారణము.

Repent - రిపెంట్ = పశ్చాత్తాపపడుట.

Embrace - ఎంబ్రేస్ = కౌగలించుకొనుట.

Doctrine - డాక్ట్రిన్ = సిద్ధాంతము.

Engrave - ఎంగ్రేవ్ = చెక్కుట.

National Emblem - నేషనల్ ఎంబ్లమ్ = జాతీయ చిహ్నము.

Embraced Buddhism - ఎంబ్రేస్డ్ బుద్ధిజమ్ = బౌద్ధ మతమును అవలంబించెను.



## 103. Swami Vivekananda

## వివేకానందస్వామి

Swami Vivekananda is the person who carried the eastern culture to the West. He was born on 12th January 1862 at Simooliya, a small village near Calcutta. His father was Viswanatha Dutt. Bhuvaneswari Devi was his mother. Vivekananda was named 'Narendra' by his parents.

ప్రాచ్యనాగరికతను, పడమటిదేశములకు తీసికొనిపోయిన వ్యక్తి వివేకానందస్వామి. కలకత్తాకు సమీపముననుండు 'శిమూలియా' అను గ్రామములో ఆయన 1862 వ సంవత్సరము జనవరి 12 వ తేదీన జన్మించెను. ఆయన తండ్రి విశ్వనాథ దత్తుఁడు. భువనేశ్వరీదేవి ఆయన తల్లి. వినేకానందున కాయన తల్లిదండ్రులు 'నరేంద్రుఁడు' అని పేరు పెట్టిరి.

He studied Sanskrit and Bengali languages even when he was young. Later he studied in a College at Calcutta. During this period he studied Eastern and Western philosophies. His father died before



వివేకనందస్వామి

Narendra could complete his education. So he had to take up the responsibility as the head of the family. He had to undergo many difficulties. He lost peace of mind.

ఆయన చిన్నతనముననే సంస్కృత బెంగాలీ భాషలను నేర్చుకొనెను. తరువాత కలకత్తాలో ఒక కళాశాలయందు విద్య నభ్యసించెను. ఈ కాలములోనే ఆయన ప్రాచ్య, పాశ్చాత్య వేదాంతమును గురించి తెలిసికొనెను. నరేంద్రుడు విద్యాభ్యాస మును ముగించక ముందే ఆయన తండ్రి మరణించెను. కనుక ఆయన కుటుంబముయొక్క బాధ్యతను వహించవలసి వచ్చెను. చాల కష్టములకాయన లోనయ్యెను. ఆయన మనశ్శాంతిని గోల్పోయెను.

In those days there lived a sage by name Ramakrishna Parama Hamsa in a village Dakshineswaram near Calcutta. Narendra met him. Ramakrishna took Narendra as his disciple. He taught him all the Godly knowledge he knew. He named Narendra as 'Vivekananda.' In the year 1888 Ramakrishna passed away. Vivekananda took his place as 'Guru'. In the year 1893 he attended the Conference of all religions at Chicago. He represented the

Hindu religion. He delivered imformative lectures about Hinduism and impressed the greatness of Hindu religion on all nations.

ఆ దినములలో కలకత్తా సమీపమందలి దక్షిణేశ్వరమను గ్రామములో రామకృష్ణపరమహంస అను ఒకయోగి ఉండెను. నరేంద్రుఁ డాయనను కలిసెను. ఆయన నరేంద్రుని శిష్యునిగా గ్రహించెను. తనకు తెలిసిన భగవద్ జ్ఞానము నంతటిని ఆయన నరేంద్రునకు బోధించెను. నరేంద్రునకు 'వివేకానందుఁడు' అను పేరుపెట్టెను. 1888 సం॥లో రామకృష్ణపరమహంస చనిపోయెను. వివేకానందుఁడు గురువుగా ఆయన స్థానమును ఆక్రమించెను. 1893 సం॥ చికాగోలో జరిగిన అన్నిమతముల మహాసభ కాయన పోయెను. అతఁడు హిందూమతమునకు ప్రాతినిధ్యమువహించెను. హిందూమతమునకు సంబంధించిన బోధనాత్మకములగు ఉపన్యాసములిచ్చి, అన్నిజాతులవారి యందును హిందూమతము యొక్క గొప్పతనము హత్తుకొనునట్లు చేసెను.

He travelled widely in America, England, France and many other foreign countries. He had disciples in all these countries. He returned to India in 1897. He died at Beylur on 5th July 1902 at the early age of 39. The Ramakrishna Mission which has got branches all over the world is

the greatest monument that stands to his greatness.

ఆయన అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు మొదలగు విదేశములలో విరివిగా సంచరించెను. ఈ దేశములన్నిటిలో ఆయనకు శిష్యులుండిరి. 1897 లో ఆయన ఇండియాకు తిరిగి వచ్చెను. 39 సం॥ల చిన్న వయస్సునందే ఆయన బేలూరులో 1902 నంవత్సరం జూలై 5 వ తేదీన మరణించెను. ప్రపంచమందంతటను, శాఖోపశాఖలుగల రామకృషమఠము ఆయన గొప్పతనమునకు చిహ్నముగ నున్నది.

## ప్రత్యేక అర్థములు

Sage - సేజ్ = పరివ్రాజకుడు, (స్వామి)

Pass away - పాస్ అవే = మరణించుట.

Travel widely - ట్రావెల్ వైడ్లీ = విరివిగా సంచరించుట.

Represent - రెప్రెజెంట్ = ప్రాతినిధ్యము వహించుట.



# 104. Bhagavan Buddha

(623-543 B.C.)

## బుద్ధభగవానుఁడు

Lord Buddha is one of the greatest personalities of the world. He led mankind towards kindness, righteousness, truth, peaceful living and salvation. He was born in Kapilavastu about two thousand five hundred years ago. Kapilavastu was the capital of Nepal. His father Suddhodana was the King of Nepal. Maya Devi, his mother, died immediately after he was born. Suddhodhana brought up his son with utmost care and love. Buddha was first named Siddhartha and Gautama.

ప్రపంచమందలి గొప్ప మహనీయులలో బుద్ధభగవానుఁడొకడు. దయ, న్యాయము, సత్యము, ప్రశాంత జీవనము, మోక్షము మొదలగువానివైపు మానవజాతిని ఆయన ప్రయా

ణింపఁజేసెను. కపిల వస్తులో రమారమి రెండువేల ఐదువందల సంవత్సరముల క్రిందట ఆయన జన్మించెను. అతని తండ్రి శుద్ధోదనుఁడు నేపాల రాజ్యమునకు రాజు. బుదుఁడు పుట్టిన వెంటనే అతని తల్లి మాయాదేవి మరణించెను. శుద్ధోదనుడు తన కుమారుని మిక్కిలి ప్రేమతో జాగ్రత్తగా పెంచెను. బుద్ధునకు మొదట సిద్ధార్థుఁడనియు, గౌతముడనియు పేరుపెట్టిరి.

Siddhartha had good education. He was well trained in weapons also. He seemed to be always thinking even when he was a boy. He had no appreciation of the worldly pleasures. He did not have aptitude for kingly pomp. His father tried to divert Gautama's attention towards worldly pomp and pleasure. So he got him married to Yasodhara. Gautama had a son by Yaso-dhara. His name was Rahula. But Gautama's attention was not fully drawn towards pleasures. He did not give up his deep thinking.

సిద్ధార్థుఁడు చక్కని విద్యాభ్యాసము పొందెను. ఆయుధములను ప్రయోగించుటలో కూడ మంచి శిక్షణ పొందెను. బాలుడై

యున్నపుడుకూడ సిద్ధార్థుఁడు ఎల్లవేళలందును ఆలోచించుచున్నట్లే అగుపించుచుండెను. ప్రాపంచిక సుఖములయందతనికి ఆసక్తి లేకుండెను. రాజరికపు వైభవమునం దిష్టముండలేదు. ప్రాపంచిక సుఖ, వైభవముల వైపు గౌతముని మనసు నాకర్షించుట కతని తండ్రి ప్రయత్నించెను. కనుక యశోధరతో అతనికి వివాహము చేసెను. యశోధర యందు గౌతమున కొక కుమారుడు కలిగెను. అతని పేరు రాహులుఁడు. అయినను గౌతముని మనస్సు పూర్తిగా ప్రాపంచిక విషయములవైపు మరలలేదు. అతడు తన 'ఆలోచనను' విడువలేదు.

Leaving his son, wife and the palace, one night Gouthama went into the forests. He became a Sanyasi. He roamed all over the country and reached Gaya. There he sat under a tree, which came to be known after him as 'Bodhi' tree and began to medidate upon God. After a long time wisdom dawned upon him. Afterwards he came to be known as Buddha. 'Buddha' means 'one who has great wisdom'. Later on he began to preach his new religion.

Many people became his followers. His religion spread not only all over India, but also in other countries such as Tibet, Burma and China. Even now Buddhism is found in these countries.

గౌతము డొకనాటిరాత్రి కుమారుని, భార్యను, అంతఃపుర మును విడచి అరణ్యములకు పోయెను. అతడు సన్న్యాసము స్వీక రించెను. దేశమంతయు సంచారముచేసి కడపటికి 'గయ'ను చేరెను. అచట ఒక వృక్షముక్రింద కూర్చొని దేవుని గూర్చి తపస్సుచేయ మొదలుపెట్టెను. చాలకాలమునకు అతనికి జ్ఞానో దయ మయ్యెను. తరువాత అతఁడు బుద్ధుఁడని పిలువబడెను. 'బుద్ధుఁడు' అనగా 'ఎక్కువ బుద్ధి లేక జ్ఞానముకలవాఁడు' అని అర్థము. తరువాత అతఁడు తనమతమును బోధింప నారంభించెను. అనేకమంది అతనికి అనుయాయులయిరి. ఆతని మతము భారత దేశమునందే కాక టిబెట్టు, బర్మా, చైనాదేశములయందుకూడ వ్యాపించెను. బౌద్ధమతము ఇప్పటికిని ఈ దేశములయందు నిలిచి యున్నది.

Buddhism was taught in Pali language which was then spoken by the common people. Principles of Buddhism were simple. There were no caste differences and sacrifices.

Purity in thought and deed, love of truth and Ahimsa were the main principles of this religion. So it spread quickly and Emperors like Asoka and Kanishka embraced it.

సామాన్యప్రజ లప్పుడు మాటలాడుచుండిన 'పాళి' భాషలో బౌద్ధ మతము బోధింపబడెను. బౌద్ధమత సిద్ధాంతములు మిక్కిలి సామాన్యమైనవి. కులభేధములుకాని, బలులుకాని లేవు. మనస్సులోను, క్రియలోను పరిశుద్ధతకలిగి యుండుట, సత్యమును, అహింసను ప్రేమించుట ఈ మతము ముఖ్యసిద్ధాంతములు. కనుక ఈ మతము తొందరగ వ్యాపించినది. అశోకుఁడు, కనిష్కుడు మొదలగు చక్రవర్తులుకూడ దీని నవలంబించిరి.



# 105. Amarajeevi Potti Sreeramulu

(1901—1952)

## అమరజీవి పొట్టి శ్రీరాములు

Amarajeevi Potti Sreeramulu's name is to be written in golden letters in the History of Andhra State. He is one the most rare personalities born in India. He is the one and only the one who sacrificed his life for the sake of the principle in which he believed. His is an unparalleled personality in History.

ఆంధ్రరాష్ట్ర చరిత్రలో అమరజీవి పొట్టి శ్రీరాములుగారి పేరు సువర్ణాక్షరములతో వ్రాయబడవలసి యున్నది. భారత దేశమునందు జన్మించిన మిక్కిలి అపూర్వ వ్యక్తులలో ఆయన ఒకరు. తాను నమ్మిన సిద్ధాంతమునకై ప్రాణములను విడచిన వ్యక్తి ఆయన ఒక్కడే అని చెప్పవచ్చును. చరిత్రలో ఆయన సాటిలేని వ్యక్తి.

He was born in an Arya Vaisya family in Madras on March 16, 1901. He completed his Secondary Education there. When

he was studying in the College, he felt interested in Technical Education. So he discontinued his Collegiate studies and went to Bombay. There he studied in the Victoria Technical Institute, Bombay and passed Diploma course in Sanitary Engineering. Later he got an appointment in the Railway Department at Bombay.

పొట్టి శ్రీరాములుగారు మదరాసులో ఆర్యవైశ్యకుటుంబములో 1901 వ సంవత్సరము మార్చి 16 వ తేదీన జన్మించిరి. అచటనే ఆయన మెట్రికులేషను చదువును పూర్తిచేసెను. కాలేజీలో చదువుచున్నపుడు, సాంకేతిక విద్యయం దాయనకు ఆసక్తి కలిగినది. కనుక ఆయన కళాశాల చదువును మానివేసి బొంబాయికి పోయెను. బొంబాయిలోని విక్టోరియా టెక్నికల్ ఇన్స్టిట్యూటులో చదివి శానిటరీ యింజనీరింగు పరీక్షయందు కృతార్థుండయ్యెను. తరువాత ఆయన బొంబాయిలోనే రైల్వేశాఖయందు ఉద్యోగము పొందెను.

The death of his wife in 1926 brought a thorough change in Sreeramulu's life. He became desperate. He resigned his appointment in the Railway Department and went to Sabarmati Asram. He picked up the art of spinning and received the blessings

of Mahatma Gandhi. He took part in the National movement of 1942. After his release he took to construction work. He lived at Nellore and helped the people there very much.

1926 సం॥ లో భార్య మరణము శ్రీరాములుగారి జీవితములో గొప్పమార్పు తెచ్చినది. ఆయన మిగుల నిరాశను, నిస్పృహను పొందెను. రైల్వేశాఖయందలి తన ఉద్యోగమునకు రాజీనామా యిచ్చి సబర్మతీ ఆశ్రమమునకు పోయెను. అచట నూలువడకుట యందు నేర్పును సంపాదించి గాంధీమహాత్ముని ఆశీర్వాదములను పొందెను. 1942 వ సంవత్సరపు జాతీయ సమరములో ఆయన పాల్గొనెను. జైలునుండి విడుదల అయి వచ్చిన తరువాత అతడు నిర్మాణకార్యక్రమమును కొనసాగించ మొదలు పెట్టెను. నెల్లూరులో నివసించుచు అచట ప్రజలకు మిక్కిలి సహాయము చేసెను.

Even from the beginning of his political life Sreeramulu was of opinion that Andhras must have a separate state. But even after independence, the chances for the formation of the Andhra State were remote. Any amount of agitation by the people was of no use. So Sri Potti Sreeramulu took up to 'Prayopavesam' or fasting unto death for the

formation of Andhra State, in the house of Sri Bulusu Samba Moorthy at Madras. After fasting for 58 days he passed away on 16th December 1952. His death provoked great agitation all over Andhra. There were many Hartals. Running trains were stopped by mobs. Police opened fire in many places. Many people died. At last Andhra State was formed on 1—10—1953.

Though Potti Sreeramulu is bodily dead, he is spiritually alive in the heart of every Andhra, and so he is 'Amara Jeevi' or everliving.

ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రముండవలెనని రాజకీయ జీవితము నారంభించినప్పటినుండియు శ్రీరాములుగారు భావించుచుండిరి. కాని స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాతకూడ ఆంధ్ర రాష్ట్రము లభించు అవకాశములు తక్కువగానుండెను. ప్రజలు చేసిన ఆందోళన అంతయు నిరుపయోగ మయ్యెను. కనుక మదరాసులోని శ్రీ బులుసు సాంబమూర్తిగారి యింటిలో శ్రీ రాములుగారు ఆంధ్రరాష్ట్రము కొరకు 'ప్రాయోపవేశము' లేక ఆమరణ నిరాహారదీక్షను ప్రారంభించెను. 58 దినములు ఉపవాసముచేసిన తరువాత 1952 సం॥ డిశెంబరు 16 వ తేదీన ఆమహనీయుఁడు స్వర్గస్థుడయ్యెను. అయన మరణమువలన

ఆంధ్రదేశమునందంతటను అలజడి బయలుదేరెను. హరతాళము లెన్నియో జరిగినవి. ప్రజలు తండోపతండములుగ రైళ్లను నిలుపుదలచేసిరి. పోలీసువారు అనేకస్థలములలో కాల్పులుజరిపిరి. అనేకమంది చనిపోయిరి. కడపటికి 1-10-1953 తేదీన ఆంధ్ర రాష్ట్రము ఏర్పాటయ్యెను.

పొట్టి శ్రీరాములుగారు శారీరకముగ మరణించినను, ప్రతి ఆంధ్రుని హృదయమునందును ఆయన భావస్ఫూర్తితో నివసించుచున్నాడు. కనుకనే ఆయన 'అమర జీవి'.

## ప్రత్యేక అర్థములు

Unparalleled - అన్ పారలల్డ్ = సాటిలేని.

Collegiate - కలీజియేట్ = కళాశాల సంబంధమైన.

Become desperate - బికం డెస్పరేట్ = నిస్పృహ చెందుట.

Construction work - కన్‌స్ట్రక్షన్ వర్క్ = నిర్మాణకార్యక్రమము.

Chance - ఛాన్స్ = అవకాశము.

Political life - పొలిటికల్ లైఫ్ = రాజకీయజీవితము.



# 106. Union is strength

## ఐ క మ త్య మే బ ల ము

Once there lived a farmer in a village. He became old. He had four sons. They were foolish and lazy. They were always quarrelling among themselves. The old man was very sad. He wanted to teach them a lesson and make them good.

ఒక గ్రామములో ఒక రైతు నివసించుచుండెను. అతఁడు వృదుఁడయ్యెను. అతనికి నలుగురు కుమారులుండిరి. వారు తెలివిలేనివారును, సోమరులునై యుండిరి. ఎల్లప్పుడును తమలో తాము కొట్లాడుచుండిరి. ఆ వృద్ధుఁడు చాల చింతించెను. వారికి ఒక గుణపాఠమునునేర్పి బాగుపరచవలెనని అతఁడనుకొనెను.

One day he asked his sons to get a bundle of sticks. He asked each of them to break the bundle. Everyone of them tried but could not break it.

ఒకనాడు కుమారులతో ఒక కట్టెలమోపును తెమ్మని చెప్పెను. ఒక్కొక్కరు ఆమోపును విరువవలసినదని చెప్పెను. ప్రతివాడును ప్రయత్నించెను కాని విఱచలేకపోయిరి.

Now the farmer untied the bundle and asked his sons to break the sticks separately. They broke them easily.

అతఁడా మోపునువిప్పఁదీసి ఒక్కొక్కకఱ్ఱను విడివిడిగా విఱచవలసినదని కొడుకులతో అనెను. వారు సులభముగా విఱచి వేసిరి.

The farmer explained to his sons: 'Look here! Sons! You could not break the sticks when they were united in the form of a bundle. You could easily break them when they were separated. So also if all of you are united nobody can harm you. But if you quarrel among yourselves and remain separately others can easily harm you. So you must have unity among yourselves.' The boys heard this. They stopped quarrelling with one another. They learnt the lesson that 'Union is strength.'

అప్పుడా రైతు కుమారుల కిట్లు బోధించెను : "నాయనలారా ఇటు చూడుడు. కఱ్ఱలన్నియు మోపులో కలసియుండి నపుడు మీరు విఱువలేక పోయితిరి. అవి విడిపోయిన వెంటనే సులభముగ

విఱచివేయ గలిగితిరి. అదే విధముగ మీ రందఱును కలసి ఐక మత్యముగ నుండినయెడల మీ కెవ్వరును కీడుచేయలేరు. అట్లు గాక మీలో మీరు కలహించుకొనుచు వేరుగానుండిన ఇతరులు మీకు సులభముగా కీడుచేయగలరు. కనుక మీలో మీరు ఐక మత్యము కలిగియుండవలయును.'' ఆ బాలు రిదివిని ఒకరితో నొకరు కలహించుటను మానుకొనిరి. వారు 'ఐకమత్యమే బలము' అను నీతిని నేర్చుకొనిరి.



# 107. Mohandas Karamchand Gandhi

(1869—1948)

## మోహనదాస్ కరంచంద్ గాంధి

1. Mohandas Karamchand Gandhi, popularly known as Mahatma Gandhi and the Father of our Nation was born on 2-10-1869 at Porbandar. His father was a gentleman of high principles and his mother was deeply religious, and God-fearing. So Gandhi was from his birth filled with high principles of moral life. If you fear God and have faith in Him, you will not do wrong.

1. 'మహాత్మాగాంధి' అని, మనజాతి పితయని ప్రజలలో పేరుబొందిన మోహనదాస్ కరంచంద్‌గాంధి 2-10-1869 వ తేది నాడు పోర్బందరునందు జన్మించెను. ఆయన తండ్రి గొప్ప నీతి నియమములుగల పెద్దమనిషి. ఆయనతల్లి మంచి మతాచారములందు నిష. దైవభీతియుగల యిల్లాలు. కనుక గాంధి, ఆయన జననమాదిగా, మంచి నీతివంతమైన జీవితనియమములతో నిండియుండెను.

2. During his school life, Gandhiji happened to read two Guzerati plays. They were about "Sravana's deep devotion to his parents" and "King Harischandra's great love for truth." These plays left a very deep mark on his young mind and made him what he was all through his life.

2. ఆయన పాఠశాల జీవితములో (చదువుకొనే కాలములో) గాంధి, రెండు గుజరాతి నాటకములు చదువుట తటస్థించెను. అవి "శ్రావణుని పితృభక్తి" గురించియు, "హరిశ్చంద్రుని సత్యనిరతిని" గురించి రచింపబడిన నాటకములు. ఈనాటకములు గాంధియొక్క లేతమనసునందు చెరగని ముద్రవేసి, ఆయన జీవితమును ఆమరణాంతము చాలా ప్రభావితము గావించెను.

3. Gandhiji was neither brilliant nor bright in his studies. But he was honest and hard working. After he passed his Matriculation, he went to England in 1888 for higher studies. There he lived a very simple life, as he promised to his mother, without touching wine, woman or meat. He cooked his food and washed his clothes

himself. In 1891 he returned as a Barrister-in-law from England.

3. గాంధి చదువులలో గొప్పమేధావిగాని, తెలివిపరుడు గాని కాదు. అయినను మంచినీతిపరుడు, కష్టపడి పనిచేయు వాడునై యుండెను. ఆయన మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడైనవెనుక పైచదువులకుగాను, 1888 వ సంవత్సరములో ఇంగ్లాండుదేశమునకుపోయెను. అక్కడ, ఆయన తనతల్లికి బాస చేసినట్లు మద్యము, మదవతి, మాంసాహారాలు ముట్టకుండ నిరాడంబరముగా జీవించెను. ఆయన స్వయముగా తనవంట తానే వండుకొనుచు, తనదుస్తులు తానే ఉతుకుకొనుచుండెను. 1891 వ సంవత్సరములో ఇంగ్లాండునుండి బారిస్టరుగా తిరిగివచ్చెను.

4. He sailed for South Africa on some professional work. But when he found there that our Indians were being ill-treated, he continued to stay there to help the Indians have their status raised. He waged his first non-violent fight against the South African Government and won. Then, on his return to India in 1915, Rabindranath Tagore gave him the title of Mahatma. In India too the first non-violent fight called Satyagraha was waged in Champaran, then at Khera and

later at Ahmedabad. In all these fights his soul power was put to severe test and he came out successful.

4. ఆయన యేదో వృత్తి ఉద్యోగరీత్యా దక్షిణాఫ్రికాకు వెళ్ళెను. అయితే అచట తనసోదరభారతీయులు హీనముగా చూడబడుటచూచి, వారి ఉద్ధరణార్థము అచటనే ఉండిపోయెను. ఆయన మొట్టమొదటి శాంతియుత సహాయనిరాకరణసమరము దక్షిణాఫ్రికా ప్రభుత్వముపైన జరిపి అందులో జయించెను. పిమ్మట 1915 లో, ఆయన తిరిగి భారతదేశమునకు వచ్చినపుడు మహాకవి రవీంద్రుడు గాంధిని "మహాత్ముడని" సత్కరించెను. ఇండియాలోకూడా చంపరాన్, కేరా, అహమ్మదాబాదు ప్రాంతాలలో, ఆయన మొదటి శాంతియుత సమరమును సాగించెను. ఈ శాంతిసమరములలోనెల్ల ఆయన ఆత్మశక్తి కఠినపరీక్షకుగురియై అందులో ఆయన నెగ్గెను.

5. During the first Great World War (1914—1918), he supported the war-effort of the then British Government of India. But after the war he lost faith in the British Government and started his first nation-wide Non-Cooperative Movement in 1921. During the Movement boys boycotted the schools; foreign goods were put on bon-fire

and many people resigned from Government service. But when there were some violent acts here and there, he called off the movement. Then he was arrested and imprisoned. It was during this period of imprisonment, that he wrote his autobiography in Guzerati, which was later on translated into English by Mr. Mahadev Desai.

5. మొదటిప్రపంచయుద్ధకాలములో (1914-18) అప్పటి బ్రిటిషుప్రభుత్వమువారి యుద్ధ ప్రయత్నములను ఆయన బలపరచెను. కాని యుద్ధానంతరము, బ్రిటిషు ప్రభుత్వమునందు ఆయనకు విశ్వాసముసడలి, దేశవిస్తృతమైన ఆయన మొదటి సహాయనిరాకరణోద్యమము 1921 వ సంవత్సరమున నారంభించెను. ఈ యుద్యమమందు విద్యార్థులు పాఠశాలలు బహిష్కరించిరి. విదేశవస్తువులు అగ్నికాహుతి చేయబడెను. ఎందరో ప్రభుత్వపదవులకు రాజీనామాయిచ్చిరి. కాని అచ్చటచ్చట కొన్ని దౌర్జన్యకార్యములు జరుగగా, గాంధి యీ యుద్యమమును ఉపసంహరించెను. అనంతరము ఆయనను అరెస్టుగావించి కారాగారమందుంచిరి. ఈ కారాగారవాస కాలమందే, ఆయన గుజరాతి భాషలో, తన స్వీయ జీవితచరిత్ర రచించెను. ఆ జీవితచరిత్రయే తరువాత మహాదేవదేశాయి ఆంగ్లములోని కనువదించెను.

6. After his release from jail, Mahatma took up the cause of constructive work like Khadi, uplift of the Harijans, Prohibition and later on, Village Industries etc.

6. కారాగారమునుండి విడుదలయైన అనంతరము, గాంధి ఖాదీయుద్యమము, హరిజనోద్ధరణ, మద్యపాన నిషేధము, గ్రామ పరిశ్రమలు మొదలగు నిర్మాణకార్యక్రమము లందు పాల్గొనెను.

7. When the Indian National Congress passed the Independence Resolution in 1930, Mahatma once again started his non-violent Non-cooperation Movement. Anyhow the Movement came to a stop with the Gandhi-Irwin pact, which made him attend the Second Round Table Conference in 1931-32. But all his efforts to secure Poorna Swaraj there bore no fruit.

7. జాతీయకాంగ్రెసు మహాసభ 1930 లో స్వతంత్ర తీర్మానము కావించినపుడు, మహాత్ముడు తిరిగి తన శాంతియుత సహాయనిరాకరణోద్యమమును నడిపెను. అయినను, గాంధి - యిర్విను ఒడంబడిక ననుసరించి యీ యుద్యమము నాపి, గాంధి రెండవ రౌండుటేబిలు మహాసభలో పాల్గొనుటకు వెళ్ళెను.

(1931-32). కాని ఆయన పూర్ణస్వరాజ్యసంపాదనా ప్రయత్నము లన్నియు విఫలమయ్యెను.

8. During the Second Great World War, he started his famous Quit India Movement in 1942, when he was kept in Aghakhan Palace. It is here he lost his beloved life-partner Kasturba and his life-associate, Mahadev Desai. After his release, he struggled hard to put an end to the Hindu-Muslim riots in Bengal and then in Delhi. When on 15th January 1947, the whole nation was celebrating the First Independence Day, Mahatma Gandhi had it as his mourning day, trekking from village to village in Naukhali, preaching from door to door his message of love and truth.

8. రెండవ ప్రపంచయుద్ధకాలమందు 1942 వ సంవత్సరమున ఆయన తన ప్రసిద్ధమైన 'క్విట్ ఇండియా' ఉద్యమమును ప్రకటించెను. ఆయనను అప్పుడు ఆగాఖాను భవనమున నిర్బంధించిరి. ఆ భవనముననే గాంధి ఆయన జీవితభాగస్వామినియైన కస్తూర్బాను, తన జీవితసహచరుడైన మహాదేవదేశాయిని కోల్పోయెను. అందుండి విడుదలకాగానే, బెంగాలునందును,

ఢిల్లీయందును రేగిన హిందూముస్లిముల అల్లరుల నంతరింపచేయ కష్టించెను. 1947 ఆగష్టు 15-వ తేది దేశమంతయు స్వాతంత్ర దినోత్సవము సంతోషముగా జరుపుకొనుచుండ, మహాత్మునకా దినము సంతాపకరదినమై, ఆయన నౌఖాళిప్రాంతమందు ఊరూర, యింటింటికి తిరిగి తన సత్యప్రేమల సందేశమును ప్రబోధించు చుండెను.

9. His religious policy of appeasing the Muslims was not liked by some fanatic Hindus. On 30th Janaury 1948, when he was on his way to attend his evening Prayer Meeting, he was shot dead by one Nathuram Godse. The whole Nation, nay, the whole World mourned Gandhiji's death.

9. గాంధిగారి ముస్లిముల సమాధానపరచు పద్ధతి హిందు వులలో తీవ్రావేశముగల కొందరి కయిష్టముగా నుండెను. 1948 జనవరి 30 వ తేదినాడు ఆయన తన మామూలు సాయంకాల ప్రార్థన సమావేశమునకు పోవుచుండగా "నాథూరాంగోడ్సే" అను వానిచే కాల్చి చంపబడెను. దేశమేగాకుండా, సర్వప్రపంచము మహాత్ముని మరణమునకు కన్నీరునించెను.





పండిత జవహర్ లాల్ నెహ్రూ

# 108. Jawaharlal Nehru

(1889—1964)

## జవహర్లాల్ నెహ్రూ

Jawaharlal Nehru, the first Prime Minister of Independent India was born on 14th November, 1889 at Allahabad in the rich Nehru family. His father, great Motilal Nehru was a highly successful lawyer at Allahabad. He had roaring practice and his earnings were huge. Jawaharlal, was his first son and so he was brought up in a princely fashion. In his fifteenth year itself Jawaharlal was sent to England for studies. There he joined the Harrow Public School. But he did not feel happy at this Public School. But he liked his University Education very much. He completed his course of studies as a barrister-at-law and returned to India in 1912 to practice at Allahabad.

శ్రీ జవహర్లాల్‌నెహ్రూ స్వతంత్ర భారతదేశమునకు మొదటి ప్రధాని. ఆయన అలహాబాదు నగరమందు, ధనికులగు

నెహ్రూ కుటుంబములో 1889 వ సంవత్సరము, నవంబరు నెల 14 వ తేదినాడు జన్మించెను. ఆయన తండ్రి, మోతీలాల్ నెహ్రూ, అలహాబాదులో గొప్ప పేరుపొందిన ప్రసిద్ధ న్యాయవాది. ఆయనకు ప్రాక్టీసు, రాబడియుకూడా చాలా అధికముగా నుండెను. జవహర్లాలు ఆయనకు ప్రథమపుత్రుడైనందున, అతడొక రాజకుమారునివలె పెంచబడెను. అతని పదునైదవయేటనే, జవహర్లాలు చదువులకొరకు ఇంగ్లాండు దేశమునకు బంపబడెను. అక్కడ ఆయన హారోపబ్లికు పాఠశాలలో ప్రవేశించెను. అయినను ఆయన ఆ పాఠశాలలో ఆనందమొందలేదు. కాని విశ్వవిద్యాలయమందలి విద్యాభ్యాసమం దతని కిష్టమధికముగా నుండెను. ఆయన తన చదువులను పూర్తిచేసి అలహాబాదులో బారిష్టరుగా 1912 వ సంవత్సరములో ప్రాక్టీసుచేయుటకు ఇండియాకు తిరిగివచ్చెను.

Soon he became engaged in Politics and was elected as the Secretary of the Allahabad Branch of the Home Rule League started by Anne Besant. But soon, he was attracted by the selfless and saintly personality of Mahatma Gandhi into the Congress fold, followed by his own father, Motilal Nehru. As a result of this, the Nehru family gave up all its luxurious ways and sacrificed all their wealth for the sake of their mother country.

శీఘ్రముగానే రాజకీయాలలో ఆయన మునిగిపోయెను. అలహాబాదులోని అనిబిసెంటుచేత ఆరంభింపబడిన హోంరూలు లీగుశాఖకు అతడు కార్యదర్శిగాయెన్నుకొనబడెను. కాని, తొందరగానే అతడు, స్వార్థత్యాగియు, సన్న్యాసియునైన మహాత్మా గాంధీచే ఆకర్షింపబడి, ఆయనతండ్రి మోతీలాల్‌తోకూడా కాంగ్రెసునందు ప్రవేశించెను. దాని ఫలితముగా నెహ్రూకుటుంబము, వారివిలాసజీవితవిధానములు విడిచిపెట్టి వారి ధనమంతయు మాతృదేశముకొరకు, త్యాగముచేసిరి.

During the very first Non-Cooperation Movement of Mahatma Gandhi, young Jawaharlal became a leader of the first rank. In 1923 he was elected General Secretary of the All India Congress Committee. He then became the Chairman of the Allahabad Municipality. Then in 1929 he was elected the President of Indian National Congress for the first time, to preside over the Congress session at Lahore. It is here that the Independence Resolution was passed.

మొదటి సహాయ నిరాకరణోద్యమకాలమునందే యువకుడైన జవహర్లాలు ప్రథమశ్రేణికిచెందిన నాయకు డయ్యెను. 1923 వ సంవత్సరమున అఖిలభారత కాంగ్రెసు కమిటీకి జనరల్

సెక్రటరి (కార్యదర్శి) గా యెన్నుకొనబడెను. అనంతరము అలహాబాదు పురపాలకసంఘమునకు ఆయన అధ్యక్షుడయ్యెను. పిమ్మట 1929 వ సంవత్సరమున, ఆయన లాహోరులో జరిగిన భారతకాంగ్రెసు మహాసభ కధ్యక్షుడుగా యెన్నుకొనబడెను. ఈ లాహోరు కాంగ్రెస్ మహాసభలోనే భారతదేశ స్వాతంత్ర్య తీర్మానము చేయబడినది.

Jawaharlal married a beautiful Kashmiri girl named Kamala. She too sacrificed as much as her husband for the sake of the Country. Along with other members of the family, she also went to prison many a time. So her health broke and she died very early in February, 1936. The death of Kamala, his wife was felt as a shock by Jawahar. She had borne him, a daughter named Indira Priyadarsini, who is now the Prime Minister of India.

జవహర్లాలు 'కమల' అనే ఒక అందమైన కాశ్మీర యువతిని పెండ్లాడెను. ఆమెకూడా దేశముకొరకు, ఆమె భర్తవలె త్యాగముచేసెను. ఆమె కూడా చాలమార్లు కారాగారమునకు వెళ్లెను. అందువలన ఆమె ఆరోగ్యముచెడి, చిన్నవయసునందే 1936 ఫిబ్రవరినెలలో కీర్తిశేషురాలయ్యెను. భార్యయైన కమలాదేవి

మరణము జవహర్లాలునకు చాలా ఆవేదనకలిగించెను. ఆమె వలన ఆయనకు ఇందిరా ప్రియదర్శిని అనే ఒకకుమార్తె కలిగెను. ఆమె యిప్పుడు భారతదేశ ప్రధానిగానున్నది.

Jawharlal toured the whole country canvassing for the Congress Party during the elections held under the Government of India Act, 1935. Consequently, the Congress won a great victory and was able to form Ministries in eight out of 11 provinces in 1937.

జవహర్లాలు, 1935 వ సంవత్సరపు ఇండియా ప్రభుత్వ శాసనమును అనుసరించి జరిగిన ఎన్నికలలో దేశమంతయు కాంగ్రెసుపక్షమునకుగాను ప్రచారముచేయుచు పర్యటించెను. దాని ఫలితముగా 1937 వ సంవత్సరమున భారతదేశమునగల 11 రాష్ట్రములలో, యెనిమిదిరాష్ట్రములందు, ఎన్నికలలో కాంగ్రెసుపక్షము విజయముపొంది, మంత్రివర్గముల నేర్పాటు చేయగలిగెను.

Jawaharlal helped the people of the native states in their struggle for freedom against their rulers. He went to Europe in 1938 and saw the preparations everywhere

for the Second World War. When the war actually broke out in 1939, the Congress Ministries resigned, as the British Government refused to admit India's right to freedom. So, in 1942 the Congress Working Committee passed the 'Quit India' Resolution. There upon the British Government imprisoned all the Congress leaders including Jawaharlal.

జవహర్లాలు, దేశీయసంస్థానములలోని ప్రజలు తమ పాలకులమీద చేసిన స్వాతంత్ర్య పోరాటములో ప్రజలకు సాయపడెను. అతడు 1938 వ సంవత్సరమున ఐరోపాఖండమునకు పోయి అచట రెండవప్రపంచయుద్ధమునకు చేయబడే సన్నాహములను అన్నిచోట్ల చూచెను. యుద్ధము ప్రారంభించినవెంటనే 1939 లో కాంగ్రెసుమంత్రివర్గములన్నియు, భారతదేశముయొక్క స్వాతంత్ర్యహక్కును, బ్రిటిషుప్రభుత్వము నిరాకరించినందున, రాజీనామాయిచ్చెను. అందువలన 1942 వ సంవత్సరములో, కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘము 'బ్రిటిషువారూ ఇండియాను విడిచిపొండు' అను తీర్మానముగావించెను. అందుపైన బ్రిటిషు ప్రభుత్వము కాంగ్రెసు నాయకులందరిని, జవహర్లాలుతో సహా చెరసాలయందుంచెను.

When the Country was partitioned in 1947, with the grant of political freedom,

Jawharlal was very much pained. But as the undisputed Congress leader and the First Prime Minister of Independent India for more than Seventeen years, he strove hard for achieving Economic Freedom and Socialistic pattern of Society. As a result of continuous work in the cause of the nation, his health broke down and he breathed his last on 27th May 1964.

1947 వ సంవత్సరమున, రాజకీయస్వాతంత్ర్యములభించి, దేశ విభజన జరిగినపుడు, జవహర్లాలు చాలాబాధపడెను. అయినను, కాంగ్రెసుపక్షమునకు ఎదురులేని నాయకుడుగాను, స్వతంత్ర భారతమునకు ప్రథమ ప్రధానమంత్రిగాను, పదుహేడు సంవత్సరములు, ఆర్థికస్వాతంత్ర్యము, సాంఘికసమానత్వమును సాధించుటకు చాలాకష్టించెను. దేశముకొరకు, యెడతెగకుండ కృషిచేసిన ఫలితముగా, వారి ఆరోగ్యము చాలా దెబ్బతిని, ఆయన 1964-వ సం॥ మే నెల 27 వ తేదిన కీర్తిశేషులైరి.



# 109. Shri T. Prakasam, the Andhrakesari

(1872—1957)

## ఆంధ్రకేసరి

## శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు

Shri Tanguturi Prakasam Panthulu is well-known to every Andhra, as the Andhra Kesari; for he fought as a lion for the sake of the mother Country in general and the Andhras in particular.

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు ఆంధ్రకేసరిగా ఆంధ్రులందరికి తెలిసినవారు. ఎందుకనగా ఆయన మాతృదేశము నకుగాను, ప్రత్యేకముగా ఆంధ్రులకుగాను సింహమువలె పోరాడెను.

He was born in 1872 in a village called Valluru in Guntur District. He had his elementary education in his native village school. He was a bit mischievous as a student but he was well up in his studies.

So, though his father died even when he was a boy, his mother took all the trouble to educate him. He exhibited a taste for acting on the stage during his educational career. He had his legal studies in Madras. He earned both a good name and income as a lawyer.

ఆయన 1872 వ సంవత్సరములో గుంటూరి మండల మందలి వల్లూరనుగ్రామమున జన్మించెను. ఆయన తనస్వగ్రామ మందలి పాఠశాలలో ప్రాథమికవిద్యను గడించెను. విద్యార్థిగా ఆయన కొంచెము చిలిపిగాఉండినప్పటికి, చదువులందు బాగుగా నుండెను. కనుక ఆయన బాలుడుగానుండినప్పుడు తన తండ్రి చనిపోయినను, అతనితల్లి అతనిని చదివించుటకు అన్ని కష్టములు పడెను. ఆయన చదువుకొనేకాలమందు రంగనటన యందు అభి రుచి కనబరచెను. ఆయన తన న్యాయశాస్త్రవిద్య మదరాసులోనే గడించెను. న్యాయవాదిగా మంచి పేరు, ఆదాయముకూడా సంపాదించెను.

He went also to England and got himself qualified as a barrister. In England he happened to hear and meet the great Indian National Leaders like Dadabhai Naoroji and Lala Lajpat Rai. As a result of this,

he became more and more interested in politics and service of mother Country.

ఆయన ఇంగ్లాడుకుగూడ వెళ్ళి అచట బారిస్టరు పట్టము పొందెను. ఆయన, ఇంగ్లాండులో దాదాభాయి నౌరోజీ, లాలా లజపతిరాయిలవంటి గొప్ప జాతీయనాయకులను కలుసుకొని, వారి ఉపన్యాసములను వినుట తటస్థించెను. తత్ఫలితముగా, ఆయనకు రాజకీయవ్యవహారాలలో అధికాధికముగా ఆసక్తి హెచ్చి మాతృదేశమునకు సేవచేయుటకు మనసుగలిగెను.

Then he came to India and started his legal practice at Madras. Gradually he rose up in the esteem of the people as a lawyer and his earnings also swelled. When he was at the zenith of his professional practice and income, he was attracted by the National Movement of Lokamanya Bala Gangadhar Tilak. He gave up all his lucrative practice and threw himself heart and soul into the national movement. He sacrificed everything he possessed in the service of the mother Country. He was arrested and imprisoned several times by the British Government. But nothing could change his mind for the Country. He was so undaunted in his love

for the country that he did not flinch to face the bullets of the British army during the days of the boycott of Simon Commission. This lion-like bravery on his part brought him the title of 'Andhra Kesari.'

పిమ్మట ఆయన ఇండియాకువచ్చి మదరాసులో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించెను, క్రమముగా ఆయనకు ప్రజలలో ప్రతిష్ఠ పలుకుబడి హెచ్చెను. ఆయన సంపాదనకూడా క్రమముగా పెరిగెను. ఆయన తనవృత్తియందు అత్యున్నత స్థితిలోనుండినప్పుడు, లోకమాన్య బాలగంగాధర తిలకు ఆరంభించిన జాతీయోద్యమములోనికి ఆకర్షింపబడెను. ఆయన తన గొప్ప ఆదాయముగల న్యాయవాదవృత్తివదలుకొని, తన సర్వస్వమును, జాతీయోద్యమమునందురికి సంపూర్ణత్యాగముజేసెను. మాతృదేశ సేవకుగాను ఆయనకున్నదంతయు ధారపోసెను. ఆనాటి బ్రిటిషు ప్రభుత్వమువారు ఆయనను యెన్నియోమారులు అరెస్టు చేసి కారాగారమందుంచిరి. ఐనను దేశసేవకు అంకితమైన ఆయనమనసు మారలేదు. ఆయన దేశభక్తియందు యేమాత్రము వెనుకంజవేయని ధైర్యశాలి. అందువలన సైమన్‌కమీషన్ బహిష్కరణోద్యమకాలమందు బ్రిటిషుసైనికుల తుపాకిగుండ్లకు ఎదురొడ్డినిలిచెను. ఇటువంటి ఆయన సింహసమానమైన ధీరోదాత్తతయే, ఆయనకు "ఆంధ్రకేసరి" అను బిరుదమును సంపాదించిపెట్టెను.

Andhrakesari was not only a great freedom fighter but also an able administrator. As Revenue Minister in the first Rajagopalachari Ministry and as the Chief Minister of Composite Madras State and as the first Chief Minister of Andhra State, his abilities were exhibited.

ఆంధ్రకేసరి కేవలము స్వాతంత్ర్యయోధుడే కాకుండా మంచిపరిపాలనాదక్షుడుకూడా. మొదటి రాజగోపాలాచారిగారి మంత్రివర్గములో రెవెన్యూశాఖా మంత్రిగాను, సంయుక్తమదరాసు రాష్ట్రముఖ్యమంత్రిగాను, ప్రథమాంధ్రరాష్ట్రముఖ్యమంత్రిగాను, ఆయన పరిపాలనా సామర్థ్యము బాగా వెల్లడి అయ్యెను.

He was also a great speaker and writer. The daily he started, named Swarajya, had once greatest circulation in the Country. It was under his able guidance many young men were trained up in the art of newspaper editing and many of those who worked with him in 'Swaraja' came to occupy many eminent positions in the News paper and journalistic world. He died in his ripe old age of 86 years, in 1957 at Hyderabad.

ఆయన మంచి వక్తయేగాక బాగుగా వ్రాయగలిగినవారు కూడా. ఆయన ఆరంభించిన 'స్వరాజ్య' అను దినపత్రిక ఒకప్పుడు దేశమందు అత్యధికవ్యాప్తిగలిగియుండెను. ఆయన సమర్ధవంతమైన పర్యవేక్షణలో ఎందరో యువకులు, పత్రికాసంపాదకులుగా శిక్షణ పొందిరి. అట్టివారిలో, ఆయనతోపనిచేసినవారు చాలామంది, నేడు పత్రికాప్రపంచమున గొప్పస్థానములలో నున్నారు. ఆయన తన 86 వ యేట పండుముసలిగా 1957 వ సంవత్సరములో హైదరాబాదు నగరమందు కీర్తిశేషులైరి.

# 110. The Coronation of Sri Ramachandra

## శ్రీరామ పట్టాభిషేకము

When Ravana was killed and the period of his banishment for 14 years was over, Sri Rama started to Ayodhya with his wife Sita, brother Lakshmana and others in the fomous aerial car Pushpaka.

రావణుడు చంపబడి, ఆయన పదునాలుగేండ్ల వనవాస కాలము ముగియుటతోడనే, శ్రీరాముడు ఆయన భార్యయగు సీతాదేవితోడను, తమ్ముడగు లక్ష్మణునితోడను, తదితరులతోడను కలిసి పుష్పక విమానమున అయోధ్యకు పయనమయ్యెను.

As they travelled in the air Rama showed to Sita all places of interest below. When Kishkindha was shown, Sita wanted to take with her to Ayodhya Jara and other Vanara ladies. Rama agreed to this proposal of Sita and asked Sugriva to bring all the ladies quickly. When they got in the aerial car it moved. It flew over the Rishyamuka

Mountain and other places where they halted and lived during the fourteen years, the period of their banishment. Then they came to the hermitage of Bharadwaja where they alighted from the car, to pay their respects to the sage Bharadwaja.

వారు ఆకాశమార్గమందు ప్రయాణముచేయుచుండగా శ్రీరాముడు సీతకు భూమిపైనగల ఆసక్తిజనకమైన స్థలాలను చూపించెను. కిష్కింధానగరమునుచూపి నప్పుడు సీతాదేవి, జర మొదలగు వానరస్త్రీలను, తనతోకూడా, అయోధ్యకు తీసుకొని పోవలయునని కోరెను. శ్రీరాముడు అందులకు సమ్మతించి వానరస్త్రీల నందరిని త్వరగా తీసుకొని రమ్మని సుగ్రీవునితో చెప్పెను. వారందరు అందులో ఎక్కినవెంటనే తిరిగి విమానము బయలుదేరెను. ఆ విమానము ఋష్యమూక పర్వతమును, వారు తమ పదునాలుగేండ్ల వనవాసకాలమందు నిలిచినివసించిన తదితర స్థలములమీదుగా యెగిరిపోయెను. పిమ్మట వారు భరద్వాజాశ్రమమునకువచ్చి విమానమునుండి భరద్వాజమునీశ్వరుల కభివాదనము చేయుటకుదిగిరి.

Sage Bharadwaja was very glad to see Sri Rama back with his wife and brother and told Sri Rama that all was well at Ayodhya. He congratulated the prince on

his happy return and entertained the whole party for that day. Now Rama sent Hanuman to Ayodhya to inform Bharata of his arrival, along with Sita and Lakshmana, so that he might be prepared to meet his brothers.

భరద్వాజమహర్షి శ్రీరాము డాయన భార్యా సోదరులతో తిరిగివచ్చుటజూచి చాల సంతోషించి అయోధ్యలో అందరు క్షేమముగానున్నారని తెలిపెను. ఆయన శ్రీరాములవారు సంతోషకరముగా తిరిగివచ్చుటకు అభినందించి, ఆనాడు ఆ శ్రీరాములవారి సహచరుల కందరికి విందుచేసెను. ఆపుడు శ్రీరాములవారు తనరాకనుగూర్చి భరతునికి తెలియచేయుటకు హనుమంతుని అయోధ్యకు బంపెను. అందువలన భరతుడు తన అన్నయగు శ్రీరాముని కలుసుకొనుటకు వలయు సన్నాహములు సకాలమున చేయగలిగెను.

Hanuman flew at once from the hermitage of Bharadwaja and reached Nandigrama, a village in the suburbs of Ayodhya, where Prince Bharata was living as an ascetic and ruling as a deputy of Sri Rama. He announced to Bharata the happy news of the home coming of Sri Rama, with Sita and Lakshmana. He said that Sri Rama would

be resting for that night at the hermitage of the sage Bharadwaja and go over to Bharata next day.

హనుమంతుడు వెంటనే భరద్వాజాశ్రమమునుండి ఎగిరి, అయోధ్యానగరపరిసరమందున్న నందిగ్రామమును చేరెను. అచ్చట భరతుడు శ్రీరామునకు బదులుగా రాజ్యపాలనముచేయుచు మునిగా జీవించుచుండెను. అచట సీతాలక్ష్మణులతో కలిసి శ్రీరాముడు వచ్చుచున్నాడనే సంతోషవార్త భరతునికి హనుమంతుడు ప్రకటించెను. శ్రీరాముడారాత్రి భరద్వాజాశ్రమమున గడపి, మరునాడు అయోధ్యానగరమునకు వచ్చునని ఆతడనెను.

At once Bharata ordered that the whole city of Ayodhya should be decorated and made ready to receive Rama and Sita. He placed his brother Satrugna in charge of all the arrangements to be made.

వెంటనే భరతుడు, అయోధ్యానగరమంతయు అలంకరించి, శ్రీ సీతారాముల నాహ్వానించుటకు తగినట్లు అంతా తయారు చేయుటకు ఆజ్ఞాపించెను. చేయవలసిన యేర్పాట్లకన్నిటికి అధికారిగా, తన తమ్ముడైన శత్రుఘ్నుని భరతుడు నియమించెను.

Satrugna employed a thousand labourers in an hour and ordered that, before sunrise the next morning, all the roads

leading to Ayodhya and all the streets in that city should be widened and watered and strewn with flowers; and all the houses on the main road leading to the palace of Dasaratha should be white-washed and that flags should be flown on all high buildings.

శత్రుఘ్ను డొకగంటలో ఒక వేయిమంది కార్మికులను యేర్పాటుచేసి, మరునాడు తెల్లవారులోపల అయోధ్యానగరమునకు దారితీసే బాటలన్నిటిని, అయోధ్యానగరములోని వీధులన్నిటిని, వెడల్పుచేసి, కడిగి, పూలను చల్లవలెనని ఆజ్ఞాపించెను. దశరథ మహారాజు ప్రాసాదముండే వీధికి రెండువైపులనుండే యిండ్ల కన్నిటికి సున్నముపూయించి, మేడలపైన పతాకములను ఎగుర వేయవలెనని ఆజ్ఞలు జారీచేయబడెను.

The news of Rama's arrival spread like wild fire throughout the city. All the citizens felt overjoyed and shed tears of joy. They spent all the night in speaking about those unhappy events that had happened fourteen years ago and about the virtues of Rama, charms of Sita and loyalty of Lakshmana.

శ్రీరాముని రాకవిషము దావానలమువలె నలుగడల నగర మంతటా వ్యాపించెను. పౌరులందరు చాలా సంతోషించి ఆనంద

బాష్పములరాల్చిరి. వారారాత్రిఅంతయు పదునాలుగేండ్లక్రిందట జరిగిన సంభవములనుగూర్చియు, శ్రీరామచంద్రుని సద్గుణములనుగురించియు, సీతాదేవి సౌందర్యమునుగూర్చియు, లక్ష్మణుని ప్రభుభక్తినిగూర్చియు మాట్లాడుకొనుచు, గడిపిరి.

On the morrow, long before the day dawned people began to assemble in their thousands at Nandigrama, where Sri Rama was first expected to come and meet Bharata. All the members of the royal family and ministers and merchants, peasants and warriors, men and women and boys and girls marched to the place in their best dress.

మరునాటి ఉదయము, సూర్యోదయమునకు పూర్వము ప్రజలు నందిగ్రామమునకు తండోపతండములుగా చేరిరి. శ్రీరాముడు మొట్టమొదట భరతుని కలుసుకొనుటకు నందిగ్రామమునకు వచ్చుచున్నందువలన ప్రజలందరచ్చటికే చేరిరి. రాజకుటుంబమువారు అందరును, మంత్రులు, వ్యాపారులు, వ్యావసాయికులు, యోధులు, స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు మొదలగు అన్నివర్గాలవారు, వారివారి శక్త్యానుసారము అలంకరించుకొని, ఆ నందిగ్రామమునకు వచ్చిచేరిరి.

The vast crowd was properly arranged into a procession headed by Bharata and

followed by ministers and other dignitaries. Bharata carried on his head Rama's sandals, which he had brought from Chitrakuta. All stood in their respective places straining their eyes to see, if Rama and his party were coming. In a few minutes, the aerial car, Pushpaka arrived there and gradually it came down and touched the ground. Immediately Bharata went in and prostrated himself at the feet of Rama, who took him into his arms and embraced him affectionately. Then Bharata greeted Lakshmana and bowed at the feet of Sita. Then he welcomed all the Vanara Chiefs and Vibhishana.

ఆ జనసమూహమంతయు చక్కగా బారులుతీర్చి నిలబడి భరతుని ఆధిపత్యమున నొక ఊరేగింపుగా యేర్పడెను. భరతునివెంట మంత్రులును, యితర ఉన్నతోద్యోగులునుండిరి. భరతుడు తనతలపైన, మునుపు చిత్రకూటపర్వతమునుండితెచ్చిన శ్రీరాముని పాదుకలను మోసికొనిపోయెను. అందరును వారివారి స్థలములందునిలువబడి, రాముడు, ఆయన అనుచరవర్గము వచ్చుచున్నారేమోనని ఆవైపే దృష్టినిగిడ్చి అనుక్షణము నిరీక్షించుచుండిరి. కొన్నినిమిషాలలో పుష్పకవిమానము అచటికివచ్చి

చేరెను. క్రమముగా క్రిందికిదిగి భూమినిదాకెను. వెంటనే భరతుడు వెళ్ళి శ్రీరాముని పాదములకడ మోకరిల్లెను. శ్రీరాముడును భరతుని అనురాగముతో లేవనెత్తి కౌగలించుకొనెను. పిమ్మట భరతుడు లక్ష్మణుని విచారించి, సీతాదేవి పాదములకు ప్రణమిల్లెను. ఆ అనంతరము వానరనాయకులను, విభీషణుని పరామర్శించెను.

After all the greeting business was over Bharata fitted the sandals to Rama's feet and handed over to him the charge he had been holding for fourteen years. He requested him to relieve him of the responsibility of ruling over the Kingdom of Ayodhya. Rama agreed and at once preparations were set on foot for his Coronation or Pattabhisheka Mahotsavam.

పరామర్శ కార్యమంతయు ముగిసిన వెనుక, భరతుడు పాదుకలను శ్రీరామునిపాదములకుతొడిగి, పదునాలుగేండ్లు తాను బూనిన రాజ్యభారమును రామునికప్పగించి, అయోధ్యారాజ్య పరిపాలనా బాధ్యతనుండి తనకు విశ్రాంతినిమ్మని ప్రార్థించెను. రాముడందుకు సమ్మతించెను. వెంటనే శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవానికి అన్ని సన్నాహములు ఆరంభింపబడెను.

The brothers cast off their ascetic garb and their malted locks were freed and they put on princely costumes. The queen mothers affectionately attended upon their daughter-in-law Sita and dressed her in the richest clothes and adorned her with princely ornaments. On the morrow the old royal priest Vasista seated Rama and Sita on the jewelled throne of Ikshwaku Kings. Learned Brahmins chanted the Vedas and sprinkled on the heads of Rama and Sita the holy waters brought one night by Hanuman from all the sacred rivers. Then the purification ceremony was repeated by the select virgins, ministers, warriors and citizens. Then Vasishta placed the ancient jewelled Crown of the Ikshwaku Kings on Rama's head. Other priests followed him and adorned Rama's person with many traditional ornaments. While these ceremonies took place, Satrughna held the white royal umbrella over the throne, as Sugriva and

Vibhishana on either side, waved white chamaras. The Gods showered their choicest gifts on Rama, while the Gandharvas sang and the Apsaras danced.

సోదరులు తమమునివేషధారణయంతయు విడిచిరి. జడలు గట్టినవారి వెంట్రుకలు సరిచేయబడెను. రాజవేషమున కనువైన దుస్తులు ధరించిరి. రాజమాతలు, అత్యంత ప్రేమానురాగము లతో, తమ కోడలిగ సీతాదేవిని చేరదీసి ఆమె కనేక అమూల్య ములగు వస్త్రాభరణములతో నలంకరించిరి. మరునాడు పూర్వ రాజపురోహితుడగు వశిష్టమహర్షి సీతారాములను, యిక్ష్వాకు రాజుల సింహాసనముపైన ఆసీనులను జేసెను. పండితులు బ్రాహ్మణులు వేదమంత్రములు పఠించుచు, సీతారాముల తలల పైన ముందునాటి రాత్రి హనుమంతుడు, పుణ్యనదుల నుండి తెచ్చిన తీర్థజలములను చల్లిరి. అనంతరము, పెండ్లికాని ఆడ పడుచులును, మంత్రులును, యోధులును, పౌరులును పుణ్యాహ వాచనమంత్రములను పఠించిరి. పిమ్మట వశిష్టుడు రాముని శిరస్సుపైన యిక్ష్వాకురాజుల మణిఖచిత కిరీటమునుంచెను. ఇతర పురోహితులు వశిష్టుని అనుసరించి శ్రీరామచంద్రుని, అనేక సాంప్రదాయాభరణములతో అలంకరించిరి. ఈ ఉత్సవమంతయు జరుగుకాలమందు శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రము సింహాసనము పైన పట్టుకొనియుండెను. సుగ్రీవ విభీషణులు యిరువైపుల

చామరముల వీచిరి. దేవతలు శ్రీరామునికి తమయిష్టాతియిష్టమైన కోరికల గురిసిరి. గంధర్వులుపాడిరి. అప్సరసలాడిరి.

On this auspicious occasion Rama gave away thousands of coins, gold and diamonds to so many priests and friends and the poor, that had assembled in the hall to witness the ceremony. He presented to Sita, a beautiful necklace of pearls set with diamonds. She put it on her for sometime and then bestowed it on Hanuman, who bowed and received it amidst the applause of all the assembled people.

ఆ పుణ్యకాలమున శ్రీరాముడు అనేకదక్షిణలను, బంగారమును, రత్నములను, పురోహితులకు, మిత్రులకు, పేదలకు, అచటగూడిన తదితరజనులకు కానుకలిచ్చెను. సీతాదేవికి, ఒక అందమైన ముత్యాలహారమును బహూకరించెను. ఆమె ఆ హారమును కొంతసేపు ధరించి, హనుమంతుని కిచ్చివేసెను. అపుడు ఆసభాసదులందరు హర్ష ధ్వానములు చేసిరి.

After the coronation was over, all the Vanaras and Rakshasas were loaded with rich presents and sent to their countries. Then

Sri Rama raised his brother Bharata to the position of an associate ruler. Rama ruled the Kingdom for a very long time.

పట్టాభిషేక మహోత్సవము ముగిసిన అనంతరము వానరులు, రాక్షసులు మంచి బహుమతులతో వారివారి దేశములకు బంపి వేయబడిరి. పిమ్మట శ్రీరాముడు, తనతమ్ముడగు భరతునికి తనతోగూడ రాజ్యపరిపాలనచేయు పదవినిచ్చెను. రాము డయోధ్యారాజ్యమును చాలాకాలము పరిపాలించెను.



# అపూర్వ గ్రంథములు

| | | రు. పై. |
|---|---|---|
| 1. | భాగవతము (పద్యం) పూర్తి వాల్యూం | 19-00 |
| 2. | భారతం (వచనం) ఆదిపంచకం | 20-00 |
| 3. | ,, (పద్యం) ,, | 14-00 |
| 4. | ,, యుద్ధషట్కము | 15-00 |
| 5. | గానకళాబోధిని | 20-00 |
| 6 | ఆంధ్రుల చరిత్ర సంస్కృతి | 8-00 |
| 7. | విజయనగర చరిత్ర | 8-00 |
| 8 | ఇంగ్లీషు-తెలుగు మీడియం డిక్షనరి | 12-00 |
| 9. | ,, ,, ప్యాకెట్టుసైజు | 4-25 |
| 10. | అబలా జీవితం | 10-00 |
| 11. | రామదాసు చరిత్ర (క్యాలికో బైండు) | [illegible]-00 |
| 12. | బాలల భారత భాగవత కథలు | 4-[illegible] |
| 13. | కరణాల [illegible]త్రీ | 5-00 |
| 14. | అశోకా [illegible]డి [illegible] (నెలల్లో [illegible]) | 2-50 |
| 15. | గ[illegible] ( [illegible] [illegible]) | 3-00 |
| 16. | ,, | |

## బాలసరస్వతీ బుక్ డిపో

పి. బి. నెం. 1. కర్నూలు : మద్రాసు-1